చర్మసౌందర్యానికి, ఆరోగ్య భద్రతకు మన పూర్వీకులు వాడే ఆ సున్నిపిండిని చక్కని ఔ

సున్నిపిండిగా తక్కువ ఖర్చుతో ప్రజలకు అందిస్తున్న అశ్విని వారికి అభినందనలు .....

- డా॥ జె. గీ

నేను గత 6 నెలలుగా అశ్విని హెర్బల్ బాత్ పౌడర్ వాడుచున్నాను. ఇది చర్మాన్ని మృదువుగా ఆరోగ్యంగా వుంచడమే కాకుండా ఆహ్లాదంగా వుంచుతూ చక్కని సువాసనను కలిగి వుంది. మన సాంప్రదాయక సున్నిపిండిలో అశ్విని వారు వనమూలికలను జతచేయడం వలన ఇది చర్మానికి రక్షణ ఇస్తుంది.

నా చిన్నతనంలో మా అమ్మ, అమ్మమ్మ కూడా పూర్వం సున్నిపిండిని వాడి వారి శరీర సున్నితాన్ని కాంతిని కాపాడుకోవడాన్ని ఈ అశ్విని హెర్బల్ బాత్ పౌడర్ గుర్తుకు తెస్తున్నది.

చర్మసౌందర్యానికి, ఆరోగ్య భద్రతకు మన పూర్వీకులు వాడే ఆ సున్నిపిండిని చక్కని ఔషధీకృత సున్నిపిండిగా తక్కువ ఖర్చుతో ప్రజలకు అందిస్తున్న అశ్విని వారికి అభినందనలు .

- డా॥ జె. గీతారెడ్డి



డా॥ జె. గీతారెడ్డి
MRCOG. (London)
Former Minister, Govt. of A.P.

# అశ్విని హెర్బల్ బాత్ పౌడర్

## ఔషధీకృత సున్నిపిండి.




- స్వేదరంధ్రాలను శుభ్రపరచి, రోజంతా తాజాగా వుంచుతుంది.
- కండరాల పటిష్టతకు తోడ్పడుతుంది.
- శరీర సహజ సమతౌల్యాన్ని నిలుపుతుంది.
- మీ చర్మాన్ని మృదువుగా ఆరోగ్యంగా వుంచుతుంది.

200 గ్రా. మరియు 500 గ్రా 'రీఫిల్' ప్యాక్స్‌లో కూడా లభ్యం

A[illegible] ADS

# చతుర ప్రపంచం

## మీ అమ్మ పేరేమిటి

స్త్రీలు తమకు సమానహక్కులు కావాలనిగానీ లేదా వరకట్నాన్ని నిషేధించాలనిగానీ నినాదాలు చేస్తూ ఎలాంటి సభలు, ఊరేగింపులు జరగవక్కడ. అసలు భర్తల ఆధిపత్యం లేదా భార్యలను హింసించే భర్తలు ఈ మాటలే వారికి చాలా ఆశ్చర్యంగా అనిపిస్తాయి. స్త్రీని అగౌరవపరిస్తే మానవజాతినంతటినీ అవమానపరిచిన ట్లే అని నమ్ముతారు అక్కడి ప్రజలు. ఆస్థిపాస్థులన్నీ స్త్రీల పేరనే వుంటాయి.

ఇంతకీ ఈ పద్ధతులన్నీ మేఘాలయా రాష్ట్రంలో వున్నట్టు తెలుస్తోంది. ఇక్కడి ప్రజల్లో 80 శాతం మంది గరో, ఖసి, జయంతి తెగలకు చెందినవారు. చదువు సంధ్యల్లో కూడా వీరు అభివృద్ధి పథంలో వున్నారు. కానీ తరతరాలనుంచి నడుస్తున్న కొన్ని ఆచారాలు మాత్రం ఇప్పటికీ అమలులో వున్నాయి. అందులో ఒకటి అక్కడుండే మాతృస్వామ్య వ్యవస్థ. చిన్నపిల్లల పుట్టుపూర్వోత్తరాల వివరాలు తల్లివైపునుంచి సేకరిస్తారక్కడ. కొడుకు పుట్టినప్పటికంటే కూతురు పుడితేనే ఎక్కువగా సంతోషిస్తారు. ఎందుకంటే కుటుంబ పేరుప్రఖ్యాతులు నిలిచేది ఆడపిల్లవలనే. ఆడపిల్లలు లేక కొడుకులు మాత్రమే వుంటే ఆస్థికోసం ఆడపిల్లను దత్తత చేసుకోవడమో లేక ఆ ఆస్థిని తల్లి తన చెల్లెలు లేదా అక్క కూతుళ్లకో రాయడం జరుగుతుంది. ఇదివరకు కేవలం ఆఖరున పుట్టిన కూతురుకే ఆస్థిపాస్థులు రాసేవారు. తరువాత ఆ పద్ధతిని కొంచెం



సడలించారు. తల్లిదండ్రులు తమ ఆడ పిల్లల్లో వృద్ధాప్యంలో తమను ప్రేమతో ఆదరించగలదనుకున్న అమ్మాయికి ఆస్థిని రాయడం ప్రారంభించారు. పెళ్ల య్యాక ఆడపిల్ల అత్తవారింటికి వెళ్లే పద్ధతి కాకుండా, మగపిల్లవాడే భార్య పుట్టింటికొ

చ్చి వుంటాడు. అక్కడున్న గరో ఈ తెగలన్నిటిలో కొద్దిపాటి మా ఇంచుమించు ఇలాంటి పద్ధతు కలో వున్నాయి. ఇప్పుడిప్పుడే పద్ధతుల్లో కూడా మార్పు చోట సుకుని ఆధునికత ప్రవేశిస్తోంది.

---

# 'సూపు' చరిత్ర

ఈ రోజుల్లో బయట పెద్ద హెూటళ్లలో భోజనం చేసినా లేదా ఏ డిన్నర్ పార్టీలకెళ్లినా ప్రప్రథమంగా 'సూపు' ఇవ్వడం మామూలై పోయిందిగానీ పూర్వం అసలు సూప్ అంటే నే ఏమిటో తెలియదు జనానికి. నిజానికి ఈ సూప్ చాలా బలవర్ధకమైన పానీయం! దీన్ని భోజనానికి ముందుగా ఇవ్వడానికి కారణం ఇది ఆకలిని వృద్ధి చేస్తుందని! సరిగ్గా తయా రుచేస్తే ఎంతో రుచిగా కూడా వుండే పానీయం ఇది.

ఓ 300 గ్రాముల సూపులో వుండే 'ఎ' విటమిను రెండు క్యాబేజిలు, నాలుగు టొమా టోలు, తొమ్మిది గుడ్లల్లో వుండే 'ఎ' విటమి నుకన్న ఎక్కువ అంటున్నారు పరిశోధకులు.

ఇది ఆకలిని పెంచడమే కాకుండా జలుబు ను తగ్గించడం, శరీరపు బరువును తగ్గించడా నికి తోడ్పడటంతో పాటు పాంక్రియాస్‌కి కాన్సర్ రాకుండా నిరోధించగల శక్తి దీనికి వుందంటున్నారు వైద్యులు.

అసలు 'సూప్' అనే ఈ పదార్థం సరిగ్గా ఎప్పుడు వాడకంలోకి వచ్చిందో స్పష్టంగా చెప్పలేకపోతున్నారు చరిత్రకారులు. ఆ మాట కొస్తే 5000 సంవత్సరాలకి పూర్వం చైనీ యుల వంటకాలకి సంబంధించిన పుస్తకాల్లో 'సూప్' ప్రస్తావన వుందంటున్నారు చరిత్రకా రులు.

"పావురాయి గ్రుడ్డుతో రుచికరమైన 'సూప్'ను ఎలా చేసుకోవచ్చు" అన్న విష యంపై ఒక సమగ్ర వివరణ అప్పటి వంటల పుస్తకాల్లో స్పష్టంగా రాసివుందట! పోతే... మధ్య ఆసియాలో కూడా క్రీ.పూ. 7000-8000 సంవత్సరాల మధ్యకాలంలో ఈ సూపు తయారీ ప్రారంభమైందని చరిత్ర చెబుతోంది. ఆ కాలంలో కరువు కాటకాలు వచ్చినప్పుడు పేదప్రజలు ఆకలితో అల్లాడు తుంటే 'సూప్' తయారుచేసి పోసేవారట. అటు తరువాత క్రమంగా ఈ సూపు తయారీ, సేవనం ఓ అలవాటుగా మారిపోయిందంటు న్నారు.

ఒలింపిక్ ఆటలు ప్రారంభమైన కొత్తల్లో ప్రతి ఆటగాడూ తనకూడా ఒక మేకపిల్లనో, గొర్రెపిల్లనో తెచ్చేవాడు. ఆట ప్రారంభానికి ముందు ఆ జీవాన్ని 'ఆడాస్' అనే దైవానికి బలిఇచ్చేవారు. అటుపైన ఈ బలిజంతువుల న్నిటినీ ఓ పెద్ద పాత్రలో వేసి సూపు తయారు చేసి దాన్ని ప్రసాదంలా భావించి ఆటగా ళ్లంతా తాగేవారు. పవిత్రమైన ఆ సూపు సేవిస్తే ఆటలలో వారి శక్తిసామర్థ్యాలు మరింత పెరుగుతాయని విశ్వసించేవారు.

సూపు తయారవుతుంటే దాని ఘుమఘు మలు కొంత దూరంవరకూ వ్యాపించి అంద రికీ నోరూరిస్తాయి. ఈ సూపుని కొంతమంది వేడిగా సేవిస్తే మరికొంతమంది చల్లార్చు కుని 'కోల్డ్ సూప్'లా తాగేవారు.

మొదట్లో మార్కెట్‌లలో డబ్బాలలో నిలు వచేసిన సూప్‌ని కొనుక్కుని తాగేవారు ప్రజ లు. రానురాను స్వయంగా సూపును తయా రుచేసుకుని తాగడం ప్రారంభించారు. సూపు కి అన్నిరకాల కూరగాయలను, ఆకుకూరల








నూ వాడవచ్చు. అలాగే అన్నిరకాల మాంసా లతోటి సూపు తయారుచేయవచ్చు. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్కరకం సూపును ఇష్టపడతారు జనం. ఫ్రాన్స్‌లో ఉల్లిపాయల సూపును, రష్యాలో క్యాబేజితోపాటు కొన్ని రకాల ఆకుకూరలను కలిపి తయారుచేసే సూపును ఎక్కువమంది ఇష్టపడతారు. అలాగే జర్మనీలో బీర్‌సూపు, బ్రిటన్‌లో ముల్లంగిసూపు, అమెరికాలో చికెన్ నూడిల్‌సూప్ ప్రసిద్ధి.

సూప్‌ను కొన్ని దేశాల్లో ఔషధంగానూ ఇస్తారు. ఆఫ్రికాదేశాల్లో కొన్నిరకాల రోగాల నుంచి బయటపడటం కోసం వెల్లుల్లి సూప్‌ను తాగుతారు. కొరియాలో తాగే 'పాముల సూప్' వల్ల ఆయుష్షు పెరుగుతుందని నమ్ముతారు అక్కడివారు.

స్కాట్‌లాండ్‌లో కొన్ని ప్రత్యేక రకాల పక్షుల సూపులను తయారుచేసుకుని తాగుతారు. అవి పడిశం, జ్వరం మొదలైన వ్యాధులకు ఔషధంగా పనిచేస్తాయి. ఈ పక్షులను ఉల్లిపాయలతో ఉడకపెట్టి సూపు తయారుచేస్తారు.

పూర్వకాలంలోను, ఆధునిక కాలంలోను కూడా ఈ సూప్ యొక్క గొప్పతనాన్ని వైద్యులు ఒప్పుకుంటూనే వున్నారు. అమెరికాలోని 'మౌంట్ సెనాయ్ మెడికల్ సెంటర్'కి చెందిన డాక్టర్ మార్విన్ 'సూప్' గురించి చెప్పిందేమంటే 'ఇది 'శ్వాసనాళంలో వుండే అడ్డంకులను తొలగించి, ఊపిరి అందక బాధపడుతున్న రోగులకు ఉపశమనం కలగజేస్తుంది' అని.

డాక్టర్ జార్జ్‌బర్ఛ్ అనే మరో అమెరికన్ వైద్యుడు 'సూపు' శరీరాన్ని డీహైడ్రేషన్ నుంచి కాపాడుతుంది' అంటాడు. ఇక జపాన్‌లోని టోక్యోకు చెందిన డాక్టర్ తఖేషీ హయామ్‌గారు ఈ సూపుమీద 17 సంవత్సరాలు రీసెర్చి చేసి తేల్చిందేమంటే పాంక్రియాస్ కాన్సర్‌కి సూపును మించిన ఔషధం లేదని దాన్ని రాకుండా చేసేందుకేకాక, రోగం ముదరకుండానే సూపు సేవనం ప్రారంభిస్తే దాన్ని తగ్గించవచ్చని కూడా ఈయన వాదన.

ఓ పెద్ద ఫ్రెంచి వంటవాడు ఈ సూపు గురించి తెగపొగుడుతూ 'ఇది అలసటను పోగొట్టి, ఆహ్లాదాన్ని కలిగించడమేకాక, భారీకాయులను నాజూగ్గా తయారుచేస్తుందనీ, అతిథులపట్ల గృహస్థు ఆదరం ఎంత ముఖ్యమో, డైనింగ్‌టేబుల్‌పైన ఆహారపదార్థాలతోపాటు సూపు కూడా అంత ముఖ్యం' అనీ అంటున్నాడు.

అంటే, ఈ సూపును మనం కూడా నిత్యం తాగడం ప్రారంభించాల్సివుందన్నమాట!



జననం: 26-4-1942, చినకాకాని, గుంటూరు జిల్లాలో. ఎం.ఏ (ఇంగ్లీషు), ఎం.ఏ (ప్రాచీన భారతదేశ చరిత్ర, సంస్కృతి, పురాతత్వ శాస్త్రం). 'తెలుగు నవలపై సోమర్‌సెట్ మామ్ ప్రభావం' అన్న అంశంపై తెలుగు విశ్వవిద్యాలయంలో పి.హెచ్.డికోసం పరిశోధన. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల, హైదరాబాదులో 1974 నుండి ఆంగ్లోపన్యాసకత్వం.

తొలికథ 'మహాపర్వతం - మరుగుజ్జు' ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 26-11-1969 సంచికలో ప్రచురితం. ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక (2-4-1971)లో 'మరమరాలూ - బఠాణీలూ - అందులో సామ్యవాదం' అన్న కథకు ద్వితీయ బహుమతి. 1973 నుండి పదిహేనేండ్లేం రాయలేదు. ఆంధ్రప్రభ వారపత్రిక 29-8-1990 సంచికలో ప్రచురితమైన 'ఇదీ స్నేహమే' అన్న కథకు ప్రోత్సాహక బహుమతి. వార, మాసపత్రికల్లో ఎన్నో కథలు ప్రచురితమైనాయి.

తొలి నవల 'వేగుచుక్క' ఆగష్టు 1988 'చతుర'లో ప్రచురితం. 'చతుర'లో ఇది నాల్గోనవల.

"రాయాలన్న తపన, రాయగలనన్న విశ్వాసం మీకున్నాయి. మనిషి ఉనికికి స్వార్థమే కేంద్రబిందువన్న విశ్వాసం. స్వసుఖం, స్వార్థమన్న భావాలు లేకపోతే ప్రగతి లేదు, జీవితంలేదు. అయితే పురుషుని స్వార్థం, ఉనికిలో తన స్వార్థం, ఉనికిని వెతుక్కుంటూ, తన స్వత్వాన్ని అచ్ఛాదించుకుని బతుకుతున్న స్త్రీపట్ల జాలి, కరుణ, గౌరవం. సమాజంలోని నిర్లిప్తతపట్ల ఆక్రోశం, మథన ... మీ రచనల్లో వ్యక్తమవుతాయి" అని అంటారు మిత్రులు డా॥ చంద్రశేఖరరెడ్డి.

# చతుర

సంపుటి: 18　　సంచిక: 7　　ఆగస్ట్ 1995

"రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం, అది అంతరిస్తుందా? స్వతంత్రం రాగానే సరిపోయిందా? దాన్ని కాపాడుకునే తెలివితేటలు మనకుండొద్దూ?" అనే ఎనభై ఏళ్ళ ఆ ఆంగ్లేయాభిమాని... ఆ లోగిలికంతటికీ యజమాని.

ఇంగ్లీషువారిమీదనేకాక, ఆంగ్లభాషపై కూడా మితిమీరిన మక్కువ కలిగిన ఆ వృద్ధుడు తన లోగిలిలో అద్దెకుండే వారందర్నీ అలవాటుగా 'షటప్, రాస్కెల్స్, స్కౌండ్రల్స్, రోగ్స్! గెటౌట్, గెట్ లాస్ట్...!' అని పిచ్చిపిచ్చిగా తిట్టినా ఒక్కరూ ఆ లోగిలి విడిచి వెళ్లకపోవడం వెనక మర్మం ఏమిటి?

తమకున్న అసలైన చక్కని పేర్లను వదిలి ఏ జంతువులపేర్లతోనో ఆయన తమని పిలుస్తున్నా... కిమ్మనకుండా ఆ లోగిల్లోనే పడివుంటారెందువలన?

విభిన్న స్వభావాల వింత చేష్టలను, చిత్రవిచిత్ర గృహ రాజకీయాలను హాస్యరసపూరితంగా అక్షరబద్ధంచేసిన, సాధారణ ప్రచురణకెన్నికయిన కాకాని చక్రపాణి గారి 'జో.ధ.లో (జోషువాగారి ధర్మలోగిలి) ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



''ఏవమ్మా! పొద్దున్నే ఏం పనిలేదా నీకు? శుభమా అని పనిమీద పోతుంటే ఎదురొచ్చావు?" అన్నాడు కోపంగా జోషువాగారు.

"అయ్యో! తప్పయింది బాబుగారూ! క్షమించండి'' అంది అండమ్మ పక్కకు తప్పుకుంటూ.

"ఏవిటండీ ఏమయింది?" అంటూ వచ్చాడు కూగాశాస్త్రి.

"ఓర్నాయనో నువ్వా తగలడ్డావు, ఒంటి బాపనాడివి. ఇహ నా పని అయినట్టే''

"ఈ శకునాలూ అవీ మూఢనమ్మకాలండీ, శకునాల్లో ఏం లేదు''

"బ్రాహ్మణ పుటుక పుట్టి అవేం కూతలయ్యా, సిగ్గు లేదూ ఆ మాట అనటానికి''

కూగాశాస్త్రి తెల్లబోయి చూస్తున్నాడు. ఈ తతంగమంతా మా ఇంటి కిటికీలోనుండి చూస్తున్న నేను వచ్చి సర్ది చెప్పేశాను. ఆయన సాదరంగా తల పంకించాడు. రెండు అపశకునాలయ్యాయి. ఇంక తనపని జరగదనుకున్నాడో ఏమో వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు జోషువాగారు.

"ఎందుకండీ ఆయనంత కోపంగా మాట్లాడుతాడు'' అనడిగాడు కూగాశాస్త్రి. నేనేం మాట్లాడలేదు.

"పైగా ఎప్పుడూ ఆంగ్లంలో ఏమిటో కూస్తూ వుంటాడు. తెలుగుదేశంలో శుభ్రంగా తెలుగులో మాట్లాడకుండా ఎందుకొచ్చిన మ్లేచ్ఛభాషండీ'' అన్నాడతను.

"ఇంగ్లీషును మ్లేచ్ఛ భాషనకండి. ఆయన క్కోపం వస్తుంది. తెలుగు ఇంగ్లీషు ముందు ఎందుకూ పనికిరాదని ఆయన ఉద్దేశం" అన్నాను విడమర్చి చెప్తూ.

"తెలుగు పుటక పుట్టినవాడు అనాల్సిన మాటేనా అది! పోన్లెండి తెలుగునెవడు ఏం అంటే నాదేంపోయింది? దేవభాష సంస్కృతాన్ని ఎవరూ ఏం అనకుండా వుంటే చాలు!"

ఇక ఇతనితో మాట్లాడటం నావల్ల కాదని నా తోవ నే పోబోతూవుంటే పైనుండి అరిచాడు జోషువాగారు "ఓయ్ కూగాశాస్త్రీ! ఆ గాడిదనిలా రమ్మను. ఆదివారం తప్ప దొరికి చావడు వాడు. ఇవాళ తాడో పేడో తేలిపోవాలి'' అని.

ఆ గాడిద పేరు శేఖరం. ఎవరు ఏ పని చెప్పినా కాదనకుండా చేసిపెడతాడనీ, రోజూ మిల్క్ బూత్‌నుండి జోషువాగారిక్కూడా పాలు తెచ్చి పెడతాడనీ మా కిరాయివాసులు 'ఖరం' అతనికి సార్ధకనామధేయం చేశారు. అతను బ్యాంకు ఉద్యోగి. మనిషి చాలా నెమ్మది. అయితే అతనికి లేని అలవాటు లేదు. విపరీతంగా అప్పులు చేశాడని వినికిడి. బాంకులో కూడా వచ్చే లోన్లన్నీ తీశాట్ట. జీతంలో సగం వడ్డీ కట్టటానికే సరిపోతుంది. ఇంటికి అప్పులిచ్చినవాళ్లు వచ్చి తిరిగిపోతుంటారు. అతని చాకచక్యం అప్పు పుట్టించటంలో వుంది. కొంచెం పరిచయముంటేచాలు అప్పు చేసేస్తాడు. మా లోగిల్లో అతని చారిక పడనివాళ్లెవరూ లేరు. జోషువాగారికి ఆర్నెల్లనుండి అద్దె బకాయి పడ్డాడు. నెలరోజులనుండీ ఆయన గొడవ చేస్తున్నాడు, 'అద్దె డబ్బయినా చెల్లించు, ఇల్లయినా ఖాళీ చెయ్యి' అని.

మా ఇంటి యజమాని జోషువాగార్ని మీకు పరిచయం చెయ్యాలి ముందుగా. ఇంగ్లీషు అక్షరం 'యల్', మరింకో తిరగబడిన 'యల్' ఆకారంలో కట్టిన లోగిలి అది. మా కిరాయివాసులు (కి.వాసులు) దాన్ని ముద్దుగా 'జోషువాగారి ధర్మ లోగిలి' (జోధలో) అని పిల్చుకుంటారు. ఆ రెండు 'యల్' ఆకారాలనూ సంధించే గేటుంది. ఆ రెండు 'యల్' ఆకారాలకు అటూ ఇటూ పోర్షనులున్నాయి. గేటుకు ఎదురుగా కొంత స్థలం వదిలి రెండు పోర్షనులున్నాయి. వాటికి వెనుక అంతే స్థలంలో మరో రెండు పోర్షనులకు ఫౌండేషన్ వేసివుంది. ముందున్న రెండు పోర్షనులమధ్యనుండీ పైకి మెట్లు





న్నాయి. మెట్లెక్కి పైకి వెళ్తే 'జోధలో మూల విరాట్ జోషువాగారి భాగం వస్తుంది. అన్ని భాగాలు సున్నంతో కట్టినవి. కొన్నిచోట్ల ప్లాస్టర్ పోయింది. పైన దూలాలనుపయోగించి కట్టిన మిద్దె అది. బాత్‌రూంలు, లావెటరీలు దూరంగా వుంటాయి.

మేడ మీద మూడుగదుల్లో జోషువాగారు, ఆయన కూతురు విన్నీఫ్రెడ్ జోషువా, (మా 'కివాసులు' ముద్దుగా 'మిద్దె దొరసాని' అని పిలుస్తారామెను.) ఆయన మనవడు మైకేల్ కాపురముంటున్నారు. జోషువాగారి భార్య పోయి చాలాకాలమైంది. ఆయనకు విన్నీ కాక ఇంకా ఇద్దరు కొడుకులున్నారు. కూతురి కంటే పెద్దవాళ్లు. పెద్ద కొడుకు బొంబాయిలోను, చిన్న కొడుకు బెంగుళూరులోను వుంటారు. వాళ్లెప్పుడూ హైదరాబాదు రారు. వచ్చినప్పుడు కూడా వారం రోజులకంటే వుండరు. మైకేల్ పెద్దకొడుకు సంతానం, తాత దగ్గర వుండి మెడిసిన్ చదువుతున్నాడు. అతనికి 22 ఏళ్లుంటాయి. మిద్దె దొరసానికి పాతిక పైనే వుంటాయి. జోషువాగారికి యాభై రెండేళ్ల వయసులో పుట్టింది ఆమె. బి.ఏ. బి.యిడి పాసయి ఓ కాన్వెంటు స్కూల్లో టీచరుగా పనిచేస్తోంది. మనిషి అనాకారని చెప్పలేంకాని, అందంకంటే మంచి ఆకర్షణ వుంది ఆమెలో. చక్కగా ఇంగ్లీషు మాట్లాడేస్తుంది. ఇంటిపనికి పనిమనిషిని, బయట పనికి పనికుర్రాడినీ పెట్టుకుంది. వంటమాత్రం తనే చేస్తుంది. ఈమధ్య ఏడాదినుండి క్రిస్టొఫర్ అనే అతనితో ప్రేమలో పడ్డదని, వాళ్లు పెళ్లి చేసుకుంటారనీ మా జోధలో ఓ టాక్.

జోషువాగారు ఇంగ్లీషువాళ్ల కాలంలో రైల్వే డిపార్ట్‌మెంటు సర్వీసులో చేరి వాళ్ల తిట్లు తిని తిని, అరిగించుకుని, తన కింది ఉద్యోగులమీద వాటిని ప్రయోగిస్తూ, నిజాం స్టేట్ రైల్వేకి డెప్యుటేషన్‌మీద వచ్చి, హైదరాబాదులో స్థిరపడిపోయాడు. అంచలంచలుగా ప్రమోషన్లు పొందుతూ, వీలయినంతగా వీలయినన్ని మార్గాల్లో సంపాదించి, 1966లో రిటైరయ్యాడు. ఆయనట్టా పోగుచేసుకున్న డబ్బుతో అశ్వమేథయాగాలకూ, సురాపానానికీ పోగా మిగిలినదాంతో ఈ భవనాన్ని నిర్మించి, కొట్లు వేయించి తలా ఒకటీ అద్దెకిచ్చాడు.

తెల్లదొరలు పోయి, నల్ల దొరల కాలంలో రిటైరయినా, ఆ సత్యాన్ని గుర్తించటం సుతరామూ ఇష్టముండదాయనకి. 'రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యం అంతరిస్తుందా? స్వతంత్రం వస్తే ఏమయింది కనుక. దాన్ని కాపాడుకునే తెలివితేటలు మనకేడ్చాయా? అసలు పరిపాలన మనకేం తెల్సు? పాలకుడంటే తెల్లవాడే. వాడే మళ్లీ ప్రపంచాన్ని ఏలేది అన్నది ఆయన దృఢవిశ్వాసం. అందుకే కోపం వచ్చినప్పుడల్లా ఇంగ్లీషును స్వేచ్ఛగా వినియోగిస్తూ - అది ప్రపంచభాష కదండీ మరి అంటూ తన పదారణాల తెలుగుతనాన్ని కాపాడుకుంటూ వుంటాడాయన.

ఇక ఆయన మతాభిమానం సంగతి. ఇంగ్లీషువాళ్ల మతం క్రిస్టియానిటీ కాబట్టి, వాళ్లనభిమానించే ఆయన ఆ మతాన్ని పుచ్చుకున్నాడుకానీ, ఆ మతంమీద ప్రేమతో కాదు. ఎంతయినా భారతీయుడు కనుక శకునం, వార వర్జ్యాలంటే ప్రగాఢ నమ్మకమాయనకు. ఆయన ఇంట్లో కొత్తగా టెలిఫోన్ ఇన్‌స్టాల్ చేసినప్పుడు కూగాశాస్త్రి వచ్చి మంత్రాలు చదివి, 'ముందు విఘ్నాధిపతి గణపతికి మొక్కి ఫోనెత్తండి' అన్నాడు. ఆయన ఆ క్షణంలో గణపతి దేవుడు హిందువన్న సంగతి మర్చిపోయాడు. ఆయనకో బ్రహ్మాండమైన ఐడియా వచ్చింది. డైరెక్టరీలో కన్పించిన మొదటి గణపతి నంబరు డయల్ చేసి, కనెక్షన్ రాంగానే "హలో... హలో... ఈజిట్ గణపతీ స్పీకింగ్' అన్నాడు.

"అవునయ్యా! నువ్వెవరు?" అని అడిగాడా పెద్దమనిషి.



"ఇట్స్ జోషువా'' అని తిరిగి "మనకింత కుముందు పరిచయం లేదులెండి. ఇవాళ మా ఇంట్లో టెలిఫోన్ ఇన్‌స్టాల్ చేశారు. మీ పేరు తల్చుకుని, ఫోను వాడటం మొదలెడుతున్నాను. థాంక్యూ గాడాఫ్ ఆబ్‌స్టకిల్స్, థాంక్యూ వెరీమచ్' అని ఫోను పెట్టేశాడు.

నల్లగా, లావుగా, ఎత్తుగా, చొక్కా పాంటు లోపలకు వేసి, ఏ కాలమైనా కోటు, టైలతో, చేతిలో వంకీ కర్రతో పిల్లల్నీ, పెద్దల్నీ అదిలిస్తూ తిరిగే ఎనభైఏళ్ళ జోషువాగారు మా ఆరాధ్యదైవం. తనమాట తప్ప ఇతర్లమాట వినడాయన. తన పాలన కిందవున్న నివాసుల్ని తన కిష్టమైన పేర్లతో పిల్చేవాడు. మా వాళ్ళూ 'విధి బలీయమైంద'ని పట్టించుకోటం మానేశారు. 'జోధలో నివాసుల' వ్యవహార నామాలన్నీ ఇంచుమించుగా ఆయన ప్రసాదించినవే. ఇంక మా వాళ్ళూ తక్కువవాళ్ళు కారు. తామూ శక్తివంచనలేకుండా పాటుపడ్డారు.

జోషువాగారు నాపేరు 'పాణిని' కాస్తా 'పోనీ'గా మార్చేశాడు. బతికిన కాలంలో గుర్రప్పందాలాడి, గుర్రాలమీద అభిమానం చావక, తన సామంతులలో అభిమానినైన నాకు 'గుర్రప్పిల్ల' అని పేరెట్టుకుంటే నేనెందుకు కాదనాలి? మా లోగిల్లో వుండే జైన్ నన్ను 'పానీ' అని పిలుస్తాడు. మా ఆవిడ పేరు భానుమతి. జైన్ భార్య ఆవిణ్ణి 'బానూ' అని పిలుస్తుంది. అలా పేర్లమీద ఎవరికీ హక్కులు లేవని రాజీపడిపోయాం. మాకిద్దరు పిల్లలు- విరించి, రాజ్యలక్ష్మి. విరికి పదేళ్ళు, రాజికి ఐదేళ్ళు. మా ఇంటిదగ్గరనున్న స్కూల్లో చదువుకుంటున్నారు. నా వయసు 37, 38 వుంటాయేమో. మగవాళ్ళ వయసు కూడా ఇదమిద్ధమని బయటకు చెప్పుకోకూడదని ఈమధ్య మా ఆవిడ బోధిస్తోంది. భర్త వయస్సు తెలిస్తే భార్య వయస్సు కూడా ఇంచుమించుగా అంచనా వెయ్యవచ్చుటకదా! అది ఆవిడ బాధ. మేడపైన జోషువాగారు, క్రింద నేను. మాది మూడు గదులు వరండా వున్న పోర్షను.

కూగాశాస్త్రి ఖరాన్ని పిలవటంతో అతను పైకెళ్తూంటే, మా 'జోధలో' సభ్యులు కొందరు అతన్ని అనుసరించారు. మా ఆవిడ ఉద్బోధతో నేనూ పైకి వెళ్ళాను. అప్పటికే అక్కడ గోలగా వుంది.

"మీరు కాస్తంత శాంతం వహించాలి. ఉన్నపళాన ఇల్లు ఖాళీచేయమంటే ఎలా జోషువాగారూ!" అంటున్నాడు సిపిఐ శర్మ.

"షటప్... షటప్! బోడిసలహా, చచ్చుసలహా. ఇంకోడికి సలహాలివ్వటానికి అందరూ పెద్దలే. వాడికేమయినా సిగ్గూ, శరం వుందా? ఆర్నెల్లనుండి అద్దివ్వలేదు. రిటైరయిన మనిషిని నేను మాత్రం ఎట్లా గడుపుకోవాలి. బేస్ ఇన్‌గ్రాటిట్యూడ్! అద్దెకిచ్చింది కాక, అద్దె కూడా మాఫీ చెయ్యాలా?" అని గయ్యిమని లేచాడు జోషువాగారు సిపిఐ శర్మమీద.

"మాఫీచెయ్యమని ఎవరన్నారండీ? రెండు మూడు నెలల్లో మీ బకాయి తీర్చేస్తానంటున్నాడుగా! కొంచెం ఓపికపట్టండి'' అన్నాడు కాంగోరెడ్డి.

"ఇప్పటికి ఆర్నెల్లు ఓపికపట్టాను. ప్రతి నెలా హరికథలు చెప్తూ నాకు టోకరా ఇస్తూనే వున్నాడు. ఇహ నావల్ల కాదు. రేపటికల్లా ఇల్లు ఖాళీచెయ్యి. లేకపోతే సామాన్లు బయట పారేస్తాను. హు... నన్ను... నన్ను మోసం చేస్తావా?" అన్నాడు జోషువాగారు రొప్పుతూ.

"మీరు అతన్ని అర్ధాంతరంగా ఇంట్లో నుండి వెళ్ళగొడ్తే మా బాకీలు వసూలయేదెలా? లోగిల్లో వున్నప్పుడే వసూలవటం కష్టంగా వుంది. బయటికెళ్తే అతనిచుట్టూ మేం తిరగలేం" అని మా జోధలో నివాసులు అతనికెందుకంత ఇదిగా సపోర్ట్ చేస్తున్నారో కుండబద్దలు కొట్టినట్టు స్పష్టంగా చెప్పాడు కూగాశాస్త్రి.

"ఓర్నీయమ్మ కడుపుడకా! మీ అప్పు వసూళ్ళకోసం నేన్నష్టం భరించాలా? మీరి






చ్చిన అప్పుల సంగతి నాకు తెలీదు. వాడు రేపటికల్లా ఇల్లు ఖాళీ చెయ్యాల్సిందే'' అన్నాడు జోషువాగారు.

"ఎంతమాత్రం అప్పు పెట్టావేం?" అనడిగాడు హరబాబు కూగాశాస్త్రిని.

"పదివేలు'' అన్నాడు కూగాశాస్త్రి నాసికా రంధ్రాల్లో ముక్కుపొడుం దట్టిస్తూ.

"వడ్డీ వసూలు చేస్తూనే వున్నావుగా. మరి నా సంగతేమిటి? నాకు మూడువేలివ్వాలి. వడ్డీలేదు, అసలూ లేదు'' అన్నాడు సిపిఐ శర్మ.

"నాకూ నాలుగువేలివ్వాలి" అన్నాడు కాంగోరెడ్డి.

"నేనూ ఇచ్చాను. వెయ్యి రూపాయలు'' అన్నాడు హరబాబు.

"నాకు పదిహేనొందలివ్వాలి'' అన్నాడు పరేషాన్‌రావు.

"అరె నా తానా తీసుక్కున్నాడు ఆర్ సౌ. దోదిన్‌మే వాపస్ కర్తుం బోలా అబ్‌తక్ కోహీ నహీదియా'' అన్నాడు జైన్ పాన్ కసకసా నములుతూ.

"నువ్వెంత ఇచ్చావయ్యా పోనీబాబూ?" అనడిగాడు జోషువాగారు.

"నేను పెద్ద ఇచ్చిందేం లేదులెండి. నాల్గొందలు మాత్రమే'' అన్నాను నేను సిగ్గుపడ్తూ.

"లోగిల్లో అందరి బాకీలు తీర్చిందాకా ఖరం ఇల్లు ఖాళీ చెయ్యటానికి వీల్లేదు'' అన్నాడు శర్మ.

"నువ్వెవడివయ్యా నా ఇంటి సంగతి మాట్లాడటానికి? ఇది నా ఇల్లు, నా లోగిలి. నా ఇష్టమొచ్చిన వాడిని వుండమంటాను. లేనివాడిని పొమ్మంటాను. అయినా వాడు బయట చేసిన అప్పుల్లో మీరిచ్చిందెంత? ఎ డ్రాప్ ఇన్ ఓషన్'' అన్నాడు జోషువాగారు సిగారు పొగ వదుల్తూ.

"ఎంతయితే ఏం మహాప్రభూ! పదివేలు నష్టంవస్తే నేను, చిప్పపట్టుకు అడుక్కోవాల్సిందే'' అన్నాడు కూగాశాస్త్రి.

"ఫో నువ్వాఫో, ఇద్దరూ చెరో చిప్ప

పట్టుకు అడుక్కోండి''

"చూడు ఖరం! నువ్వీ బాకీలు ఎప్పుడు తీర్చగలవో చెప్పరాదుటయ్యా'' అన్నాను నేను ఏదోవిధంగా సంధికుదురుద్దామని.

"ఇదుగో పోనీబాబూ! నువ్విందులో జోక్యంచేసుకోకు'' అన్నాడు జోషువాగారు.

"జోషువాగారి బాకీ తీర్చటానికి ఆర్నెల్ల యినా పట్టవచ్చు. మీ అందరి బాకీలు తీర్చటానికి సంవత్సరమైనా పడ్తుంది'' అన్నాడు ముఖమెత్తి ఖరం.

"వీడిమొహం ఇట్టాంటి వాగ్దానాలు ఎన్ని ఎంతమందికి చేశాడో'' అన్నారు జోషువాగారు.

"నా పదివేలు ముందుతీర్చు'' అన్నాడు కూగాశాస్త్రి.

"మందుల స్టాకయిపోయింది. ముందు నా అప్పు తీర్చనివ్వండి'' అన్నాడు పరేషాన్‌రావు.

"మేరీ భీ వహీ హాల్‌హై. ముందు నా పైసల్ కట్టు'' అన్నాడు జైన్.

ఇలా అందరూ నా బాకీ ముందంటే నా బాకీ ముందని కొట్టుకోసాగారు.

"ముందుగా జోషువాగారి బాకీ తీర్చని వ్వండి. లేకపోతే ఆయన ఇంట్లో వుండనివ్వ డు'' అన్నాను నేను.

"నేను ఆర్నెల్ల దాకా ఆగను. నా డబ్బు నాకిప్పుడే కావాలి'' అన్నాడు జోషువాగారు.

"ఉన్నాపళాన ఎక్కడ తెస్తాడండీ. కొంచెం ఓపిక పట్టాలమీరు'' అన్నాడు లెబా.

"నోర్ముయ్యవయ్యా! సాయంత్రంలోపల వాడు డబ్బుకడ్తే సరి. లేపోతే రేపొద్దున వాడి సామాను బయట పారేస్తాను''

"గౌరవనీయుడైన వ్యక్తిని వాడూ, వీడూ అనకండి, మర్యాదగా వుండదు'' అన్నాడు శర్మ.

"బోడి నువ్వు చెప్పేదేందయ్యా! వాణ్ణంటాను, వాడబ్బనంటాను, వాడి తాతనంటాను''

"ఇటీజవర్ ఫూలిష్‌నెస్ టు ఎక్స్పెక్ట్ ఎనీ థింగ్ ఫ్రమ్ కాపిటలిస్ట్ లైక్ హిం" అన్నాడు లెబా.

"షటప్ రాస్కెల్స్, రోగ్స్, స్కౌండ్రల్స్! గెటౌట్, గెట్‌లాస్ట్..." అనరిచాడు జోషువాగారు.

ఇహ ఆయనతో మాట్లాడి ప్రయోజనంలేదని అందరం బయటకొచ్చాం. మేం గది దాటగానే ఠకీమని తలుపు వేసుకున్నాడాయన. మెట్లుదిగి కిందకొచ్చాం.

" జోషువావర్థి పిసినారి ముండాకొడుకు! ఇల్లు ఖాళీ చేస్తావేమో, దగ్గర్లో తీసుకో'' అని సలహా ఇచ్చారు కూగాశాస్త్రి.

"అవునయ్యోయ్! అడ్రసు చెప్పకుండా బిచాణా ఎత్తెయ్యకు'' అన్నాడు కాంగోరెడ్డి.

దిగాలుముఖం వేసుకున్న ఖరం ఎవరి ప్రశ్నలకు జవాబివ్వలేదు.

"కర్కోటకుడు! కట్టెనా కంపనా కాలడు'' అన్నాడు శర్మ జోషువానుద్దేశించి.

"పైసకు గడ్డి కరిచేరకం" అన్నాడు కూగాశాస్త్రి.

"రైల్వేని దోచి సంపాయించాడు. డబ్బు దాహం మనిషికి. మహా కరప్ట్ ఆఫీసరట ఇతను'' అన్నాడు రెడ్డి.

"ఈ జబ్బుకు ఏమన్నా మందు కనిపెట్టాల్సిందే'' అన్నాడు పరేషాన్‌రావు.

"మనమందరం కలిసికట్టుగా వుండాలయ్యా! నివాసుల సంఘం ఏర్పాటు చేసుకుందామంటే నా మాట వినరు ఎవరూ'' అన్నాడు సి.పి.ఐ. శర్మ.

ఖరం ఎవరి వ్యాఖ్యానాలకూ జవాబు చెప్పలేదు. తలొంచుకుని తనింట్లోకి వెళ్లిపోయాడు.

"ఈ సాలేగాడు పైసలివ్వడు. ముఝే యకీన్‌హై'' అన్నారు జైన్, లోపలికెళ్తున్న





ఖరంని చూస్తూ.

"వీడి దుంపతెగ. అందర్నీ ముంచి వీడేం బాగుపడ్తాడంట?" అన్నాడు కూగాశాస్త్రి.

"దొంగనాయాలు! బాకీ ఎప్పుడు తీరుస్తాడో సరిగ్గా చెప్పనే చెప్పడు'' అన్నారు కాంగోరెడ్డి.

"వీడబ్బ సొత్తుంది మన దగ్గర. ఇవ్వాకెక్కడికి పోతాడు" అన్నాడు సి.పి.ఐ. శర్మ.

"ఇవ్వాకెక్కడికి పోతాడులెండి. ఇల్లు తెలీకపోయినా, పనిచేసే బాంక్ తెల్సుగా. ఉద్యోగమైతే మానెయ్యడు. ఇవ్వాళ కాకపోతే రేపు తీరుస్తాడు'' అన్నాను నేను.

"నా కడుపుమంట మీకేం తెలుస్తుంది. ఆ పదివేలకు నీళ్లు వదులుకుంటే నేను మళ్ళీ జన్మలో అంత డబ్బు సంపాదించగలనా?" అన్నాడు కూగాశాస్త్రి ఏడుపుగొంతుతో.

"వడ్డీ ఎక్కువే తీసుకునుంటావులే' అన్నాడు లెబా.

"అందరూ నా వడ్డీ మీదపడి ఏడ్చేవాళ్లే. వడ్డీ లేకుండా అప్పెవడిస్తాడు?" అన్నాడు శాస్త్రి.

ఇంటికి రాంగానే మా ఆవిడ అడిగింది, "ఇంతకీ ఏం నిర్ణయించేరు?" అని.

"ఆ మొండిమనిషి ఇతర్ల మాట వింటాడా? రేపటికల్లా ఇల్లు ఖాళీ చెయ్యాలట" అన్నాను.

"మరి ఆర్నెల్ల అద్దె బకాయి చెల్లించేశాడా ఖరంగారు''

"అతడి దగ్గరేముంది ఇవ్వటానికి?"

"డబ్బుకు గడ్డి కరిచే మనిషికదా జోషువాగారు. బకాయి వసూలు కాకుండానే అతన్ని ఎలా వదిలేశాడు?"

"పొయింటే... నాకు తట్టలేదు ఆ విషయం"

"అయిన నష్టం చాలు, ఇంక నష్టం కాకుంటే అదే పదివేలనుకున్నాడేమో''

"ఏమో మరి''

ఆ మర్నాడు పొద్దున్నే ఇల్లు ఖాళీ చేశాడు ఖరం. నారాయణగూడలో ఇల్లు తీసుకున్నాట్ట. భార్యాపిల్లల్ని పుట్టింటికి పంపటంతో సామానంతా అతనొక్కడే సర్దుకోవాల్సివచ్చింది. వెళ్లేటప్పుడు పేరు పేరునా అందరికీ చెప్పివెళ్ళాడు. త్వరలో అందరి బాకీలు తీరుస్తానన్నాడు. నివాసులెవరికీ అతని మాటల మీద నమ్మకం లేకపోయినా, గత్యంతరం లేని పరిస్థితుల్లో మాట్లాడకూరుకున్నారు.



ఇది 1987 నాటి సంగతి. మొత్తం మా జోషువాగారి చరిత్రా, నివాసుల చరిత్రా చెప్పాలంటే అది మహా ఉద్గ్రంథమే అవుతుంది. అందుకే ఆ ఒకటి, రెండేళ్ళ సంగతి మాత్రమే ప్రస్తావిస్తాను. నివాసుల పేర్లు మీకు కొత్తగా వుండివుంటాయి. నిజానికి కొత్తదనమేం లేదు. ముందుగా 'జోధలో నాయకీనాయకుల్ని పరిచయం చేస్తే మీకన్నీ తెల్సిపోతాయి.

మా ఇంటి పక్కభాగంలో లెనిన్‌బాబు (లెబా), ఆయన భార్య 'అన్నీ'తో కాపురముంటున్నాడు. ఆమె అసలు పేరు అనసూయ. మరీ పాతచింతకాయపచ్చడిలా వుందని అలా ఆమె పేరు మార్చేశాడతను. వారిది వర్ణాంతర వివాహం. అన్నీ పుట్టింటికి రాకపోకలు లేవు. ఆమె తండ్రి సంగమేశ్వరశాస్త్రి 'నా కూతురు చచ్చింది' అని ఘటశ్రాద్ధం పెట్టేసి చేతులు దులుపుకున్నాడు. ఆమెది



# పాములతో చెలిమి

భయంకర విషసర్పాలు జెఫ్రీషావనర్ చేతుల్లో రబ్బరు పాముల్లా ఆడతాయి. అతడు బతికేది పాముల్లో, పడుకునేది పాముల్తో, కలలు కనేది పాముల గురించి అంటారు అతడి స్నేహితులు. పైగా ఈయనగారి స్నేహం అల్లాటప్పా పాములతో కాదు, ఆస్ట్రేలియాలోని ఫ్రాంక్లిన్ దీవుల్లో నివసించే భయంకరమైన టైగర్ స్నేక్స్‌తో. ఈ పాము కరిచిన పదిహేను నిముషాల్లో మనిషి ప్రాణాలు వదలవలసిందే. వేసవిలో వేడికి ఆగలేక కలుగుల్లోంచి బయటకొచ్చి నేలపై తిరుగాడే ఈ టైగర్ స్నేక్స్ కారు నలుపు రంగులో వుండి చూపరులకి భీతికలిగిస్తాయి. ప్రతి వేసవిలోను ఆ ప్రాంతాలకెళ్ళే షావనర్ ఈమధ్య పాములతో చెలిమిచేసే మరో ముగ్గురితో కలిసి ఆస్ట్రేలియా దీవులకి ప్రయాణం కట్టాడు. ఈ బృందం అక్కడి పాముల్లో విషంపై, వాటి జీవితకాలం, ఆహారపు అలవాట్లు మొదలైన వాటిమీద పరిశోధనలు జరిపారు. ఈ పరిశోధనల్లో రెండుసార్లు పాముకాట్లుకి గురయిన షావనర్ తెలివిగా ప్రాణాలతో బయటపడ్డాడని తెలుస్తోంది.

కోనసీమలో అమలాపురం దగ్గర ఓ పల్లెటూరు. రాజమండ్రి హాస్టల్‌లో వుంచి కూతుర్ని బి.యే. చదివించాడు తండ్రి. చదువు పూర్తి కాకుండానే లెబా ప్రేమలోపడి, తేనెలోపడ్డ ఈగలా గిజగిజలాడి, దండల మార్పిళ్లు, సంతకాల పెళ్లి చేసుకుంది ఆమె. మనిషి చామనఛాయ, కొంచెం బొద్దుగా వుంటుంది. ఆమెది చక్కని కంఠం. ప్రేమలోపడ్డ వాళ్లన్నా, వర్ణాంతర వివాహాలు చేసుకున్నవాళ్లన్నా ఆమెకిష్టం. పాలియస్టర్, నైలాన్లే తప్ప కాటన్‌చీరలు కట్టదు. నా అంచనా ప్రకారం ఆమె వయసు 26-27 ఏళ్లు.

లెబా అప్పుడు రాజమండ్రిలో ఫారెస్ట్ డిపార్ట్‌మెంటల్ క్లర్క్‌గా పనిచేసేవాడు. పెళ్ళయింతర్వాత హైదరాబాద్ ట్రాన్స్ఫర్ చేయించుకున్నాడు. అతనిది కృష్ణాజిల్లా పెడన స్వగ్రామం. తల్లి పోయింది. తండ్రి ఒక్కడే వూళ్ళో వ్యవసాయం చేసుకుంటూ జీవనం సాగిస్తున్నాడు. ఆయనకు లెబా ఏకైక సంతానం. ఈ వర్ణాంతర వివాహం ఆయనకు నచ్చలేదు. పదిలక్షల ఆస్తివున్న కొడుక్కు, మరిన్ని లక్షల కట్నం తీసుకొచ్చే కులంపిల్ల కోడలయ్యే అవకాశం పోయినందుకు ఆయన బాధపడ్డాడు. సంప్రదాయం వీడని వామపక్ష రాజకీయం ఆయనది.

తండ్రికున్న పొలిటికల్ లీనింగ్స్ కొడుక్కూ పట్టుబడ్డాయి. అతడు మంచి కమిట్‌మెంట్ వున్న వ్యక్తి. కమ్యూనిజాన్ని మతం స్థాయిలో కొల్చే వ్యక్తి లెబా. సి.పి.యం. పార్టీ సర్కిల్స్‌లో మంచి పలుకుబడి వుంది అతనికి. మనిషి పొడుగ్గా తెల్లగా వుంటాడు. కొనబారిన ముక్కుపై కళ్ళద్దాలు. చిన్న గడ్డం. ఎప్పుడూ తెల్ల లాల్చీ, పైజామాలతో, ఆకు చెప్పులతో దర్శనమిస్తూంటాడు. అతనికి 32 ఏళ్లు వుండవచ్చు. ఈ జంటకింకా పిల్లలు కలగలేదు.

ఇక 'యల్' ఆకారాల్లో వున్న నివాసుల్ని గురించి ప్రస్తావిస్తాను. 'జోధలో' ఆగ్నేయ మూల ప్రహరీగోడ నానుకున్న భాగం సీనియర్ నివాసి కాంగోరెడ్డిది. మునిసిపల్ ఆఫీసులోపని. 45 ఏళ్ళ వయసుంటుందేమో అతనికి. మనిషి చామనఛాయ. పొడుగ్గా, సన్నగా వున్నా దృఢంగా వుంటాడు. చిన్నప్పటినుండి కాంగ్రెసు రాజకీయాల్లో తిరిగిన మనిషి. అందుకే గోపాలరెడ్డి ఇంటిపేరు 'కాంగ్రెసు'గా మార్చేసి, మేం 'కాంగోరెడ్డి' అని అభిమానంగా పిల్చుకుంటాం. కాంగ్రెసు పార్టీ కొట్టిన పల్టీలన్నీ ఈయనా కొట్టాడు. ఎప్పుడూ పాలకపక్షంలోనే వుండేవాడు. అప్పుడు రాజకీయ నిరుద్యోగ సమస్యలో సతమతమవుతున్న మాజీమంత్రి ధర్మరాజు గారికి ఆత్మీయుడైన బంటు. కాంగ్రెసు ప్రభుత్వంలో రెండు టరంలు మంత్రిగా దివిటీ వెలిగించిన ధర్మరాజుగారూ, ఆయనకు పర్సనల్ సెక్రటరీగా పది సంవత్సరాలు డెప్యుటేషన్‌మీద వుండి స్వామికార్యాన్నీ, స్వకార్యాన్నీ చక్కబెట్టుకున్న కాంగోరెడ్డి 'తెలుగుదేశం' ప్రభుత్వం ఏర్పడటంతో ఈ నాలుగేళ్లుగా పొలిటికల్ వ్యాక్యూంలో పడిపోయారు. మళ్ళీ పేరెంట్ డిపార్ట్‌మెంట్‌కు వచ్చిచేరాడు కాంగోరెడ్డి. పదవిలో వుండగా బాగానే సంపాదించాడు. హైదరాబాదులో స్వంత ఇల్లు కట్టుకున్నా 'జోధలో' మీది ప్రేమతో ఆ ఇంటిని అద్దెకిచ్చి ఇక్కడే వుండిపోయాడు. అతని స్వగ్రామం నెల్లూరు జిల్లా విడవలూరు. అతనికక్కడ పొలాలున్నాయి. జాగ్రత్తమనిషి కనుక డబ్బు బాంక్‌లోనేగాని, అవసరానికి మించి పైస కూడా ఇంట్లో వుంచడు. అతను పిసినారి కాదు. అవసరమొస్తే భారీగానే ఖర్చుపెడతాడు. అతనికింకా రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల్లో పూర్వపు పలుకుబడి అంతరించలేదు. డబ్బు తీసుకుని పనులు చేసిపెడతాడు. అది లంచమంటే నేనేం చెప్పగలను మీకు!

అతని భార్య కాళి మహాలక్ష్మమ్మ. నలభై య్యోపడిలో వున్న పెద్ద ముత్తైదువు.




భర్తకు తగిన భార్య. మనిషి గుమ్మటంలా వున్నా 'జోధలో'లో ఎవరికి ఏ ఆపద వచ్చినా, అవసరంపడినా తాను ముందు తయారవుతుంది. 'జోధలో' ఆమె సాయంలేక పిల్లల్ని కన్నవాళ్ళెవరూ లేరు. వాళ్ళకు నలుగురు పిల్లలు. పెద్దమ్మాయికి భక్తిగా సరోజినీనాయుడు పేరు పెట్టుకున్నాడు రెడ్డి. మిద్దె దొరసాని ఆమెని 'రోజా' అని పిలవటంతో ఆ పేరే స్థిరమైందా పిల్లకు. ఆమెకి 19-20 ఏళ్ళుంటాయి. బి.ఏ. రెండో సంవత్సరం చదువుతోంది. రెండోకూతురు ఇందిరాప్రియదర్శిని. ఎవరి పేరో మీకు చెప్పనక్కర్లేదు. టెంత్‌క్లాసు చదువుతోంది. తరవాతివాడు చంద్రశేఖరరెడ్డి (కాంగోరెడ్డి తండ్రి పేరు), చివరివాడు రామిరెడ్డి (కాళి తండ్రిపేరు).

సీనియర్ నివాసులవటంవల్లా, రాజకీయ పార్టీల సఖ్యతవల్లా కాంగోరెడ్డికీ, సి.పి.ఐ.శర్మకీ ఎక్కువ దోస్తీ. కాంగ్రెసు పార్టీని, సి.పి.ఐ. సమర్థించినంతకాలం ఇద్దరూ తనువులు వేరుగానీ, ఆత్మలు ఒక్కటే అన్నట్టు మెలిగారు. సి.పి.ఐ. పార్టీ తెలుగుదేశం పార్టీని సమర్థించి ఎన్నికల్లో కాంగ్రెసు ఓటమికి కారణమైనప్పటినుండీ వాళ్ళిద్దరి మధ్య ఇదివరకటి సాన్నిహిత్యం లేదు.

కాంగోరెడ్డి పక్కభాగమే రాజమణి చిరంజీవప్ప చెట్టిది. అంత పొడుగు పేరు పిలవలేక మా 'జోధలో' సభ్యులు 'రాచిప్పచెట్టి'గా కుదించారు. అతను చిత్తూరు జిల్లావాడు. స్వగ్రామం కార్వేటినగరం. నలభయ్యో పడిలో పడిన వ్యక్తి. మనిషి దబ్బపండులా వుంటాడు. తలమైదానం మరుభూమి. ప్లేగ్రౌండ్‌లో ఆడేచోట గడ్డి మొలవకపోయినా చుట్టూ మొలచేట్టు అతని తల మూడుపక్కలా కల్నేత జుట్టు; చెంపలమీదకు చొచ్చుకుపోయి చెవులమీద వాలిన కళ్లజోడు, గడ్డం పూర్తిగా తెల్లబడిపోవటంతో రోజూ షేవ్ చేస్తాడు. ఆలోచనల్లో వున్నప్పుడు పెదిమల్ని బిగబట్టి నోటిని అటుపక్కకూ, ఇటుపక్కకు విస్తరింపచేస్తూవుంటాడు. నుదుటిన ఎర్రటి తిరుచూర్ణపునామం. అతను ధరించే దుస్తులు వదులుగా వుంటాయి.

చిత్తూరు జిల్లా కావడంవల్ల తమిళం బాగా మాట్లాడగలడతను. బాగా చదువుకున్న మనిషి. పోస్టల్ డిపార్ట్‌మెంటులో ఇన్స్పెక్టరు ఉద్యోగం. డిపార్ట్‌మెంటులో లంచంపట్టే అవకాశం లేక నీతిమంతుడుగా బతుకుతున్నాడని సి.పి.ఐ. శర్మలాంటి గిట్టని వాళ్లంటారు. అతనికి డిపార్ట్‌మెంటులో మంచి పేరుంది. 'పీఠ్‌పే మారేగా మగర్ పేట్‌పే నహీఁ' అని అతని కింది ఉద్యోగులనుకుంటారు. చిన్నప్పటి నుండి ఆర్.ఎస్.ఎస్. కార్యక్రమాల్లో పాల్గొనుటవల్ల, అలవాటుగా బి.జె.పి.పట్ల అతనికి ఆసక్తి జనించింది. కాని, నిజానికతను రాజకీయజీవి కాదు. అయితే, హిందూ జాతి, సంస్కృతి, భారతీయతపట్ల అతనికున్న పెచ్చుమీరిన అభిమానం అతన్ని ఇతరులు బి.జె.పి. మనిషిగా భావింపజేసేట్టు చేస్తుంది.

రాచిప్పచెట్టి భార్య రంగనాయకి- నాయకి అంటారంతా. భర్తకంటే ఒక అంగుళం ఎత్తు ఎక్కువ. విడిగా చూస్తే ఆమే పొడుగనిపిస్తుంది. చామనఛాయ, దొందు ఒళ్లు. వయసు 36 ఏళ్లు. మృదుస్వభావి. ఇతర్ల తప్పులామెకసలు కన్పించవు. వాళ్ళకు ముగ్గురూ ఆడపిల్లలే. 14 ఏళ్ళ ఝాన్సీరాణి పదోతరగతి, పదేళ్ళ మైత్రేయి ఆరోక్లాసు చదువుతున్నారు. మూడోపిల్ల జానకికి ఏడేళ్లు. రాచిప్పచెట్టి పిల్లల చదువుల విషయంలో అత్యంత శ్రద్ధ తీసుకుంటాడు.

రాచిప్పచెట్టి భాగం లెబా ఇంటికి సమానాంతరంగా 'జోధలో' కుడివైపున వుంటుంది.

'జోధలో' ఈశాన్యం మూల ప్రహరీగోడకు దగ్గరగా వున్న భాగంలో హరబాబు వుంటున్నాడు. అతని అసలు పేరు రమేష్‌బాబు. హరిజనులు కాబట్టి అదే ఇంటిపేరు చేసి, కుదించి 'హరబాబు' అని నామకరణం చేశా



రు జోధలో నివాసులు. జైన్ మాత్రం అతన్ని 'హరేబాబు' అని పిలుస్తాడు. జోధలో నివాసుల్లోకల్లా చిన్నవాడతను. వయసు 27 ఏళ్లు. మనిషి నలుపు, జుట్టు నుదుటి ముందుదాకా పెరిగి పాలభాగాన్ని కుదింపచేసింది. ఐదడుగుల పదంగుళాల ఎత్తు. సన్నగా వుంటాడు. కళ్ళజోడు పెట్టుకుంటాడు. చారలవిగాని, గళ్లుగాని వున్న చొక్కావేసి ఇన్‌షర్ట్ చేస్తుంటాడు. బనీను వేసుకోడు. చొక్కాపై రెండు బటన్లు పెట్టకుండా వదిలేస్తుంటాడు. కలివిడి మనిషి. కులం పేరు పెట్టి అవహేళన చేస్తారేమోనని ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడ్తుంటాడు. చదువులో చురుకు కాకపోయినా రిజర్వేషన్లుండటంవల్ల ఇంజనీరింగ్ అయిందనిపించాడు. కాంగోరెడ్డి సాయంతో స్టేట్ ఎలక్ట్రిసిటీ బోర్డ్‌లో జూనియర్ ఇంజనీర్ ఉద్యోగం సంపాదించాడు. ఇంత చదువున్నా అతనికెప్పుడూ ఎవరో ఒకరి అండదండలవసరం. అందుకే అతను కాంగోరెడ్డి పంచన చేరాడు. అతనికి ఎలాంటి పొలిటికల్ లీనింగ్సూ లేవు. తనవాళ్ళ పార్టీ ఏదయితే తనది అదే పార్టీ.

హరబాబు తండ్రి స్కూలు మాష్టరు. ఖమ్మంజిల్లా సత్తుపల్లిలో అతని తల్లీదండ్రీ వుంటారు. అతనికో చెల్లెలుంది. అతను తన వాళ్ళకు డబ్బు పంపిస్తుంటాడు నెలకింతని.

హరబాబు భార్య మేరీకన్యకు 24 ఏళ్లు. నల్లటి నలుపు, గుండ్రని ముఖం, చక్రాల్లాంటి కళ్లు, తెల్లటి పలువరుస. నవ్వితే మనిషి బాగున్నట్టుంటుంది. కాని అలాంటి అవకాశాలే తక్కువ. వెల్లుల్లి అధికంగా తినటంవల్ల ఆమె దగ్గర వెల్లుల్లి వాసన వస్తుందని జోధలో నివాసినులంటారు. అందుకే ఓల్గా ఆమెని 'వెల్లుల్లీ' అని పిలుస్తుంది. భర్తకులాగానే, ఈమెకూ ఎవరి కొంగో పట్టుకు తిరగటం మానసికమైన అలవాటు. మెత్తని మనిషిలాగా కన్పిస్తుంది. నోరున్నవాళ్లని అనుసరిస్తుంది. అయితే అవసరమైనప్పుడు నోరు విప్పగలదు కూడా, పోట్లాడ్డానికీ, ఏడవటానికీ కూడా. టెన్త్‌క్లాసు కష్టపడి గట్టెక్కింది. తండ్రి ఆదెయ్య, మామ ఏసుపాదం సహోద్యోగులు కావటంతో తాము మాదిగలు, భర్త

మాలయినా శాఖభేదాన్ని పట్టించుకోకుండా ఓవిధంగా సంస్కరణ వివాహమే చేసుకున్నారు వాళ్లు. తల్లిదండ్రులనుండి సంక్రమించిన క్రైస్తవమతంలో విశ్వాసం భర్తకు కొంత తక్కువా, భార్యకు కొంత ఎక్కువా వున్నాయి. వీళ్ళకు రెండేళ్ళ కొడుకున్నాడు. పేరు ప్రదీప్ చక్రవర్తి.

హరబాబుపట్ల కొన్ని అనుమానాలున్నాయి కన్యకు. ఏ 'రామచిలుక' తన గోరింక నెగరేసుకుపోతుందోనని ఆమె భయం. అందుకే, మూతి ముడుపులు, అలకలు, మౌనవ్రతాలు, నిరశనవ్రతాలు, వాగ్వివాదాలు, కన్నీళ్లు, బెదరింపులు లాంటి అస్త్రాలతో నిరంతరం ఆరమ్డ్ స్ట్రగుల్ చేస్తూనే వుంటుందామె.

హరబాబు పక్కపోర్షనే మహమ్మద్ జైనులాబుద్దీన్ ఆలీ హస్కరీది. ఆ పేరును మావాళ్లు 'జైన్'కు కుదించారు. 'ఖాన్‌జాదా'ల వంశం వాణ్ణని చెప్పుకుంటాడు. పచ్చటి మనిషి, నల్లటి గడ్డం. ఏభయ్యోపడిలో పడినా ఒక్క వెంట్రుక నెరవలేదు. ఎండ వేడికి చికాకు కల్గినప్పుడు నోరుముడిచి నోటినీ, ముక్కునీ చిట్లించి పైకి లాగుతుంటాడు. అరబ్బీ, ఫార్సీ, ఉర్దూలో మంచి పండితుడు. మాకర్థంకాదని టుట్టీఫుట్టీ తెలుగులో మాతో మాట్లాడుతుంటాడు, కాని ఉర్దూలో మాట్లాడటమే అతనికిష్టం. ఇంగ్లీషు బాగా రాదు.

ఒకప్పుడు భారతదేశాన్ని, హిందూస్థాన్ని ఏలినవారి వారసుడిగా అతనికి అంతరాంతరాల్లో అహం లేకపోలేదుగానీ, బయటపడడు. బతికి చెడ్డవాడయినా పూర్వపు వాసనలు పోలేదు అతనిలో. జోధలోలో అతని అతిథి మర్యాద తర్వాతే అందరిదీ. మతంపట్ల తనకు పూర్తి విశ్వాసముందనే అనుకుంటాడతను. ఓసారి నేను ఉర్దూ నేర్చుకుంటూ "అల్లా' ఎలా రాయాలో చూపించవయ్యా' అంటే అతను ఆ మాటను పెన్నుతో రాయటానికి ఇష్టపడలేదు. ఇంట్లోనుండి పెన్సిలు తెచ్చి దాన్ని చూపాడు. ఇంకులో స్పిరిట్ కలుస్తుందట. మరి అలాంటి ఇంకుతో "అల్లా పర్‌వర్‌దిగార్ కా నాం కైసా లిఖూం" అన్నది జైన్ ఉవాచ. మరి, ముప్పైశాతం ఆల్కహాల్ వున్న విస్కీ బాటిల్ని ఖాళీచేయటానికి మాత్రం అతనికభ్యంతరంలేదు.

జైన్‌కున్న అలవాటల్లా పాన్ నమలటం, చాయ్ తాగటం. అతనికున్న ఆస్తంతా వాళ్ళ నాయన కాలంలోనే హారతికర్పూరమైంది. తండ్రినుండి మిగిలింది పుస్తకాలషాపు ఒక్కటే. దాన్ని సరిగ్గా నడపలేకపోయినా, ఇల్లు గడవటానికి కావాల్సినంత సంపాదిస్తూనే వున్నాడు. డబ్బులేకపోయినా, పూర్వపు ప్రాభవాన్ని గుర్తుకుతెస్తూ ఇంటిద్వారానికి మంచి ఖరీదయిన డోర్ కర్టెన్ వేలాడుతూ వుంటుంది. పర్దానషీన్ స్త్రీలు కాదు అతని భార్యా, పెద్ద కూతురూ. డోర్ కర్టెన్ ప్రిస్టేజికి మాత్రమే.

జైన్ భార్య ఫర్వతున్నీసా బేగంకు 43-44 ఏళ్ళుంటాయి. మనిషి సన్నగా, బక్కిపీచులా వుంటుంది. పెదవులమీద తాంబూలపు ఎరుపూ, చేతులు పాదాలమీద మెహందీ రేఖల ఎరుపూ చెరిగిపోకుండా చూసుకుంటూ వుంటుంది. ఆమెకు ఎరుపు, పసుపుపచ్చ అంటే ఇష్టం. అలా అని మిగతా రంగు చీరెలు కట్టదని కాదు. ఏ రంగు చీరెకట్టినా, అంచులోనో ప్రింటులోనో ఈ రంగులుండేట్టు చూసుకుంటుందామె.

ఈ దంపతుల 'నికా' అయి 22 ఏళ్ళు అయింది. పెళ్ళయిన పదకొండు నెలలకే పెద్దకూతురు రోషనారా బేగం జన్మించింది. అందరూ 'రోషన్' అంటారామెని. పిల్ల తండ్రిలా పచ్చగా, పొడుగ్గా వుంటుంది. పల్చటి పెదవులు, బుగ్గలు. బి.కాం. ఫైనలియర్ చదువుతోంది. ఎవరి కళ్ళూ కూతురిపై ప్రసరించకుండా తల్లి సంరక్షిస్తూ వుంటుంది. పెద్దపిల్ల పుట్టిన పదేళ్ళకు బేగంకు వరసగా ఆరుగురు పిల్లలు పుట్టారు. ప్రతి ఏటా కాన్పు.

కాన్పులయితే ఆరే ఐదో కాన్పులో ఆమె కవలల్ని కన్నది. లేక లేక ఎన్నాళ్ళకో అల్లా దయవల్ల మగనలుసు కలిగాడని 'అల్లాబక్ష్' అని పేరు పెట్టుకున్నారు కొడుక్కు. వాడు ఐదో క్లాసు చదువుతున్నాడు. మూడోది ఆడ పిల్ల- మెహరున్నీసా బేగం, నాల్గు జహంగీర్, ఐదు ఆరు కవలలు- నసీమా, మల్కా. ఏడోసంతానం బద్రుద్దీన్.

ప్రస్తుతం బేగం పదేళ్ళనుండి కనే పని మానేసి పిల్లల పెంపక కార్యక్రమంలో పడిపో యింది. ఫామిలీ ప్లానింగ్ ఆపరేషనంటే ఇద్దరికీ భయం. అయితే ఆ విషయం బయ టకు చెప్పరు.

"ఖుదాకా ఫజల్, ఔలాద్ ఉన్కా బక్షహై" అనంటారు.

జైన్ జోరూ కా గులాం. పెద్ద పిల్ల తర్వాత మరిపిల్లలు కలగనంతవరకూ 'నీదే లోపం' అని భర్తను సాధించేదట బేగం. వరసగా పిల్లలు కలగటం మొదలెట్టిన తర్వాత భర్త దగ్గరకు వస్తే చాలు "జావ్ జావ్! ఆప్ కో ఔర్ కుఛ్ కాం నహీజీ" అనేదట. అదేం పాపమో ఉపవాసంవుండి వుండి ఎప్పుడో ఓ బలహీన క్షణంలో లొంగిపోతే చాలు ఆమెకు గర్భం వచ్చేది. ఇహ ఆ తర్వాత వేవిళ్ళు, వాంతు లు, మందులు, డాక్టర్లు, బిల్లులు. జైన్‌కు భార్య తలపుకు వస్తే భయమేసేది. రాత్రి పదకొండింటికి ఇంటికి తిరిగి వచ్చిన జైన్‌కు తిండి పెట్టేందుకు మెలకువగా వుండలేకపో యేది, పొద్దస్తమానం పిల్లలతోగడిపి, వీలుచే సుకుని మరీ 'జోధలో'లో సంఘసేవ చేసే బేగంకు. ఆమెను నిద్రలేపే ధైర్యంలేని జైన్ తనే వడ్డించుకుని భోజనం కానిచ్చేవాడు. పిల్లలు ఎప్పుడైనా విసిగించితే కోపగించే, మందలించే హక్కు జైన్‌కు లేదు. పిల్లల్ని ఎవరు ఏమన్నా- చివరకు భర్తతోసహా- ఆడ పిల్లిలా మీదపడి కరిచేస్తుందామె. పిల్లలు 'జోధలో'లో పుట్టి పెరగటంవల్ల తెలుగు చక్కగా మాట్లాడ గలుగుతారు కానీ, ఆమె అంతగా మాట్లాడలేదు.

'జోధలో'లో కాంగోరెడ్డి తర్వాత సీనియారిటీ జైన్‌దే. అందువల్లే సీనియారిటీని నిష్ఠగా పాటించే జోషువాగారు జైన్ దంపతులకు అధిక సంతానమైనా ఇల్లు ఖాళీ చెయ్యమనలే దు. మైనారిటీ వర్గీయుడైన జైన్‌కు పార్టీలు లేవుగానీ, సంప్రదాయం ప్రకారం సెక్యులర్ కాంగ్రెసు పార్టీకి తన ఆమోదం తెల్పేవాడు.

జైన్ ఇంటిపక్క, ప్రహరీ గోడనానుకుని దుకాణానికి అద్దెకిచ్చాడు జోషువాగారు. కా ర్లు లోగిలిలోకి ప్రవేశించ గలిగేంత విశాల మైన స్థలం ఖాళీ వదలి, రెండో వైపుకూడా ప్రహరీ గోడనానుకునే దుకాణం కట్టించి అద్దె కిచ్చాడు. ఈ రెండు దుకాణాలూ రెండు 'యల్' ఆకారాలను సంధించి 'జోధలో'కి ప్రవేశద్వారంగా పనిచేస్తాయి. కుడివైపు షాపుకు రెండు గదులున్నాయి. ముందుగది మెడికల్ షాపు, వెనకది స్టోర్ రూం. ఆ దుకాణానికి వెనుక 'జోధలో' ఆవరణలోకి తెరుచుకునేద్వారంతో ఓ గది పెట్టు భాగంలో కూనవరం గాయిత్రీ వరప్రసాదశాస్త్రి- అంటే 'కూగాశాస్త్రి' కాపురముంటున్నాడు. తద్దినాలు పెట్టిస్తాడు కాబట్టి 'కూగా' అంటే 'కూసేగా డిద' అని కొంతమంది పనిలేని 'జోధలో నివాసు'లంటారు. కానీ అందులో నిజంలే దు. అతనికి 35 ఏళ్ళుంటాయి. మనిషి చామనఛాయ. కాయపారుగా, శలాకలా వుంటాడు. నెత్తిమీద అరంగుళం జుట్టు, గడ్డం పావంగుళం పెరిగి వుంటుంది. బిళ్ళ గోచీ ధోవతీ, పొడుగు చేతులచొక్కా, నుదుటిన విభూతిరేకలు, కుంకుమబొట్టు- బయటకు వెళ్ళే వేషం ఇది. సైకిలు హాండిల్‌బారుకు సంచీవేలాడుతూవుంటుంది. ఆ సంచీలో ఓ పంచాంగం, ఓ నోటు బుక్కూ, స్టేప్లర్, దర్భలకట్టా, ఓ బాల్‌పెన్నూ వుంటాయి. ఆ నోట్‌బుక్‌లో ఓ వైపు తన ఖాతాదార్ల చిరునా మాలు, వాళ్ళ ఇళ్ళల్లో వచ్చే ఆబ్దికాల తిథు లూ వగైరా రాసి వుంటాయి. రెండోవైపు తను వడ్డీకి అప్పులిచ్చిన వివరాలుంటాయి.




తద్దినం, పుణ్యాహవచనం, సత్యన్నారాయణవ్రతం, అభిషేకం వగైరా చేయించటానికి తగినన్ని మంత్రాలు, తిథివార వర్జ్యాలు చూడగలిగే పంచాంగజ్ఞానం, లగ్నాలు పెట్టటం వగైరా కష్టపడి నేర్చుకున్నాడు. పెళ్ళిళ్ళు, వడుగులాంటి పెద్ద కార్యాలతనికి కొరుకుడు పడవు. అలాంటివి మాట్లాడుతుంటే సబ్ కాంట్రాక్టులకిస్తాడు. తనకు తీరిక లేకపోతే ఆబ్దికాలకు మనుషులను 'డెప్యూట్ చేస్తూ వుంటాడు. అలా డెప్యూట్ చేసినందుకుగాను కమీషను వసూలుచేస్తుంటాడు.

ఇలా మంత్రాలవ్యాపారం చేస్తూ, బహుకొద్దికాలంలోనే చాలా డబ్బు కూడబెట్టాడంటారు జనం. అందులో కొంత వడ్డీకి తిప్పుతుంటాడు. బాకీలు నిక్కచ్చిగానే వసూలుచేస్తాడు కూగాశాస్త్రి. నెలవారీ వడ్డీ బకాయిపడ్తే వాళ్ళ తద్దినం పెట్టేస్తాడు అతను. వడ్డీ ఇచ్చేస్తే నిశ్చింత. ఆ తర్వాత మీరేమన్నా పడ్తాడతను. కూగాశాస్త్రి భార్య బ్రెస్ట్ కాన్సర్‌తో పోయి సంవత్సరమైంది. ఆమెవల్ల అతనికేం సంతానం కలుగలేదు. మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనే ఆలోచన అతనికుందిగాని కట్నం భారీగా ఇస్తామనే ఏ పిల్ల తల్లిదండ్రీ ముందుకు రాకపోవటంతో ప్రస్తుతానికా ఆలోచనను వాయిదా వేశాడతను. కూగాశాస్త్రికున్న ఒక్క అలవాటు నశ్యం పీల్చటం.

'జోధలో' గేటుకిరుపక్కలా బయటవేపుకు ధుకాణాలున్నాయని చెప్పాను. మందుల ధుకాణంలో లాగానే, వెనుక స్టోర్ రూం వున్నా, 'లోపలి భాగంలో మరి రెండు గదులు కూడా అద్దెకు తీసుకున్నాడు హరి నారాయణ సేఠ్. ఆయనది ఉత్తర ప్రదేశ్‌లో 'బరేలీ'. వాళ్లెప్పుడో తాతలనాడు వచ్చి హైదరాబాదులో సెటిలయారు. అతను 'జోధలో నివాసి' కాదు గనుక అతన్ని గూర్చి విపులంగా మనకనవసరం.

రెండుగదులు హరినారాయణసేఠ్‌కు పోగా మిగిలిన ఒక గది పంచలో అండమ్మ-అసలు పేరు ఆండాళ్ళమ్మ (జోషువాగారు తనకు ఇష్టమైన కోడిగుడ్డును దృష్టిలో వుంచుకుని అలా పిలవటంతో స్థిరపడిపోయిన పేరు) కూతురు శుకవాణితో వుంటోంది. అండమ్మ వయసు 43 సంవత్సరాలు. కూతురు శుకవాణిని అందరూ 'రామచిలుక' అంటారు. మంచి వయస్సులో వున్నప్పుడు ఆమె భర్తపోయాడు. అయినా ధైర్యంకూడగట్టుకుని, బంధువులెవరూ సాయంచెయ్యకపోయినా, తాను చిన్నప్పుడు నేర్చుకున్న సంగీత విద్యను ఆధారం చేసుకుని బతకటం ప్రారంభించిందామె. ఉదయం తన ఇంటిదగ్గర, సాయంత్రం బయట సంగీత పాఠాలు చెప్తుంది ఆమె. ఆమె పూర్వీకులు తమిళదేశంనుండి నైజాం దేశంవచ్చి స్థిరపడ్డారు. ఇప్పటికీ తల్లీ కూతుళ్ళు ఇంట్లో తమిళమే మాట్లాడుకుంటారు. చదవటానికీ, రాయటానికి, నిత్యవ్యవహారానికి తెలుగే ఉపయోగిస్తారు.

రామచిలుక వయసు 16-17 ఏళ్లు వుంటాయి. ఇంటరు రెండో సంవత్సరం చదువుతోంది. పిల్ల అమాయకత్వాన్ని అలుసుగా తీసుకుని ఎవరు ఏం అఘాయిత్యం చేస్తారోనని తల్లి భయపడ్తూవుంటుంది. కూగాశాస్త్రికి ఆమెను వివాహం చేసుకోవాలనే కోరిక వున్నది కాని, సంగీతం పాఠాలు చెప్పుకుని బతికే ఆమె తనకు కట్నం ఇవ్వలేదని ఆ ప్రస్తావన మానుకున్నాడతను.

అండమ్మ భాగం పక్కనే 'జోధలో'లో వాయవ్యంగా వుండే పోర్షనే ఖరం ఖాళీ చేసింది. ఇంకా ఎవరూ ఆ భాగంలోకి అద్దెకి దిగలేదు. ఆ పోర్షనుకు ఎదురుగా కొంచెం ఖాళీ స్థలం వదలి సిపిఐ శర్మ వుండే భాగం ఉంది. అతని పూర్తిపేరు కామవరపు ప్రద్యుమ్నశర్మ. అంటే కె.పి.శర్మ. అయితే పార్టీ మీద ప్రేమతో, ఇంటిపేరును ఇంగ్లీషు అక్షరం 'సి'తో కూడా రాయవచ్చు గనుక అలా రాస్తూ 'ఐ'కోసం పేరులో 'ఇంద్ర' చేర్చుకుని వెరసి పొడుగ్గా 'కామవరపు ప్రద్యుమ్నేంద్రశర్మ' పొట్టిగా 'సిపిఐ శర్మ' అయ్యాడు.



అయితే శర్మ అనే కులంతోక ఎందుకని అడక్కండి, ఎవరో అన్నట్టు 'ఎంతవారలైన కులం దాసులే కదా!

అతనికి 42 ఏళ్ల వయసు. మనిషి పొట్టి. చెంపలు ఇప్పుడిప్పుడే తెల్లబడుతున్నాయి. మనిషి బొద్దుగా వుంటాడు. కళ్ళల్లో ఎర్ర జీరలు, బూరబుగ్గలు, బండపెదాలు, సన్నని మీసకట్టు, నోరు నవ్వుతుంటే ఎక్కిరించేట ట్లుండే నొసలు. స్లాక్ షర్టు, పాంటు వేసు కుంటాడు. చిన్న బొజ్జ బయటకు ప్రస్ఫుటమ వుతూవుంటుంది.

సిపిఐ శర్మ స్వస్థలం కర్నూలు జిల్లా బనగానపల్లి. అయితే చదువుకోసం అతను చాలా ప్రదేశాలు తిరిగాడు. కర్నూలులో ఎస్.ఎస్.ఎల్.సి, తిరుపతిలో బి.కాం., హైదరాబాద్‌లో ఎం.కాం. చేశాడు. ఆ తర్వాత ఐసిడబ్ల్యు చేసి హెచ్.సి.యల్‌లో అకౌంట్స్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నాడు. నాలుగు ఊళ్లల్లో వున్న అనుభవం, తిరిగిన అనుభవం వుంది. మనుషులను కూడగట్టుకునే చాకచక్యం వుంది. సాయంచేస్తానని మనుషులను తిప్పు కుంటాడు. వీలయితే చేస్తాడు, వీలు కాకపోతే 'వాడొట్టి కొరకరాని కొయ్యోయ్, కుదరలేదు' అని చెప్తాడు.

సిపిఐ శర్మ భార్య పేరు గాయిత్రి. ఆ పేరు నచ్చక రష్యామీద ప్రేమతో 'ఓల్గా' అని ఆమె పేరు మార్చేశాడతను. ఆమె వాక్కు ఉధృత నదీప్రవాహంలా వుంటుంది కనుక ఆపేరు సరైందే అనుకోవచ్చు. అతడామెకు మేనత్త కొడుకు. ఆమెకు 15 ఏళ్ల వయసులో 19 ఏళ్ల శర్మతో వివాహమైంది. పెళ్ళి విషయంలో అతన్నెవరూ సంప్రదించలేదు. పుట్టినప్పటి నుండి ఆమె అతని భార్యగానే పెరిగింది. పెళ్ళయింతర్వాత బి.ఏ.దాకా చదివింది. ఆమె గుడ్లెర్రచేసి, మాట్లాడితే ఎంతటివాడైనా కుక్కిన పేనవవల్సిందే. అలాంటిది ఆ పొట్టి, చచ్చుబావ అనగా ఎంత? మనిషి భర్తంత ఎత్తే వుంటుంది. పచ్చటి పసిమి. పక్క పాపిట తీస్తుంది. పొట్టిజడ. పమిట జారిపోతున్నా పట్టించుకోని నిర్లక్ష్యం ఆమెది.

వాళ్లకు పెళ్ళయిన మొదటి సంవత్సరంలోనే కొడుకు పుట్టాడు. అప్పటికింకా శర్మ చదువుతూనే వున్నాడు. కొడుక్కి పేరు పెట్ట డంలో కూడా శర్మ పాత్ర ఏం లేదు. తాతగారే వేంకట లక్ష్మీ వరప్రసాద రాఘవేంద్ర సత్యశాయినాథ్ (సి.వి.యల్.వి.పి.ఆర్.ఎస్.ఎస్. నాథ్) అని నామకరణం చేశాడు. అంత పొడుగాటి పేరును కుదించేసిన మా జోధ లోక వాసుల అభిరుచిని మెచ్చుకోవాలి. తెలుగు వర్ణమాలలోని 'అ' నుండి 'క్ష' వరకు అన్ని అక్షరాలూ వున్నాయన్న ఉద్దేశంతో కి వాసులు అతనికి 'అక్షనాథ్' అని పునర్నామక రణం చేశారు. అతను చురుకైన పిల్లవాడు. ఇంజనీరింగ్ చివరి సంవత్సరంలో వున్నాడు. అతని తర్వాత ఎన్నో ఏళ్లకుగాని శర్మకు రెండో సంతానం కలుగలేదు. కూతురి పేరు లోలిత. కాన్వెంటులో నాలుగో క్లాసు చదువు తోంది.

సిపిఐ శర్మ ఇంటినానుకునే జోధలో నైరుతి మూలభాగం పరమేశ్వరరావుది. జైన్ పేరు సరిగ్గా ఉచ్చరించలేక పరేషాన్‌రావు అనటంతో ఆయనకి ఆ పేరే స్థిరమైంది. అతనికి 33 ఏళ్లు. పొట్టి మనిషి, మధ్యపాపిడి, వంకుల జుట్టు, చైన్ స్మోకర్. మనిషి ఎప్పుడూ గాబరాగా వున్నట్టు కన్పించటంతో జోధ లోక వాసులందరికీ జైన్ పెట్టిన పేరు నచ్చింది. అతడు భోపాల్‌లో బి.ఫాం చదువు కుని హైదరాబాద్‌లో సెటిలయ్యాడు. అసలు ఊరు తాండూరు. అక్కడ పొలాలున్నాయి. తల్లీ దండ్రీ అక్కడే వుంటారు. భోపాల్లో చదువు వెలగబెట్టే రోజుల్లోనే సుష్మారాణిని ప్రేమించడం పరాయిప్రాంతం, భాషవాడిని తమ కూతురు ప్రేమించటం ఆమె తల్లిదండ్రు లకు నచ్చక అతన్ని ఇంట్లోనుండి వెళ్లగొట్టటం, అయినా ప్రేమ చావక అతను కాలేజీలో ఆమెను కలుసుకోవటం, దానికీ అడ్డంకి ఏర్పడే పరిస్థితి రావటంతో రిజిస్టర్ మారేజీ






చేసుకుని గుట్టుచప్పుడుగా ఓ అద్దె ఇంట్లో కాపురం పెట్టటంతో రాణి తల్లిదండ్రులు చివరకు రాజీకి రావటం, అదంతా ఓ పెద్దకథ. అతనా కథ అందరికీ మహా రసవంతంగా విన్పిస్తూవుంటాడు. అయితే అతని తల్లిదండ్రులకూ ఈ వివాహం నచ్చలేదు. చేసేది లేక రాజీపడ్డారు. తండ్రి ఇచ్చిన పెట్టుబడితో జోధలో ముంగిలిలో మందుల షాపు తెరిచి, జోధలో సభ్యుడయ్యాడు. తన కథనంతా టేప్‌రికార్డర్‌లా అందరికీ విన్పిస్తుంటాడు. వినివిని బోర్ కొట్టినవాళ్లు, 'ఇంక టేప్ రికార్డర్ ఆపు చేయండి' అంటుంటారు.

సుష్మారాణికి 27-28 ఏళ్లుంటాయి. తెల్లగా వుంటుంది. కోలముఖం. పాపిట సింధూరం. పువ్వులు, లతలు, చెట్లు ప్రింట్లు వున్న చీరెలు కట్టుంది. తెలుగు నేర్చుకో ప్రయత్నిస్తోంది. భార్యాభర్తలది అన్యోన్య దాంపత్యం. వాళ్లకు మూడేళ్ళ కూతురు పేరు అలకనంద.

★ ★ ★

తన గది బయట నులక కుక్కిమంచంమీద పడుకుని కూగాశాస్త్రి భోరున విలపిస్తున్నాడు పొద్దున పదకొండు గంటల సమయంలో. ఆ గోల విన్న నేను, మందులషాపునుండి పరేషాన్‌రావు పరుగెత్తుకొచ్చాం. అప్పటికే ఆడంగులు అతనిచుట్టూ పరివేష్టించివున్నారు. ఓల్గా సతీమణి ఆధ్వర్యంలో సమీక్ష కొనసాగుతోంది.

"ఏమైందయ్యా కూగాశాస్త్రీ! ఎందుకట్టా ఏడుస్తావు? ఏమయిందో చెప్పి ఏడువు'' అంటోంది ఆమె.

. మాట మాట్లాడే తీరిక లేక పొర్లిపొర్లి ఏడుస్తున్నాడు కూగాశాస్త్రి.

"కడుపులో నెప్పేమోనక్కా! బాధ భరించలేకుండా వున్నట్టున్నాడు'' అంది కన్య.

"ఏమండీ! కుడివేపా, ఎడంవేపా నెప్పి?" అనడిగింది ఆన్నీ.

"మాటలతో కాలక్షేపం చేయటంకంటే మనిషిని ఆస్పత్రికి తీసుకెళ్తే మంచిది'' అంది కాళి.

"నిక్షేపంలా వున్న మనిషికేమైందమ్మా పాపం, అసలే వంటరివాడు'' అని సాను భూతి ప్రకటించింది అండమ్మ.

"కుడివైపు నొప్పయితే అపెండిసైటిస్ అయ్యేవుంటుంది. ఇరవై నాలుగ్గంటల్లో ఆపరేషన్ చెయ్యకపోతే ప్రాణానికి ముప్పు'' అంది ఆన్నీ.

"అసలు నెప్పెటువైపో చెప్పేడిస్తేగా! ఇదుగో కూగాశాస్త్రీ ఎటు నెప్పో చెప్పేడువు'' అంది ఓల్గా కూగాశాస్త్రి భుజంపట్టుకు కుదుపుతూ.

"ఏం చెప్పమంటావు తల్లీ! నేను నాశనం అయిపొయ్యాను'' అన్నాడతను వెక్కుతూ.

"రోగంవస్తే మందేసుకుంటారుగానీ, ఏడుస్తారా, లే, లేచికూర్చో'' అంది కాళి.

"ఇంకేం కూర్చోను తల్లీ! ఇంక జీవితంలో మళ్ళా నిలబడగలనంటారా?" అన్నాడు లేచి కూర్చుని భోరుమంటూ.

"అతనికసలు ఏ జబ్బూ లేనట్టుంది. మరెందుకో ఏడుస్తున్నాడు?" అంది మా ఆవిడ భాను.

అంతలో మా మూలవిరాట్ వంకీ కర్రతో అవతరించాడక్కడికి.

"ఏం మాయరోగమొచ్చిందయ్యా, ఏడిచ్చుస్తున్నావు'' అనడిగాడు జోషువాగారు.

"ఏం చెప్పమంటారు స్వామీ! అంతా అయిపోయింది. సర్వనాశనమైపోయాను'' అన్నాడు కూగాశాస్త్రి ఆరున్నొక్క రాగంతో పాతపాటే పాడ్తూ.

"ఛట్... లేచినిలబడు. ఏమైందో సరిగ్గా చెప్పి ఏడుస్తావా లేక ఈ కర్రతో ఓటి తగిలించేదా?" అన్నాడు జోషువాగారు హుంకరిస్తూ, కర్రతో మంచం పట్టీమీద కొడ్తూ.

దాంతో కొంతవరకు దయ్యం వదిలింది కూగాశాస్త్రికి. "వాడు పారిపొయ్యాడు'' అన్నాడు.




"ఎవడు పారిపోయాడు!?"

"ఖరం బదిలీ చేయించుకుని శ్రీకాకుళం వెళ్ళిపోయాట్ట. పొద్దున్న బాంక్‌కి వెళ్ళి విచారిస్తే వాళ్ళు చెప్పారు''

"అయితే నువ్వెందుకు ఏడవటం?"

"ఏడవక ఏం చావమంటారు. నా డబ్బుకు నీళ్ళొదులు కోవల్సిందేనా? ఓరిదేముడా! ఏం రాసిపెట్టావురా నా ముఖాన! అసలు మీరే చేశారు ఇదంతా. ఎదురుగా వుంటే వాడి జుట్టు పట్టుకునైనా నా బాకీ వసూలు చేసుకునేవాణ్ణి. మీరే వాణ్ణి ఇంట్లో నుండి వెళ్ళగొట్టారు. శనిగ్రహం మీ రూపంలో ప్రత్యక్షమైంది''

"నోర్మూసుకో. నన్నేమన్నా అన్నావంటే చమడా లెక్కదీస్తాను. పాపిష్టి సొమ్ము పీడా పోయింది. సంతోషించు. లోగిల్లో ఎవరో చచ్చినట్టు అశుభంగా ఏడిచ్చావకు. నోరు తెర్చావంటే మెడబట్టి బయటకు గెంటుతాను'' అని క్షణంలో సమస్యనిట్టే తేల్చి పైకి వెళ్ళిపోయాడాయన.

గొంతు పెగల్చకుండా ఇంకా మళ్ళీ మళ్ళీ ఏడుస్తూనే వున్నాడు కూగాశాస్త్రి.

"అతను శ్రీకాకుళం పోతేనేం, సింగపూర్ పోతేనేం? ఉత్తరం రాయి. అప్పు తీర్చమని. లేకపోతే ఓసారి వెళ్ళిరా. మనిషి బతికే వున్నాడుగా, చచ్చినప్పుడు ఏడుద్దువుగాని'' అంది ఓల్గా తేరుకుంటూ.

"దూరభారం. ఖర్చులకు డబ్బెవరిస్తారమ్మా'' అన్నాడు కూగాశాస్త్రి వాపోతూ.

"ఎవరో ఎందుకిస్తారయ్యా! నీబాకీ వసూలుకి నువ్వే ఖర్చుపెట్టుకోవాలి'' అంది ఓల్గా.

"ఇంకా నిజంగా ఏదో రోగం వచ్చిందనుకున్నాము నయం" అంది కాళి.

"నేననుకోలేదు. డబ్బు రోగమే ఈయనకున్న జబ్బని అందరికీ తెల్సు'' అంది ఆన్నీ.

"అసలు నువ్వేగా అపెండిసైటిస్ అన్నది'' అంది కన్య.

"నువ్వే కడుపులో నెప్పన్నది. నేను కా

దు'' అంది ఆన్నీ.

"నేనేం అనలేదు. నువ్వే అన్నావు. నువ్వు చెప్పు బేగమక్కా ఎవరామాట అంది?"

"నహీ, ఆన్నీ'' అంది బేగం.

"ఆన్నీ కాదు. కన్యనే షురూచేసింది అంతా'' అంది రాణి.

వాగ్యుద్ధం ఇంకెలా నడిచేదోగాని, ఇంతలో లోగిల్లోకి ఓ లారీ వచ్చింది సామానుల్తో. ఖరం ఖాళీచేసిన భాగంలోకి కొత్తవాళ్లు దిగుతున్నారు. లారీ ఆగగానే ముందు సి.పి.ఐ. శర్మ, మరో పెద్ద మనిషీ దిగారు. అతన్ని చూడగానే పోల్చుకున్నాను. అతను బుద్ధారావు. ఎడ్యుకేషన్ డిపార్ట్‌మెంటులో ఓ ఛోటా ఆఫీసరు. బరువు పెట్టందే కాయితం తీయడని ప్రసిద్ధి. సి.పి.ఐ. శర్మ అక్కడే ఉన్న నన్ను అతనికి పరిచయం చేశాడుగాని, "ఆహాఁ, అలాగా'' అన్నాడు బుద్ధారావు కన్నెత్తయినా నావంక చూడకుండా.

లారీలో సామాన్లు కూలీవాళ్లు లోపలకు చేరవేస్తున్నారు. అంతలో ఓ ఆటో వచ్చింది. అందులోనుండి బుద్ధారావు భార్య, ఇద్దరు పిల్లలూ దిగారు. మా లోగిలి మహిళా సమాజంవారు ఆమె చుట్టూ మూగారు. "రండి, రండి. మీకు మా లోగిల్లోకి స్వాగతం" అంది ఓల్గా తనవంతు బాధ్యత నిర్వహిస్తూ.

ఆమె నవ్వింది. ఆపైన ఓల్గా మహిళా నివాసినులనందర్నీ పరిచయం చేసిందామెకు.

"నా పేరు మణి- శమంతకమణి. మా పిల్లలు. ఇది సరోజిని, వాడు కోదండరాం. అది తొమ్మిది, వాడు ఐదోక్లాసూ చదువుతున్నారు'' అని స్వపరిచయం చేసుకుని "మళ్ళీ కలుస్తాను. ఇంట్లో సామానూ అదీ సర్దాలికదా'' అని ఆమె తన భాగంలోకి వెళ్ళిపోయింది.

నేను రోజూ రాత్రి కాలేజీ (మాది సాయం కళాశాలలెండి) నుండి ఇంటికి రాంగానే, ఆరోజు వార్తాప్రసారం చేసిగాని విడవదు మా ఆవిడ. "పొద్దున దిగారు చూశారూ బుద్ధారావూ, ఆయన భార్యా, బాగా వున్నవాళ్లు లాగున్నారు. ఆమెకు నగలు కూడా బాగానే వున్నాయి. మెళ్లో నెక్లెసు, నల్లపూసల గొలుసు, ముత్యాలహారంకాక చేతులకు మూడుజతల గాజులు కూడా వున్నాయి. పెట్లో నాలుగుజతల దిద్దులు వేరేవున్నాయి. ఇంకో నెక్లెసూ వుంది. మధ్య తెల్ల డయమెండ్‌తో ఎంత బావుందో, ఆమెకెన్ని పట్టుచీరెలున్నాయనుకున్నారు. సాయంత్రం నేనూ, ఓల్గా వాళ్ళింటికెళ్తే అన్నీ చూపించింది'' అంది మా ఆవిడ పరమానందంతో.

"మరి ఉండకేం చేస్తాయి! అతని పైసంపాదన ఎక్కువ కాదూ'' అన్నాను ఆమె మత్తు కొంత దించకపోతే మనకు ప్రమాదం కనుక.

"అతను మీకు తెల్సా?"

"తెలీకేం. బాగా తెల్సు. పెద్ద పెద్ద చదువులు చదువుకున్నవాళ్లు, సంస్థల అధిపతులు కూడా అతనితో పనివుండి వస్తే వాళ్ళకు సీటు కూడా ఆఫరు చెయ్యకుండా, అధికార దర్పంతో మాట్లాడే అవకాశం కల్పించిన అతని ఉద్యోగం అతడిలో సహజంగా వున్న అహాన్ని మరింత ఎక్కువ చేసింది''

"ఆ మనిషంటే మీకు పడేట్టు లేదే. ఆవిడ పెద్ద కట్నంతో కాపురానికి వచ్చిందట. ఆ రోజుల్లోనే ఆమె పుట్టింటివాళ్లు రెండు లక్షల కట్నమిచ్చారట. డబ్బున్నదాన్నన్న అహంకారం ఆమె మాటల్లో కన్పిస్తూనే వుందిలెండి. వాళ్ళది గుంటూరు జిల్లా. సంగజాగర్లమూడట స్వస్థలం. అతనికక్కడ బాగా ఆస్తి కూడా వుందట"

"అలాగా ఇంకేం విశేషాలు రాబట్టావు?"

"అలా అంటే నేనేం చెప్పను పొండి''

"తరువాత నీకేబాధ. గిన్నెలకు, చెంబులకు, స్టౌలకు, గోడలకు చెప్పాల్సివస్తుంది''

"ఆమె వయసు ఎంత వుంటుందంటా

రు?" కీలకమైన అసలు విషయానికొచ్చింది మా ఆవిడ.

"ఏమో నాకేం తెల్సు. 35-36 వుంటాయేమో. అతనికీ నలభై ఏళ్ళకంటే వుండవు. జుట్టు రాలిపోయి, బట్టతలవుతూ, ఆపైన కళ్ళజోడుతో ఎక్కువ వయసున్న మనిషిలాగానే కన్పడతాడు''

అతని ఆకారం నా మదిలో మెదిలింది. నున్నగా షేవ్‌చేసే బుద్ధారావుకు ముక్కు నుండి పైపెదవివరకు వున్న మధ్య సొట్ట కొంచెం లోతుగా వుంటుంది. ఏనుండి ఎవరైనా అతని దగ్గరకొస్తే ఆమధ్య సొట్ట మరింత లోతవుతుంది. లోతైందంటే ఏదో క్వొరీ పెట్ట బోతున్నాడనే అర్థం. అతని కనుబొమలు పల్చగా వుంటాయి. చెవుల్లో వెంట్రుకలు. ఐదడుగుల ఆరంగుళాల ఎత్తు, చామనఛాయ మనిషి. బ్లాక్‌షర్ట్ వేసి, ఎప్పుడూ పాలిష్ చేసిన చెప్పులు వేస్తూంటాడు.

బుద్ధారావు లోగిలిలో చేరిన మొదటి ఆదివారం అది. పొద్దున ఏడు గంటలయినా లేవబుద్ధికాక పక్కమీద దొల్లుతూనే వున్నాను. అయితే మా మూలవిరాట్టూ, నివాసులూ చాలా "విం అండ్ విగర్ వున్నవాళ్లు. ఎవర్నీ హాయిగా పడుకోనివ్వరు. గోలవిని బయటకొచ్చాను.

కుడిచేత్తో టూత్‌బ్రష్షూ, ఎడంచేతిలో సిగార్‌తో అవతరించివున్నాడు జోషువాగారు. బుద్ధారావుతో తగాదా పడ్తున్నాడు. చుట్టూ జోధలో నివాసబృందం పరివేష్టించివుంది.

"చూడు మిస్టర్! పొరుగువాడికి సాయం చెయ్యమని బైబిలులో రాసివుంది. నేనా పొద్దున్నే లేవటం కుదరదు. మా మైకేల్ కూడా. చిన్నసన్నాసి, పొద్దున్నే లేవలేడుకదా! పని వెధవ ఏడింటికి ఏడుస్తాడు ఆడపిల్లను పొద్దున్నే పాలకు పంపించటం బాగుండదు. అందువల్ల నువ్వు నా క్కూడా పాలు పట్టు కురావాలి. ప్రత్యేకంగా నా కోసమేం వెళ్లటం లేదుకదా, నువ్వూ తెచ్చుకోవాలికదా. మన పరిధిలో మనకు చేతనైన సాయం ఇతరులకు చెయ్యటం మానవకర్తవ్యం. చూడు ఇంత తక్కువ అద్దెలో ఈ మహానగరంలో నీకెక్కడైనా ఇల్లు దొరుకుతుందా? నాకు తోచిన సాయం నేనూ చేస్తున్నాను ప్రజానీకానికి. అలాగే నువ్వూ నీ చేతనైనంత చెయ్యాలి'' అని చాలా అనునయంగా, భాషాప్రయోగంతో సంయమనం పాటిస్తూ ఉపన్యసిస్తున్నాడు జోషువాగారు. కొత్తనివాసి కనుక, నచ్చచెప్పే ధోరణిలో మాట్లాడుతున్నాడాయన.

"మిల్కుబూతు పాలు తెచ్చుకోవాలో, ఇంటి దగ్గరే పాలు పిండించుకోవాలో నేనింకా నిర్ణయించుకోలేదు. మీలాగే పొద్దున్నే లేవటం నాకూ కష్టమే. కనుక మీరు వేరే ఏర్పాటు చూసుకోండి'' అని చెప్పేశాడు బుద్ధారావు నిర్మొహమాటంగా. కొత్తపక్షి కదా! రెక్కలల్లాడిస్తూ పైకి ఎగరాలని ప్రయత్నించటం సహజం.

"ఇదేం పెద్దమనిషివయ్యా! చెప్తే అర్థంకాలా? నువ్వున్న భాగంలో వుండే 'ఖరం' పాలు తెచ్చి పెట్టేవాడు. అతడి భాగంలో చేరిన నీకు ఆ బాధ్యత లేదూ?" అన్నాడు జోషువాగారు విసుక్కుపోతూ.

"ఆ గాడిద తెస్తే, నేను తేవాల్సిన అవసరం లేదు''

"పెద్దమనిషిని పట్టుకుని గాడిదంటావా? నువ్వే గాడిదవు. నీ పేరు బుద్ధారావు కాదు. బుద్ధిలేని రావు- బులేరావు'' అన్నాడు జోషువాగారు. అలా నామకరణ సంస్కారం జరిగిపోయిందతనికి.

"మర్యాదగా మాట్లాడండి. టెనెంట్స్ అంటే మీ బానిసలు కాదు''

"ఏమిటోయ్ నీకు మర్యాదిచ్చేది. నా సర్వీసంత వయసు లేదు నీకు! నా మిగతా టెనెంట్లూ బానిసలేనా ఆకాడికి!! మనిషికి మనిషి సాయం చేసుకోపోతే ఎట్టా? ఏంవోయ్ కాంగోరెడ్డీ! నువ్వు హవుసు టాక్సూ, ఎలక్ట్రిసిటీ బిల్లులూ కడ్తున్నావా లేదా? నిన్నెప్పుడ






యినా తక్కువగా చూశానుటయ్యా?"

"లేదండీ పెద్ద మనుషులు మీరెందుకు చూస్తారు అట్లా మమ్మల్ని''

"ఏమయ్యా సిపిఐ శర్మా! నువ్వు చెప్పు. అవసరముండి పదిమంది మనుషులు నీ సాయంకోసం వస్తారుకదా! నువ్వు వాళ్లనేమ న్నా కించపరుస్తావటయ్యా! డిఫెన్స్ కాంటి న్‌లో ఛీప్‌గా దొరుకుతయ్యని సబ్బులు, డిటర్జెంట్ పౌడర్లు తెచ్చిస్తావుకదా నాకు. ఇందులో అమర్యాద ఏముందయ్యా?"

"లేదనుకోండి. బుద్ధారావు కొత్తగా వచ్చాడుకదా! మన లోగిలి సంగతి తెలియాలికదా అతనికి'' అన్నాడు సిపిఐ శర్మ నసుగుతూ.

"ఇదుగో లెబా! నువ్వు చెప్పవయ్యా! మీ ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ సేల్సు డిపోనుండి తేనె, చివరకు చీపురుకట్టలు కూడా తెచ్చిస్తావుకదా! నువ్వెప్పుడైనా అవమానంగా ఫీలయ్యావా అంట? అసలు నిన్నలా ఫీలవనిచ్చానా నేను? మాట్లాడవేం?"

"నిజమేలెండి. మనుషుల ఇష్టాఇష్టాలు కూడా తెల్సుకుని అడిగితే బావుంటుందికదా''

"ఏందయ్యా తెల్సుకునేది? ఈ లోగిల్లో వుండేవాళ్ళం అందరం కుటుంబ సభ్యుల లాంటివాళ్ళం. అందరం మన బాధ్యతలు సక్రమంగా నిర్వహిస్తేకదా లోగిల్లో శాంతి నెలకొనేది. మీరందరూ రాత్రి ఇళ్లకు వచ్చారో లేదోనని చూసి లోగిలి గేటు మూసే బాధ్యత నిర్వహిస్తున్నాడా లేదా కూగాశాస్త్రి. వచ్చిన్రోజే చెప్పాను. 'ఇది నీ బాధ్యతయ్యా' అని. అంటే ఒక్కరోజు, ఒక్కరోజయినా ఏమరికగా వున్నాడా తన బాధ్యతా నిర్వహణలో కూగాశాస్త్రి! ఇలాంటి వాళ్ళవల్లే కదయ్యా దేశం బాగుపడేది. ఈ బులేరావులాంటి వాళ్లూ వున్నారు, ఎందుకూ దండగ. హక్కులే గాని, బాధ్యత లక్కరలేదు. ఇంక దేశం ఏగతి బాగుపడుతుంది!!"

"నన్ను 'బులేరావు' అనకండి, నా పేరు బుద్ధారావు'' అన్నాడతను రోషంగా.

"ఇదేం వింతమనిషండీ ఈయన! ఓ హెూయ్ పెద్దమనిషీ! పేరు నీ సొంతమను

కుంటున్నావేమో. మేమందరం ఏ పేరు పెట్టి పిలిస్తే ఆ పేరే మనిషికి. మా లోగిలి సత్సంప్రదాయాలు నువ్వు నేర్చుకోవాలయ్యా''

"అది సరేలెండి. వచ్చిన రెండోరోజే మనిషిని అలా అదిలిస్తే ఎలా?" అన్నాను నేను కలుగజేసుకుంటూ.

"ఇదుగో పోనీబాబూ! నువ్వు దూరంగా వుండు. నువ్వు చెయ్యటం లేదుటయ్యా నాకు సాయం. మొన్న లెటర్‌పాడ్ ప్రింటింగ్ చేయించుకురమ్మంటే చేయించుకు వచ్చావా లేదా? బాంకుపని ఎప్పుడుపడ్డా హరబాబు చేస్తున్నాడా లేదా? ఇహ జైన్ ఎంత పెద్దమనిషండీ! మార్కెట్‌లో ఎప్పుడు మంచి ఫిష్ వచ్చినా నాకిష్టమని తెచ్చిపెడ్తాడు. నాక్కావల్సిన మందులు నేను తెచ్చుకుంటున్నానా? పరేషాన్‌రావు తెచ్చిపెట్టటం లేదూ? ఇలా సాయం చేసినందుకు మీలో ఎవరికైనా డబ్బివ్వకుండా ఎగ్గొడుతున్నానా? సర్వీస్ టు మాన్ ఈజ్ సర్వీస్ టు గాడ్. నేను మాత్రం చెయ్యటం లేదూ మీకు? ఇంత తక్కువ అద్దెకు ఇళ్లు ఎవరిస్తారయ్యా! చెప్పండి. నా మాటల్లో ఏమయినా తప్పుంటే నేనంగీకరిస్తాను. నాలాంటి రీజనబుల్ మాన్ ఎవడూ లేడని పేరు తెచ్చుకుని రిటైరయ్యాను రైల్వేస్‌లో''

"ఇంతకీ ఏందంటారండీ మీరు?" అన్నాడు బులేరావు ఓపిక నశించి.

"అది సరైనమాట. ఏంలేదు బులేరావూ! రేపటినుండి మాక్కూడా బూత్‌నుండి పాలు పట్టుకురావాలి''

"నేను తేను. నేను చేరేటప్పుడు అలా ఏం చెప్పలేదు మీరు''

"అన్నీ ఏం చెప్పాలయ్యా నీకు! తెల్సుకోవాలి. నువ్వు అద్దెకు చేరటానికొచ్చినప్పుడే మన్నావు? 'రేపు చేర్తానండీ ఇంట్లో' అన్నావా? అలా అన్నవాడివి నువ్వొక్కడివే వచ్చావా ఇక్కడికి...? నీ భార్యాపిల్లల్నీ తెచ్చావా లేదా? నువ్వు 'నేను' అంటే నీ భార్యాపిల్లలూ అని కూడా అని నేనర్థం చేసుకోలా? 'నేను' అని చెప్పి, వీళ్లను కూడా ఎందుకు తీసుకువచ్చావయ్యా అనడిగానా నేను. మాట్లాడవేం?" కుతర్కం విశృంఖలంగా సాగుతోంది. వచ్చిన చిక్కేమిటంటే జోషువాగారు ఆ మాటలన్నీ పూర్తిగా తాను నమ్మి అన్నట్టుగానే అంటాడు.

"మీరేం చెప్పినా మీకు పాలు తేను'' అన్నాడు మొండిగా బులేరావు.

"సరేనబ్బాయి! మా అబ్బాయికి పెళ్లి సంబంధాలు చూస్తున్నాను. కుదిరితే ఈ నెల్లోనే పెళ్లిచేస్తాను. పెళ్లికి నా ఇల్లు చాలదు. నువ్వున్న భాగం కూడా కావాలి. నువ్వు మరోవారం రోజుల్లో ఇల్లు ఖాళీ చేసెయ్యి'' అన్నాడు జోషువాగారు నింపాదిగా ఆఖరి అస్త్రం వదులుతూ.

"నేనింట్లో జేర్తానన్నప్పుడు మీరట్టా ఏం చెప్పలేదు. నేను ఇల్లు ఖాళీ చెయ్యను. మీరేం చేసుకుంటారో చేసుకోండి'' అన్నాడు బులేరావు కోపంగా. అంతవరకూ అందరూ తన్ను గౌరవించినవారేగానీ, ఇంత అగౌరవంగా మాట్లాడినవాళ్ళెవరూ లేరు. పైగా ఇది అందరిముందూ జరగటం మరింత దుర్భరంగా వుందతనికి.

"ఏమన్నావురా బద్మాష్! నా ఇల్లు ఖాళీ చెయ్యవా? నీలాంటి వెధవల్ని నా తల వెంట్రుకలంతమందిని చూశాను. మొన్నే ఆ ఖరంగాడిని పంపేశాను. స్కౌండ్రల్! నా ఇంట్లో జేరి, నాకే ఎసరు పెడ్తావురా పందికొక్కా! జైన్... వాణ్ణి పట్టుకో. రెండు వాయిస్తే గాని బుద్ధిరాదు వాడికి'' అంటూ ఆగ్రహంతో ఊగిపోతూ బులేరావు మీదకొచ్చాడు జోషువాగారు.

ఇహ లాభంలేదని అడ్డు వెళ్లాను నేను. బులేరావు మేకపోతు గాంభీర్యంతో నిలబడ్డాడు కానీ, లోపల భయపడ్తూనే వున్నాడు ముసలాడు నిజంగా కొడ్తాడేమోనని. "అ




య్యా జోషువాగారూ! శాంతించండి, మీకు మిల్క్‌బూత్ పాలు తేవాలి. అంతేకదా! నేను తెచ్చిస్తానులెండి'' అన్నాను.

"సరే ఏడువు... పోరా ఫో! ఇప్పటికి బతికిపోయావు ఫో' అని బులేరావువంక చూసి తుపుక్కున ఉమ్మేసి మెట్లెక్కి పైకి వెళ్ళిపోయాడు జోషువాగారు.

"ఇంత ఇర్రేషనల్‌గా మాట్లాడే మనిషిని నేనెక్కడా చూడలేదు. ఆ రైల్వేలో ఉద్యోగం ఎలా తగలెట్టాడో ఏమోగానీ'' అన్నాడు సిపిఐ శర్మ, బులేరావును ఓదారుస్తూ.

"ఇదంతా మీరిచ్చిన అలుసండీ. నెత్తినె క్కించుకున్నారు. ఇంక దిగమన్నా దిగడు. మనమంతా ఓ సంఘంగా ఏర్పడాలి. అప్పుడుగాని ఈయన పొగరణగదు'' అన్నాడు బులేరావు బింకంగా.

రెండ్రోజుల్లోనే తేలిపోయింది పాలు తేవటం నావల్ల కాదని. ఆపైన మా ఆవిడ 'వెనకటికో గాడిద తనకుగాని పని చేసి చావుదెబ్బలు తిందట' అంటూ నేను చెవులు మూసుకున్నా ఆ కథ విన్పించటంతో ఓరోజు పొద్దున్నే జోషువాగారి దగ్గరికెళ్ళి, పాలు తేవటం నావల్ల కావటంలేదనీ, మా పాలవాడి చేతే మీకూ తెప్పిస్తాననటంతో ఆయన ఏ కళనున్నాడో సరే అన్నాడు.



"మన వేదాల్లో లేనిదేమీలేదు. అవి పూర్తిగా మనకు లభ్యంకాలేదు. సోమకాసురుడిలా వేదాల నెత్తుకెళ్ళిన పాశ్చాత్యులు, అవి చదివి, వాటిల్లో రాసివున్న విమానాన్నీ, దూర శ్రవణ, దూరదర్శన యంత్రాల్నీ కనుగొన్నారు. ఆటంబాంబంటే మరేం లేదు - బ్రహ్మాశిరోనామకాస్త్రమే. ఒకటేమిటి ప్రస్తుత వైజ్ఞానిక ప్రగతి అంతా వేదాల్లోనుండి సంగ్రహించిందే. దూరశ్రవణం, దూరదృష్టి, విద్యుత్తులాంటి మాటలు ఊర్కే పుట్టాయామరి! పురాతన కాలం సంగతి వదిలేయండి, రెండు మూడు వందల ఏళ్ళక్రితందాకా ప్లాస్టిక్ సర్జరీ చేసేవాళ్ళు కదండీ మనవాళ్ళు..." అని చెప్తున్నాడు రాచిప్పచెట్టి, బోరింగ్ పంపు చుట్టూ బిందెలు పట్టుకు చేరిన ఆడంగులకు. "ఆదివారం ఇల్లు కడగాలి, నీళ్ళు పట్రండి'' అని మా ఆవిడ ఆదేశించటంతో నేనూ అక్కడకు వచ్చి చేరాను.

"కాదుటండీ మరీ వేదాల్లో లేనిది ఏముంది కనకా?" అన్నాడు కూగా శాస్త్రి.

ఇలా మేం ప్రాచీన భారతదేశ ఔన్నత్య చర్చలో మునిగివుండగా మా మూలవిరాట్ ఇంటికి వెళ్ళే మెట్లముందు నిలబడి కాంగోరెడ్డీ, బులేరావు పెద్దగా అరచుకోవటం విని మా దృష్టి అటు మళ్ళింది. మా జోధలో కి వాసులు చుట్టూ మూగారు. కొంతమంది కాంగోరెడ్డికి, మరికొంతమంది బులేరావుకూ వత్తాసు పల్కుతున్నారు. ఇలాంటి గందరగోళపు సమావేశాలన్నిటికీ విధిగా అధ్యక్ష్యం వహించే జోషువాగారు సిగార్ పొగ గుప్పుగుప్పున వదుల్తూ, వంకీ కర్రమీద ఆనుకుని రెండు పార్టీల వాదనలూ వింటున్నాడు. వాగ్వివాదాంశ మిది. అసెంబ్లీ సీటుకు బై ఎలక్షన్లు వస్తున్నాయి కనుక కాంగ్రెసు పార్టీ పరమ భక్తుడైన కాంగోరెడ్డి మా లోగిలిపైన కాంగ్రెస్ జండా ఎగరేశాడు. మా లొకాలిటీలో పార్టీ తరపున విపరీతమైన ప్రచారం చేస్తున్నాడు. అయితే రాత్రికి రాత్రి కాంగ్రెసు జెండా మాయమయి, దానిస్థానే తెలుగుదేశం పార్టీ జండా వచ్చి వెలసింది. పొద్దున అది గమ

నించిన కాంగోరెడ్డి నిర్విణ్ణుడయ్యాడు. ఆపై కోపం వచ్చింది అతనికి. బులేరావే ఇంత పని చేశాడని అతనికి నమ్మిక కలిగింది.

"నువ్వే... నువ్వే చేశావు. నా జండా తీసి నీ జండా పెట్టావు. ఇంతకుముందెప్పుడూ జరగని పని నువ్వొచ్చింతర్వాతే జరిగింది'' అని అరిచాడు కాంగోరెడ్డి.

"ఇదుగో మిస్టర్ రెడ్డీ! తెలుగుదేశం జండా నేనే పెట్టానయ్యా! కానీ నీ జండా సంగతి నాకు తెలవదు. ఎవరు తీశారో ఏంవో అంటే విన్పించుకోవేంది'' అన్నాడు బులేరావు పెద్ద గొంతుతోనే.

"నువ్వు తియ్యకపోతే గాలికెగిరిపోయిందా? అయ్యా జోషువాగారూ! మీరైనా గమనించండి. హౌజిట్ ఎవ్వార్ హాపెన్డ్ ఇన్ద పాస్ట్?"

"నో. నెవ్వర్. అవునయ్యా! నువ్వెవరిన డిగి ఎగరేశావయ్యా నీ జండా?"

"తెలిసిన పెద్దలు మీరూ అనటం ఏం బాగాలేదు. ప్రజాస్వామ్యంలో ఎవరి రాజకీయ అభిప్రాయాలు వాళ్లకుంటాయి. బ్రిటీషు వాళ్లు మనకందించిన గొప్ప వారసత్వ సంపద ప్రజాస్వామ్యం. వ్యక్తిస్వాతంత్ర్యానికి ప్రాధాన్యం ఇచ్చే ప్రజాస్వామ్యంలో బతుకుతున్న మనం ఎవరికిష్టమైన పార్టీ జండా వాళ్లు ఎగరేసుకోవచ్చు. ఇందుట్లో తప్పేందంట?" అంటూ జోషువాగారి ఆయువుపట్టుమీద దెబ్బకొట్టాడు బులేరావు.

"దట్స్ ట్రు...! నువ్వు నీ జండా ఎగరేసుకోవచ్చు''

"ఆయన జండా ఎగరేసుకోటం తప్పని కాదండీ మనం మాట్లాడేది, నా జండా ఎందుకు తీశాడని. అది అడగండి'' అని మొత్తుకున్నాడు కాంగోరెడ్డి.

"అవునయ్యా! అతని జండా ఎందుకు తీసేశావు?" అడిగాడు జోషువాగారు.

"అయ్యబాబో! మీ మీదొట్టు. ఆయన జండా నేను ముట్టలేదు. అంటలేదు'' అని గోలపెట్టాడు బులేరావు.

"అంటరానిదని పీకేశావన్నమాట" అన్నాడు హరబాబు.

"సిపిఐ శర్మా, లెబా, రాచిప్పచెట్టీ రాజకీయ ప్రతిపక్షులైనా ఎప్పుడూ ఇట్టా చెయ్యలేదు. నువ్వొచ్చాకే ఇది జరిగిందంటే ఇది నీపనే సందేహంలేదు'' అన్నాడు కాంగోరెడ్డి.

"ఇన్నాళ్ళకు నీకు సరైన మొగుడు దొరికాడు'' అన్నారు రాచిప్పచెట్టి.

"ఎవడు నీ జండా తీశాడో ఆణ్ణి అడుక్కోఫో. నీ కాంగ్రెసు గూండాయిజం ఇహ చెల్లదు'' అన్నాడు లెబా.

"ఇదుగో సీనియర్ కివాసిని గూండాగీండా అంటే బావుండదు చెప్తున్నా'' అన్నాడు జోషువాగారు.

"ఆc చాలా చూశాంలెండి. మీ ఇంపీరియలిజం చెల్లేకాలం పోయింది. డౌన్ ఎట్ యువర్ ఇంపీరియలిజం, కలోనియలిజం!" అని నినదించాడు లెబా.

"షటప్, షటప్... ఆ మాటెత్తకు. నీ సోషలిస్ట్ ఇంపీరియలిజం సంగతేంది. మీకు టోటలిటేరియన్ అవుట్‌లుక్ తప్ప ప్రజాస్వామ్యమంటే అసలు గౌరవముందా అని?"

"అదేం మాటలెండి. సోషలిస్ట్ పాట్టరన్ ఆఫ్ సొసైటీని సృజించాలని నెహ్రూ కూడా కలలు కన్నాడు. ప్రజాస్వామ్యంలో నమ్మకం లేకపోతే మేం ఎన్నికల్లో ఎందుకు పాల్గొంటాం?" అనడిగాడు సిపిఐ శర్మ.

"ప్రజాస్వామ్యంలో నమ్మకముంటే నా జండా ఎందుకు తీసేశారు?" అడిగారు కాంగోరెడ్డి.

"మళ్ళీ అదేమాటా? ఈ సామ్రాజ్యవాద దురహంకారం..."

"ఇదుగో లెబా! ఆ మాటంటే బాగోదు. ఇంగ్లీషువాడు అంత చెరుపేం చెయ్యలేదులే. వాడు పాఠాలు చెప్పబట్టే మనకీ మాత్రం




జ్ఞానమైనా మిగిలింది'' అన్నారు జోషువాగారు.

"మరి లేకపోతే ఏందండీ, ఆయన జండా ఎవరో పీకితే ఈయన తీశాడంటాడూ?"

"ఓయ్ లెబా! బులేరావు నీ కులపోడని నువ్వు అతన్ని సపోర్ట్ చేయటం ఏం బాగాలేదు'' అన్నాడు హరబాబు.

"కులప్రసక్తి అనవసరం. నాక్కూడా కులాన్ని అంటగట్టటం నీ నీచత్వాన్ని బహిరంగపరుస్తుంది'' అన్నాడు లెబా కోపంగా.

"అదుగో చూశారా నన్ను నీచుడంటున్నాడు. నాది నీచకులం అంటున్నాడు. మీరందరూ చూస్తూ ఊర్కొంటారా?" వెంటనే రియాక్టయ్యాడు హరబాబు.

"ఇదుగో లెబా! కులం మాటెత్తొద్దు. చెప్తున్నా. విషయం చాలాదూరం పోద్ది'' అన్నాడు కాంగోరెడ్డి.

"ఇప్పుడు కులప్రసక్తి తెచ్చింది హరబాబు? బెదిరిస్తే భయపడతామనుకోకండి. నీకు బలముంటే, మేమేం చాతకానివాళ్ళం కాదు'' అన్నాడు బులేరావు ఛాలెంజ్ చేస్తూ.

"కుల ప్రాతిపదిక కాదులే, మిత్రపక్షులుకదా అందుకని నిన్ను సపోర్ట్ చేస్తున్నాడు లెబా'' అన్నాడు రాచిప్పచెట్టి.

"మిత్రపక్షాలయినంత మాత్రాన అన్యాయాన్ని అన్యాయమని చెప్పటానికి మేమెప్పుడూ వెనకాడం. ఉయ్ ఎక్స్‌టెండ్ అవర్ సపోర్ట్ ఆన్దా మెరిట్స్ ఆఫ్ ది ఇష్యూ'' అన్నాడు లెబా.

"అవును. సీట్లకోసం చంకలో దూర్తారు''

"తమరేమేడ్చారండీ, మీకొచ్చిన రెండుంపావు సీట్లు ఎలా వచ్చాయి?"

"మాటలు జాగ్రత్తగా రానీ లెబా! ఏడ్చటం, గీడ్చటంలాంటి అన్ పార్లమెంటరీ భాష వాడకు''

"ఛీఫో! నీతో మాట్లాడితే నాలుగు తరాలు వెనక్కెళ్ళినట్టవుతది''

"ఏం కూశావురా దేశద్రోహీ! నాలుగు తరాల క్రితం దేశం ఇంత దౌర్భాగ్యస్థితిలో లేదు, దేశాన్ని అమ్మే విదేశీమానసపుత్రుల

ప్పుడు లేరు''

"అవును. మత దురహంకారుల భజన సంఘముండేది అప్పుడు''

రాచిప్పచెట్టి రాణాప్రతాప్‌సింగ్‌లా ఒక్క దుముకు దుముకి సిపిఐ శర్మ చొక్కా మెడదగ్గర వడిసిపట్టుకున్నాడు. సిపిఐ శర్మ, లెబా ఏం తక్కువ వాళ్ళా! లెనిన్, స్టాలిన్ మావోల వారసత్వం పుణికిపుచ్చుకున్నవాళ్లు. లెబా రాచిప్పచెట్టిని ఒక్కతోపు తోశాడు. హరబాబు లెబామీదపడి రక్కాడు. బులేరావు నూతనోత్సాహంతో హరబాబు చొక్కా చించాడు. అలవాటయిన చిట్కాలు ప్రయోగిస్తూ కాంగోరెడ్డి బులేరావు జుట్టు పట్టుకులాగాడు. చూస్తూ నుంచున్న జైన్‌కీ ఆవేశమొచ్చింది. అతను దొమ్మీబరిలోకి దూకితే రాచిప్పచెట్టి అతని గడ్డం పట్టుకులాగాడు. "యా అల్లా! యా అల్లా!" అంటూ గీపెట్టాడు జైన్ రాచిప్పచెట్టిని తోస్తూ. ఏ పార్టీ ఏదో విచక్షణ నశించింది. పరేషాన్‌రావుకు కూడా ఆవేశమొచ్చింది కాని, నేనే పట్టుకు ఆపుచేశాను. కూగాశాస్త్రీ, కివాసినులూ ఏం చెయ్యాలో తోచక నిలబడి చూస్తూవున్నారు. తన సమక్షంలో ఈ క్రమశిక్షణా రాహిత్యాన్ని భరించలేని జోషువాగారికి వీరావేశమొచ్చింది.

"స్టాప్ దిస్... ఐసే స్టాప్ దిస్. యు బ్లడీ స్కాండ్రల్స్! హౌ డేర్ యు టు క్రియేట్ హెల్ ఇన్‌మై హవుజ్... గెటవుట్, గెట్‌లాస్ట్'' ఆవేశంతో రొప్పుతున్నాడు జోషువాగారు.

పశువులకాపరి అదిలించటంతో మందలో ప్రశాంతత నెలకొన్నది. కుమ్ముకుంటున్న జీవాలు విడివడ్డాయి.

"ఐసే డిస్‌పర్స్. ఐ డోంట్‌వాంట్ ఎనీ ఆప్యూరోగ్స్ రిమైన్ ఇన్ మై హవుజ్. నో స్కాండ్రల్ షల్ అన్‌ఫర్ల్ హిజ్‌బ్లడీ పార్టీస్ ఫ్లాగ్ ఆన్ మై హవుజ్..."

ఇంగ్లీషువాడి ఫిరంగి దెబ్బకు కలహించుకునే దేశీయ సామంత సైన్యాలు తిరుగుముఖం పట్టినట్టు మా 'జోధలో కివాసులు' ఎవరి భాగాలకు వాళ్లు వెళ్లిపోయారు.

"పార్టీస్... ఫ్లాగ్స్... శాడీజం, గూండా ఇజం... హవ్ కెనైటాలరేట్ సచ్ అన్‌రూలీ బిహేవియర్ ఇన్ మై హవుజ్... ఓ గాడ్!" అనుకుంటూ మెట్లెక్కసాగాడు జోషువాగారు. ఆయన పైకెక్కి పైనున్న జండా పీకిపారేశాడు.

బోరింగ్‌పంపు దగ్గరకు వెళ్తూంటే "రాండి, రాండి పోనీబాబూ!" అని పిల్చాడు లెబా.

"చూశారా, జోషువా ఏం చేశాడో? ఈ రాచిప్పచెట్టినీ నమ్మటం కష్టంగా వుంది. ఇటువైపు వుండినట్టే వుంటాడు, మళ్ళీ అటు తిరిగిపోతాడు'' అన్నాడు.

ఇంతలో సిపిఐ శర్మ లోపలికి వచ్చాడు.

"ఏవంటాడు త్రాష్టుడు?" అనడిగాడు బులేరావు.

"ఏవంటాడు- తాము సమర్థించింది తెలుగుదేశాన్ని కానీ, కమ్యూనిష్టుల్ని కాదట"

"నేను చెప్తున్నానుకదండీ, అతను మనల్ని కాదని ఎక్కడకు వెళ్తాడు'' అన్నాడు బులేరావు.

"ఎవరి సంగతీ? రాచిప్పచెట్టి విషయమా?" అడిగాను నేను.

"అవును. మతప్రాతిపదికమీద ఏర్పడ్డ రాజకీయ పార్టీలతో ఇదే పేచీ. రియాక్షనరీలు. ఓ స్థిరమైన ఆర్థిక దృక్కోణం లేని పార్టీ అది. మతమౌఢ్యాన్ని పెంచే పార్టీ అది. ఇలాంటి కమ్యూనల్ పార్టీతో పొత్తుపెట్టుకోవటం తెలుగుదేశం పార్టీ దౌర్భాగ్యం" అన్నాడు సిపిఐ శర్మ.

"జరగాల్సింది చూడకుండా, నువ్వు ప్రతి దానికీ ఇట్టా పెద్ద పెద్ద ఉపన్యాసాల్చిస్తావెందుకయ్యా? ఆ జోషువాగారితో మాట్లాడాలి జండా విషయం. పరువు పోయేట్టుంది'' అన్నాడు బులేరావు.

"పోనీబాబు సహకరిస్తే క్షణంలో అయిపోతుంది నీ పని'' అన్నారు లెబా.




# మెరిసిన ముత్యాలు

★ చాలామంది స్త్రీలు అసలు ప్రేమించరు. ఒక మగవాణ్ణి ఎన్నుకుంటారు. అతణ్ణి ప్రేమించి కాదు, అతని ప్రేమను పొందటం కోసమే.

— అల్ఫోంజో

★ అలవాటును కిటికీలో నుండి ఒక్కసారిగా విసిరివేయలేం. బుజ్జగిస్తూ మెట్లమీద నుండి మెల్లగా సాగనంపాలి.

-- మార్క్‌ట్వైన్

★ ఇచ్చి పుచ్చుకొనుట ఇలలోని మర్యాద

-గురజాడ

★ ప్రవృద్ధి పొందిన విశాల వృక్షంలాగ పోషించిన కొద్దీ సత్యం అధిక ఫలసాయాన్ని ఇస్తుంది

-మహాత్మాగాంధీ

★ బలహీనులకు, బద్ధకస్తులకు ఏమాత్రం అందరానిది ఆత్మ సాక్షాత్కారం

-ముండకోపనిషత్తు

★ నమ్రతతో కూడిన ప్రతిభావంతులు ప్రపంచానికి ఎంతో అవసరం

-ఆస్కార్ లెవెంట్

★ తనకుతాను గురువైన వ్యక్తి లోకగురువు కాగలుగుతాడు

-జిడ్డు కృష్ణమూర్తి

★ ఈనాడు నిరూపించినది ఏనాడో భావించినవే!

-విలియం బ్లేక్

★ పనే చేయకుండా జీవితాన్ని వృధా చేసుకోవడంకంటే పనులు చేస్తూ పొరపాట్లు చేయడం కూడా మంచిదే

-బెర్నార్డ్‌షా

★ మంచి ఆరోగ్యం అనుభవించాలంటే క్రోధం చెలరేగకుండా అణచుకోవాలి. ఆదుర్దా, అత్యాశ వదలుకోవాలి

-రోస్‌పాల్

★ మనకు అపకారం చేసేవాడి మార్గాన్ని మనం కూడా అనుసరించకుండా నిగ్రహంతో ఉండడమే మన ఉత్తమ ప్రతీకారం అవుతుంది

-డేనీ పోర్టర్

★ ప్రగతి నేటి క్రియాశీలత, రేపటి విశ్వాసం

-రాల్ఫ్‌వార్డో ఎమర్సన్

సేకరణ: బొమ్మన శ్రీనివాసరావు

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---

**కూపన్**

**ఆగస్టు** చతుర నవల **జోధలో** ..................

సమీక్షకుని పేరు: ..................................................

చిరునామా: ..................................................

..................................................

..................................................

..................................................

"ఆయనవల్ల ఏమవుతుందయ్యా! పద మనం వెళ్ళి మాట్లాడదాం" అన్నాడు బులేరావు. తను రోజూ చూసే బతకలేక బడి పంతుళ్ళయిన వాళ్లవల్ల ఏమీకాదని అతని దృఢవిశ్వాసం.

ఆరోజు సాయంత్రం బులేరావు నాయకత్వంలో లెబా, సిపిఐ శర్మా, రాచిప్పచెట్టి జోషువాగారింటికెళ్లటం, అక్కడేమైందోగాని ముఖాలు వేలాడేసుకుని రావటం నేను గమనిస్తూనే వున్నాను.

మర్నాడు పొద్దున్నే హరబాబును, జైన్ను వెంటబెట్టుకుని మా ఇంటికొచ్చాడు కాంగోరెడ్డి.

"పోనీబాబూ! నువ్వెలాగయినా నన్నీ అప్రతిష్ఠనుండి కాపాడాలి. ఇన్నేళ్లుగా నా జండా ఎగరేస్తూ ఓపికతో పార్టీసేవ, ప్రజాసేవ చేస్తున్నాకదా! ఇవాళ నా ఇంటిమీదే నా జండా ఎగరకపోతే పార్టీలో, ప్రజల్లో, లోగిల్లో నా పరువేం గావాలి. నిన్నగాక మొన్న వచ్చినవాడు ఆ బులేరావు నా జండా పీకి, తన జండా పెట్టుకుంటాడా? ఈ దుర్మార్గాన్ని చూసి కూడా మీరంతా సహిస్తూ ఊర్కొంటారా? ఇహ దేశంలో న్యాయమే లేదా?" అంటూ వాపోయాడు కాంగోరెడ్డి.

లంచం పట్టకుండా పనిచేయనివాడు ప్రజాసేవ గురించి మాట్లాడుతూంటే నాకు చిర్రెత్తుకొచ్చింది. "ఇదుగో కాంగోరెడ్డీ! నువ్వీ మాటలేం చెప్పొద్దు. ప్రజాసేవ, దేశసేవలాంటి పెద్దమాటలెందుకులేగానీ, నాతో అయ్యేపనే నా జోషువాలాంటి మూర్ఖుడ్ని వప్పించటం. నువ్వే వెళ్లి మాట్లాడుకో..." అన్నాను నేను.

"అరే పోనీభాయి! గట్లా చెప్పొద్దు. ఆప్‌గయే అవుర్ జోషువా నై మానే. బాత్ కర్నేకా భీ కోయీ తరీకా హెూతా హై. ఆప్‌సే బడా కోన్‌హై'' అని నన్ను ములగచెట్టెక్కించాడు జైన్.

"బాబ్బాబు! మీరే అట్లా అంటే మా గతేంకాను. పరువు పోయే పరిస్థితి వచ్చింది. మీరే నన్ను కాపాడాలి'' అని కాళ్లబేరానికొచ్చాడు కాంగోరెడ్డి. పార్టీ లక్షణాలన్నీ పుణికిపుచ్చుకున్న కాంగోరెడ్డి మంచి రాజకీయ నాయకుడయ్యే అవకాశముండగా కింది కాడర్లోనే ఎందుకుండిపోయాడో నా కర్థంకాని విషయం. 'నువ్వ'న్నవాడు మరుక్షణంలోనే 'మీర'నటానికి సందేహించడు. ఆశ పెట్టటం, బతిమిలాడటం, వీల్లేకపోతే బెదిరించటం వగైరా సామ దాన భేద దండోపాయాలన్నీ ఎరిగిన రాజనీతి చతురుడు కాంగోరెడ్డి.

"ఇదుగో కాంగోరెడ్డీ! ముందే చెప్తున్నాను. నా ప్రయత్నం నేను చేస్తాను. ఆయన ఒప్పుకుంటాడో లేదో నాకు తెలీదు. ఆ తరువాత నీ అదృష్టం" అన్నానిక తెగేదాకా లాగడం మంచిది కాదని చివరకు.

"మీరెడితే పనయిపోతుంది, మాకా నమ్మకముంది'' అన్నాడు హరబాబు.

పదిన్నరకు కాంగోరెడ్డి ఆఫీసుకెళ్లాడని నిర్ధారణయ్యాక లెబా బులేరావును వెంటబెట్టుకొచ్చాడు మా ఇంటికి. వాళ్లెందుకొచ్చారో నాకర్థమయింది. పాపం, ఇక్కడి పరిచయాన్ని నేను తన ఆఫీసులో ఉపయోగించుకుంటానేమోనన్న భయంతో, నా ప్రమేయం లేకుండా తనే ప్రయత్నం చేయదల్చుకున్నాడు బులేరావు. మరి గత్యంతరం లేక వచ్చాడు.

"పోనీ బాబూ! ఆ కాంగోరెడ్డి నిన్నెంత గోల చేశాడో చూస్తివిగదా! తాగిన కోతిలా గెంతాడు జోషువా. జండా పీకిపారేశారు. ఏందీ, దీంట్లో నీకేమన్నా సబబు కన్పిస్తోందా?" అనడిగాడు లెబా.

"సబబుమాటకొస్తే ఎవరు సబబుగా ప్రవర్తించారో చెప్పు. ముందీ బులేరావు ఆయన జండా ఎందుకు పీకాలి?" అన్నాను.

"అదుగో నువ్వు మళ్లీ అదే మాటంటావు. నేనెప్పుడు పీకాను'' అని వ్యతిరేకించాడు బులేరావు.

"బులేరావు! ఈడ మనకు దాపరికం అనవసరం. పోనీబాబు మన మనిషి. ఉన్న విషయం చెప్పకపోతే ఎట్లా? నిజమే! ఆ

జండా మేమే పీకాం" అంటున్నాడు లెబా, అంతలోనే బులేరావు ఎత్తుకున్నాడు.

"తెలుగునాడులో తెలుగుదేశం జండాలే ఎగరాలి. విదేశీ జండాలు వుంటానికి వీల్లే దు'' అని.

"నువ్వుండవయ్యా బులేరావూ! ఇంత ఆవేశమైతే ఎట్లా...? ఇంతకీ కాంగోరెడ్డి ఏవంటారు?"

"నేను చూస్తూనేవున్నా కాంగోరెడ్డీ. హరబాబు, జైన్లు మీ ఇంటికి రావటం..." అన్నాడు బులేరావు.

"అయితే ఏమంటావయ్యా? నువ్విప్పుడు రాలే, ఆయనా అలాగే వచ్చారు. వాళ్లు నా ఇంటికి రావటానికి తమరి పర్మిషన్ కావాలా?"

"దాందేముందిలే, ఎవరైనా రావచ్చు. ఇంతకీ ఏమంటాడు?" అన్నాడు లెబా సర్దుతూ.

"అసలు మీరెందుకొచ్చారో ముందు చెప్పండి. కాంగోరెడ్డి సంగతి తర్వాత మాట్లాడుకుందాం"

"నీకు తెలీని సంగతేంది! జోషువా ఈయన జండా పీకేశాడా? తెలుగు గౌరవం మంట కల్సిందని గోలపెడ్తున్నాడు. ఈ సమస్యని నువ్వే ఏదోవిధంగా పరిష్కరించాలి'' అన్నాడు లెబా.

"బులేరావు సర్వసమర్థుడు. ఆయన వెళ్లి జోషువాగారితో మాట్లాడితే సరిపోతుంది''

"అవును! నేనూ అదే అనుకున్నాను. తెలుగుదేశంలో వుంటూ తెలుగు జండా కాదంటాడా అనుకున్నా. కాని భ్రష్టుడు..." బులేరావును ఆపేశాడు లెబా.

"నువ్వుండవయ్యా... అంతా నువ్వే మాట్లాడుకునేకాడికి నేనెందుకిక్కడా...! ఇది తెలుగునాడని జోషువాదగ్గరింకెప్పుడూ అనబోకు. ఇదింకా బ్రిటిషిండియా అనే ఆయన భావన. ఏవన్నా మనం సాధించదల్చుకుంటే అది పోనీబాబువల్లే అవుద్ది. కనుక నీ ఇష్టం" అన్నాడు నిక్కచ్చిగా లెబా. బులేరావు ప్రవర్తన లెబాకు నచ్చదు. ఎప్పుడూ అతన్ని తప్పుకు తిరుగుదామనేవుంటుంది కాని, పార్టీలు మిత్రపక్షాలవటంతో చిక్కొచ్చింది అతనికి.

"పోనీబాబూ! నీకుమాత్రం తెలుగు ప్రతిష్ఠ కాపాడాలని లేదా? నీ తెలుగు తెలివి చూపి మమ్మల్ని కాపాడు'' అన్నాడు బులేరావు తగ్గిపోయి.

"మీరు చెప్పారు వినలేదు. మరి నేను చెప్తేమాత్రం వింటాడా?" అని అన్నాను.

"ఏదో పార్టీనో గిట్రా ఏర్పాటు చేసి చూడు'' అన్నాడు బులేరావు అలవాటయిన పద్ధతిలో. దాంతో నాకు మరింత మంట పుట్టింది.

"మరి బాగానే ఖర్చవుతుంది'' అన్నాను.

ఒప్పుకున్నాడు బులేరావు. నాదేంపోయింది నాలుగు షివాస్ రీగల్ బాటిల్సు పట్టుకురమ్మని చెప్పాను. పార్టీలో విషయం తేల్చేద్దామన్నాను. వాళ్లు వెళ్లిపోయారు.

నాకూ జోషువాగారికి రెండు రకాల బాదరాయణ సంబంధముంది. మేమిద్దరమూ భిన్న విధాలుగా ఆంగ్ల మానసపుత్రులమని ఆయన భావన. జోషువాగార్కి పాశ్చాత్య సంస్కృతిపట్ల అమితవ్యామోహం. ఆంగ్లేయులు భారతదేశం వదలిపోయినందుకు అమితంగా దుఃఖించిన వాళ్ళల్లో ఆయనొకరు. ఆంగ్లేయుల మతమే గొప్ప, భాషే గొప్ప. మిగతావి వాటికి సాటిరావు. నేను ఆంగ్ల సాహిత్యం చదివి, ఆంగ్లోపన్యాసకుడిగా ఉద్యోగం చెయ్యటం ఆయనకు నచ్చిన విషయం. 'మా ఆంగ్ల సాహిత్య పరిజ్ఞానం అల్పమేనండీ. పైగా బతకలేక బడిపంతులు ఉద్యోగం చేస్తున్న వాళ్ళం' అన్నా ఆయన విన్పించుకోడు. నేను తెలుగులో మాట్లాడినా ఆయనకది ఇంగ్లీషుగా విన్పిస్తుంది. భాషదేముందండీ- మనకు నచ్చినవాడి మాట కర్ణ




పేయం అని మీకూ తెల్సు. రెండో సంబంధం చుట్టరికం- చుట్టలు కాదులెండి. ఆయన సిగార్లు, నేను సిగరెట్లు తగలెడతాం కదా, ఆ బంధం. ఇది బాహ్యం. అంతరంగికంగా ఏదో అవ్యాజమైన, అనిర్వచనీయమైన బంధం వుండి వుండాలి మామధ్య.

నేను మెట్లెక్కి పైకి వెళ్లేటప్పటికి జోషువా గారు పేపరు చూస్తున్నాడు.

"సాయంత్రం బులేరావు పార్టీ ఇస్తున్నాడు. ఇక్కడే మీ డాబామీదే'' అని సూటిగా చెప్పేశాను ఉపోద్ఘాతమేమీ లేకుండా.

వింతగా చూశాడు జోషువాగారు. "ఏం పోయేకాలమొచ్చింది వాడికి?"

"మీరతని జండా పీకెయ్యటంతో అతని తెలుగు ఆత్మగౌరవం దెబ్బతింది. ఈ పార్టీతో మిమ్మల్ని సంతోషపెట్టి జండాలెగరెయ్యాలని అతని ఉద్దేశం" అన్నాను నేను.

కోపమొచ్చి మీదకు దూకబోయే పిల్లిలా నావంక గుర్రుగా చూశాడాయన.

"వాట్స్ ద బగ్గర్ థింక్స్ ఆఫ్ మీ? బ్రైబ్ మి! హు'' అని హుంకరించాడాయన.

లంచంపుచ్చుకునే వాళ్ళందరూ పత్తిత్తుల్లా ముందలాగే పోజుపెడ్తారు.

"ఇందులో ఓ ధర్మసూక్ష్మముంది జోషువా గారూ! ఎవరు జండా ఎగరేసుకున్నా మనకు పోయేదేం లేదు. కాగా బులేరావు అన్యాయార్జితం కొంత తరుగుతుంది''

"మరి కాంగోరెడ్డి సంగతేంది?"

'అమ్మ ఘుసలోడా! అటువైపునుండి కూడా లాగాలని చూస్తున్నావా? పైగా పతివ్రతలా పోజులెందుకూ' అని మనసులో అనుకుని, "అతని సంగతి తర్వాత చూద్దాం" అన్నా పైకి.

"ఆల్‌రైట్'' అన్నాడాయన.

"పార్టీకి మనమిద్దరం, బులేరావు, లెబా వస్తారు. హరబాబు, జైన్లను వాళ్ళే పిలవమన్నారు. సిపిఐశర్మ, రాచిప్ప చెట్టీ మిత్రపక్షులు కాబట్టి వాళ్ళూ వస్తారు. పరేషాన్‌రావును పిలుద్దామనుకుంటున్నాను. కూగాశాస్త్రిని పిల్చినా రాడు'' అని లెక్కచెప్పాను.

"కాంగోరెడ్డి మన టెనెంట్ బగ్గర్స్‌లో సీనియర్ కదా! అతన్ని వదిలేయటం నాకేం బావోలేదోయ్ పోనీ'' అన్నాడు ఆయన.

"మీకభ్యంతరంలేకపోతే పిలవండి. మరి అతను ఏడిచ్చస్తాడేమో'' అన్నాను.

"హు ద హెల్ ఈజ్‌హి? ఐ వాంట్ హిం అండై ఇన్వైట్ హిం. ఇట్స్ మై హెూం, మై పార్టీ. లెట్ ద బెగ్గర్ వీప్, అండ్ డ్రౌనిన్ టియర్స్. ఐ కేరెపిన్

"బట్ డోంట్ ఫర్గెట్ మిష్టర్ జోషువా! హిఈజ్ పేయింగ్ ఫరిట్. లెట్ హిం కాల్ ద ట్యూన్ యుమస్ట్ బి ఎబిట్ జనరస్'' అన్నాను.

"యా! ఆమ్ జనరస్. దట్స్‌వై ఐ అలౌ హిం టు గివ్‌ద పార్టీ''

'చేరి మూర్ఖుని మనసు రంజింపరాదని' ఆ పెద్దమనిషెవరో చెప్పాట్ట. అందుకే మరింకేం వాదించకుండా "మీ ఇష్టం" అని చెప్పి బయటపడ్డాను.

★ ★ ★

మా లోగిల్లో వుండే వాళ్ళందరూ తాగేవాళ్ళు కాదు. తాగుబోతులసలేకాదు. కూగాశాస్త్రి ముట్టడు. రాచిప్పచెట్టికి ఈమధ్యే మద్యప్రాసన జరిపారు. అదో ప్రహసనం. రెండు మూడుసార్లు పుచ్చుకున్నా ఇప్పటికీ కంపెనీ కోసం ముక్కుమూసి నోరు తెరిచి ద్రావకం పుచ్చుకుంటాడు. మిగతావాళ్ళు, నాతో కూడా కలిసి, ఎప్పుడో అకేషనల్‌గా తప్ప సామాన్యంగా పుచ్చుకోరు. బయటి సమాజపు భ్రష్టత్వం కానివ్వండి, శ్రేష్టత్వం కానివ్వండి, అది మాలోగిల్లోనూ ప్రతిఫలించటం సహజం.

సాయంత్రం ఆరు గంటలకు పార్టీ మొదలైంది జోషువాగారి డాబామీద. మా లోగిల్లో

ఏ అకేషన్లు, పార్టీలు జరిగినా అగ్రాసనాధిపత్యం విధిగా జోషువాగారిదే కాబట్టి ఆయనే దయతో అధ్యక్షత వహించనంగీకరించాడు. ఆపైన హోస్ట్ కూడా ఆయనే. అతిథులు రాసాగారు. జైన్ మాత్రమే ఇంకా రాలేదు. జోషువాగారు తలూపి అనుమతినిస్తే బులేరావు సంచీలోంచి పీటర్ స్కాట్ బాటిల్ తీసి టీపాయ్‌మీద పెట్టాడు.

"ఏందయ్యా ఈ కక్కుర్తి, దేశీ సరుకు తీసుకొచ్చావు. సరే కానీ" అని "విన్నీ!" అని పిల్చాడు కూతుర్ని జోషువాగారు.

"వాట్ డాడ్!" అంటూ లోపలినుండి వచ్చింది మిద్దెదొరసాని.

"ఈ బాటిలు లోపలపెట్టమ్మా! ఐ షల్ ట్రయిట్ టుమారో" అంటూ ఓ బాటిలు కూతురికిచ్చారు.

బులేరావు ఏడుపుముఖం వేసుకుని చూస్తూ కూర్చున్నాడు. వద్దని చెప్పలేడు. కక్కలేక మింగలేక దిగాలుపడి చూస్తున్నాడు.

లెబా విస్కీ గ్లాసుల్లో ఒంచి, సోడా కలిపాడు. "చియర్స్" చెప్పి అందరూ గ్లాసులందుకున్నాం. "లెట్ ద ఫ్లాగ్ ఆఫ్ మిష్టర్ బులేరావ్ ఫ్లై హై ఇన్ద స్కై" అని టోస్ట్ చెప్పి గ్లాసందుకున్నాడు జోషువాగారు.

రాచిప్పచెట్టి "వద్దు, వద్దు" అంటూనే గ్లాసందుకున్నాడుగాని తాగలేదు.

"ఊc కానివ్వండి" అని సాదరంగా అనుజ్ఞ ఇచ్చాడు జోషువాగారు.

సిపిఐ శర్మ రాచిప్పచెట్టి ముక్కు మూసి నోరు తెరిచాడు. జైన్ అతని చేతులు పట్టుకున్నాడు. లెబా అతని గొంతులో ఓ హాఫ్ పెగ్ ద్రావకం పోశాడు. ఇలా ఇనీషియేషన్ కార్యక్రమమైపోయింది. కొంచెం గొంతులోకి దిగితే ఆయనా దోవకి వస్తాడు. 'వ్రతం చెడ్డా ఫలం దక్కాలన్న' ఉద్దేశం ఆయనది. ఇహ ఆ తర్వాత అతనందర్నీ మించిపోతాడు. ప్రతిసారీ ఇలా జరగటం సంప్రదాయం. సంప్రదాయబద్ధుడైన రాచిప్పచెట్టి ఇందులో లోటు రానీయడు.

ఒక రౌండయింది. దూరంగా కాంగోరెడ్డి లోగిల్లోకి రావటం పైనుండి చూశాడు జోషువాగారు. "మిస్టర్ కాంగోరెడ్డీ! కం హియర్, కమప్!" అని పిల్చాడాయన. బులేరావు ముఖం మాడిపోయింది. లెబావంక చూశాడు. ఏం చెయ్యలేని పరిస్థితి.

మెట్లెక్కివచ్చిన కాంగోరెడ్డికి పరిస్థితి అర్థమైంది. ఏడుపుమొహం పడిపోయింది. నా వంక కోపంగా చూశాడు.

"దానివల్లేం ప్రయోజనం లేదు రెడ్డీ! నువ్వూ సంధిప్రయత్నాలు చెయ్యాలి" అన్నాను నేను.

'ఓరి దుర్మార్గుడా! తాగేది నా విస్కీ, పాడేది వాడి పాటా?' అన్నట్లు చూశాడు బులేరావు నావంక.

"అవునోయ్ కాంగోరెడ్డీ! నువ్వూ మూడు బాటిల్స్ తెప్పించు. సీనియర్ కి వాసివి కాబట్టి నీకు కన్సెషన్. నీ జండానూ పైకెగురుతుంది" అన్నాడు జోషువాగారు.

"అయ్యబాబోయ్! నాదగ్గర పైసల్లేవండీ" అని గొల్లుమన్నాడు కాంగోరెడ్డి.

"పైసలెందుకోయ్! అందరూ రెడీ క్యాష్ తోనే బతుకుతున్నారా? హరబాబు! నువ్వెళ్ళి కూగాశాస్త్రిని తోలుకురా" అన్నాడు జోషువాగారు.

విస్కీ వాళ్ల పాలబెట్టయినా ప్రిస్టేజీ కాపాడుకోవాలని కాంగోరెడ్డికర్థమైంది.

పైకొస్తూనే, "రామరామ! కలికాలం దాపురించింది. ఈ తాగుడేవిcటి, ఈ సంబారాలేవిcటి? ఇవన్నీ చూస్తూ నేనెందుకు బతికున్నానా అనిపిస్తోంది" అన్నాడు కూగాశాస్త్రి మా భ్రష్ట సమాజాన్ని చూసి నోటిమీద కొట్టుకుంటూ.

"వడ్డీకోసం లేవయ్యా బతుకుతున్నది. లేకపోతే నీకుమాత్రం ప్రాణాలమీద ఆశాయేం" అన్నాడు సిపిఐ శర్మ.






"తాగుతున్నాడు, నువ్వతని మాటలు పట్టించుకోకు. మన కాంగోరెడ్డికి గొంతుమీద కత్తెరొచ్చింది. ఆరొందలు అప్పివ్వియ్యి. భయపడకు తీర్చేస్తాడులే" అన్నాడు జోషువాగారు. ఆయనమాత్రం డబ్బెవరికీ అప్పివ్వడు. అప్పిస్తే డబ్బుతోపాటు మిత్రుణ్ణి కూడా కోల్పోయే ప్రమాదముందన్న బుధవాక్యం సతతం గుర్తుంచుకుంటాడాయన.

కూగాశాస్త్రి రొంటినుండి పచ్చనోట్ల మడతలు తీసి, ఒకటికి పదిసార్లు లెక్కించి, ఆరొందలు కాంగోరెడ్డి చేతిలో పెట్టాడు. పని కుర్రవాడు రమ్మూని పిల్చి, చీటీ రాసిచ్చి, మూడు విస్కీ బాటిల్స్ తెమ్మని ఆర్డరేశాడు జోషువాగారు. బులేరావుకు ఇప్పుడు భలే ఆనందంగా ఉంది.

"వస్తా..." అని బయలుదేరాడు కూగాశాస్త్రి మెట్లవైపు.

"అవునూ, ఇవాళ తిథి మంచిదేనా? వాళ్లు జండాలెగరేసుకోవాలి" అని అడిగాడు జోషువాగారు.

"దశమి రాత్రి పదిన్నరదాకా వుంది. రేపు ఏకాదశి. రెండు రోజులూ దివ్యంగా వున్నాయి" అన్నాడు కూగాశాస్త్రి మెట్లు దిగుతూ.

కాంగోరెడ్డిక్కూడా ఓ గ్లాసిచ్చాం. మరో అరగంటకు తీరిగ్గా దిగాడు జైన్.

"ఏం జైన్‌భాయ్! ఆలస్యమైంది" అని పలకరించాను.

"ఏం జెయ్యి బాద్‌షా! పఢాయీ లేట్, ధంధా లేట్ షురూకియా, నికాబీ లేట్, పిల్లల్కీ భీ లేట్. ఖుదాకరేఁ మర్‌భీ జావూఁ లేట్‌తో ఠీక్‌హై" అన్నాడు జైన్ కుర్చీలో వాల్తూ.

అందరూ నవ్వారు.

"నౌ షేక్ హాండ్స్... యు విల్ హియరాఫ్టర్ బి ఫ్రండ్స్" అని బెనడిక్షన్ చదివాడు జోషువాగారు బులేరావును, కాంగోరెడ్డినీ లేపి. ఇద్దరూ మొహాలకు నవ్వు పులుముకుని చేతులు కలుపుకున్నారు.

"మీరిద్దరూ నా డాబామీదే కుడివైపునొకళ్లూ, ఎడంవైపునొకళ్లూ జండా ఎగరేసుకోవ

చ్చు. నౌ ఐ ఫార్మల్లీ అనౌన్స్ మై కన్సెంట్'' అన్నాడు జోషువాగారు.

"నేను లెఫ్టిస్టుని. ఎడంవైపు నా జండానే వుండాలి'' అనరిచాడు బులేరావు.

నౌకరు రమ్మూ మూడు విస్కీ బాటిల్స్ పట్టుకొచ్చాడు. అందుట్లో ఒకటి ఆచారం ప్రకారం జోషువాగారి కబోర్డ్‌లోకి పోయింది. మూడో రౌండు పూర్తవుతున్నప్పుడు అందరూ మూడ్లోపడ్డారు.

"మరి నేనెళ్తా, దేర్ హెూగయీ. బీబీ గుస్సా కరేగీ'' అన్నాడు జైన్ లేస్తూ.

"అరె భైర్! జోరూకా గులాం... నా మర్ద్ కహీంకా'' అన్నాడు రాచిప్పచెట్టి నిషాలో. ఇద్దరికీ పడదు. మరెవరైనా అయితే నవ్వి, తేలిగ్గా తీసుకునేవాడు జైన్. పాతవాసనలు తాగినప్పుడు గుబాళిస్తాయి. జైన్‌కి కోపం వచ్చింది.

"ఎవరుబే జోరూకా గులాం? తూహై జోరూకా గులాం, నీ అయ్య జోరూకా గులాం, నీ అమ్మ జోరూకా గులాం. నీ అక్కా జోరూకా గులాం. నీ బిడ్డల్భీ జోరూకా గులాం"

"అరె నోర్ముయ్యి! ఆడవాళ్ల మాటెత్తద్దు'' అని లేచాడు విస్కీబాటిల్ చేత ధరించి చెట్టి.

"నువ్వే నోర్మూసుకోవయ్యా! తప్పుడు కూతలు కూసింది నువ్వు'' అన్నాడు శర్మ.

"మధ్య నువ్వు భుజాలు తడుముకుంటున్నావెందుకయ్యా!" అన్నాడు పరేషాన్‌రావు. సిపిఐ బయట పులి, ఇంట్లో పిల్లి అని లోగిల్లో వాళ్లందరికీ తెల్సు.

"అసలు హెన్‌పెక్డ్ కాని వాడెవడయ్యా! వాడసలు మగాడేనా అంట! ఐ బ్లెస్ యు ఆల్ షై టెనెంట్స్ టుబి హెన్‌పెక్డ్. ఏవంటావయ్యా షిపిఐ షర్మా..." అన్నాడు జోషువాగారు మత్తులో తూగుతూ.

"అయ్యా! అయ్యా! అంతే కదండీ మరీ'' అన్నాడు శర్మ, మరేమనలేక.

ఇలా కొనసాగింది మా పార్టీ రాత్రి పన్నెండు గంటలవరకూ. మధ్య వాగ్వివాదాలూ, కీచులాటలూ నడిచాయిగాని సమసిపోయాయి. మా జోధలో ఓ మినీ భారతదేశం. దేశంలోని భిన్నత్వం, అరాచకత్వం, సంకుల సమరం ఇక్కడా మూర్తీభవించి వున్నాయి.



జోషువాగారు ప్రతినెలా ఒకటో తారీఖున ఇంటి అద్దె వసూలు చేసుకోటం తప్ప మిగతా విషయాలు పట్టించుకోడు. ఇంటి పన్ను కట్టడం, సబ్‌మీటర్ల ప్రకారం కరెంటు ఛార్జీలు వసూలుచేయటం, నీళ్ళ బిల్లు సరిసమానంగా అందరికీ పంచి డబ్బు వసూలుచేయటం తప్ప మరింకే సంగతీ చూడడు. మా ఇంటి వెనుక బేస్‌మెంటుకు పక్కగా ఇరుపక్కలా రెండురెండు బాత్‌రూంలు, ఒకొక్క లావెటరీ అలాగే ఉత్తరాన, దక్షిణాన ఓ బాత్‌రూం, ఓ లావెటరీ వున్నాయి. పదకొండు భాగాల కిరాయివాసులకు ఇవి సరిపోక ఇబ్బందిగా వుంది. వీటి సంఖ్య పెంచమని ఎన్నిసార్లు జోషువా నడిగినా ప్రయోజనం లేకుండా పోయింది. ఆయనకు మేడ మీద అటాచ్డ్ బాత్‌రూం, టాయిలెట్లుండటంవల్ల ఆయనకేం ఇబ్బంది లేదు. మునిసిపల్ ట్యాపుకాక, అన్ని భాగాలకూ కలిపి రెండు బోరింగ్ పంపులు వేయించాడు జోషువాగారు. గండిపేట నల్లాపోతే, కిరాయివాసులకు ఆధారం బోరింగ్ నీళ్లే. నీళ్ళకూ ఇబ్బంది





పడ్తున్నారు కిరాయివాసులు. ఇక ఏ రిపేరు వచ్చినా ఆయన పట్టించుకోడు. ఇంటికి వెల్ల వేయించటమనేది జరగని పని. డ్రైనేజీ చెడి పోతే, కిరాయివాసులే బాగుచేయించుకోవాలి. వాళ్ళే సున్నం కొట్టించుకోవాలి.

బులేరావు వచ్చింతర్వాత కిరాయి వాసుల్లో చైతన్యం మొదలయింది. అంతకు ముందు సిపిఐ శర్మ సంఘంగా ఏర్పడదామని ప్రయత్నం చేశాడు కాని, ఎవరూ మద్దతు ఇవ్వలేదు. ఓరోజు ఇద్దరూ ఇంటింటికీ తిరిగి కివాసుల సమస్యల గూర్చి చర్చించటానికీ, పరిష్కారాలు వెతకటానికీ రాబోయే ఆదివారం సాయంత్రం ఐదుగంటలకు జరగబోయే కివాసుల సమావేశానికి అందరూ తప్పక హాజరు కావాల్సిందని మరీమరీ చెప్పారు.

ఆదివారం రానేవచ్చింది. 'జోధలో' గేటు కెదురుగా వున్న ఖాళీస్థలంలో జంపకానాలు పరిచి, ఓ టేబిల్, రెండు కుర్చీలు తెచ్చివేసి సభనేర్పాటుచేశాడు సిపిఐ శర్మ. కిరాయివాసుల కడగండ్లను వివరిస్తూ ప్రారంభోపన్యాసంచేసి చివరగా, "మన హక్కుల సాధనకై మనం ఏకం కావాలి. మనం ఒక సంఘంగా ఏర్పడాలి. కార్యవర్గాన్ని ఎన్నుకోవాలి. ఈ సమావేశానికి కివాసుల్లో సీనియరూ, కురువృద్ధుడూ అయిన శ్రీ కాంగోరెడ్డిగార్ని అధ్యక్షత వహించి కార్యక్రమాన్ని నడపవల్సిందిగా కోర్తున్నాను. వారు వేదికపైకి రావల్సింది'' అన్నాడు సిపిఐ శర్మ.

జనమంతా చప్పట్లు కొట్టారు. కాంగోరెడ్డి రెండో కుర్చీనలంకరించి కార్యనిర్వహణకు పూనుకున్నాడు. "సిపిఐ శర్మగారు మనకున్న సమస్యల్ని గూర్చి విపులంగా చర్చించారు. ఇంకా ఎవరైనా మాట్లాడతల్చుకుంటే మాట్లాడవల్సింది'' అని కూర్చున్నాడు కాంగోరెడ్డి.

సమావేశం ప్రారంభమైనప్పటినుండి బులేరావు పరేషాన్‌రావుకి ఏదో ఎక్కేస్తున్నాడు. కాంగోరెడ్డి సభ్యుల ఉద్దేశాలు వెల్లడించమనగానే అతన్ని ముందుకుతోసి, "వెళ్లవయ్యా, మాట్లాడు'' అన్నాడు.

పరేషాన్‌రావు వేదికవద్దకు వచ్చాడు. క్రికెట్‌లో మంచి స్ట్రోక్ ప్లేయర్ ఆయన. బాట్స్‌మన్ ఫీల్డ్ ప్లేస్‌మెంట్లను ఒక్కసారి తల నటూఇటూ తిప్పి చూసుకున్నట్టు, సభనొకసారి పరికించి మాట్లాడటం ప్రారంభించాడు పరేషాన్‌రావు. "ఈ జోధలోలో ఎవడికీ కనీస స్వాతంత్ర్యంలేదు. ఇండియాకు స్వాతంత్ర్యం వచ్చిందికాని మనమింకా ఈ నల్లదొర కర్కశ పదఘట్టనలకింద నలిగిపోతూనే వున్నాం. వర్స్ట్ ఆఫాల్- ఇక్కడ ప్రజాస్వామ్యమే నశించింది. అన్యాయాన్నీ, నియంతృత్వాన్నీ ఎదుర్కొనాల్సింది పోయి, మనమంతా మూగ మొద్దుల్లా బతుకుతున్నాం...'' అని ముఖానపట్టిన చెమటను కర్చీఫ్‌తో తుడుచుకున్నాడు పరేషాన్‌రావు. ఏకబిగిన ఇన్ని మాటలు మాట్లాడటం అతనికి ఇదే ప్రథమం.

"నువ్వే మూగ మొద్దువి'' అని సభలో నుండి ఎవరో అరిచారు.

ఎలాంటి విమర్శను పట్టించుకోని అనుభవజ్ఞుడైన రాజకీయ నాయకుడిలా మళ్లీ మొదలెట్టాడతను.

"అద్దె బకాయి పడ్డే మాత్రం, ఖరాన్ని అలా ఉన్నపళాన ఇల్లు ఖాళీ చేయించటంకంటే ఘోరమేముంది? అవమానం పాలైన ఈ ఊరిలో బతకలేక శ్రీకాకుళం పారిపోయాడాయన"

"ఏం కాదు... మన బాకీలన్నీ ఎగగొట్టి అదే సాకుగా శ్రీకాకుళం పారిపోయాడు'' అన్నాడు చెట్టి.

"బులేరావులాంటి కొత్త కివాసిని, పెద్ద మనిషిని పట్టుకుని మిల్కుబూతునుండి పాలు తెమ్మని హుకుం చేయటం మహా దుర్మార్గం, నియంతృత్వం. ఇక్కడ మన రాజకీయాదర్శాలకు అనుగుణంగా బతకలేకపోతున్నాం. చివరకు పార్టీ జండాలు ఎగరేసు

కోవాలన్నా లంచమిచ్చి- ఆమధ్య జరిగిన పార్టీ అదేకదా ఎగరేసుకోవాల్సి వచ్చింది. ఈ నియంతృత్వ ధోరణి నశించాలి. డౌన్ విత్‌ద టిరనీ ఆఫ్ జోషువా! డౌన్ విత్ హిజ్ ఇంపీరియలిస్ట్ ఆటిట్యూడ్''

బులేరావు ముందు చప్పట్లు చరచటం ప్రారంభించాడు. ఆలస్యంగా మేలుకున్న మిగతావారు అతన్ని అనుసరించారు. రామ చిలుక గ్లాసెడు నీళ్లు తెచ్చిచ్చింది పరేషాన్‌రావుకు. తాగి మళ్లీ కొనసాగించాడతను తన ఉపన్యాసం. "ఈ జోధలో కివాసుల్ని నిర్లక్ష్య మనే రుగ్మత పట్టి పీడిస్తోంది. ఈ క్రానిక్ డిసీజ్‌కి స్ట్రాంగ్ ఆంటీ బయొటిక్స్ వాడాలి. మనం సంఘటితమవటమే ఆ ఆంటీడోట్. అందరం కలసికట్టుగా వుండి ఆశయ సాధనకు కృషి చేయాలి'' అన్న ఉపన్యాసం ముగించి రొప్పుతూ వెళ్లి కూర్చున్నాడు పరేషాన్‌రావు. సభ్యులు మళ్లీ చప్పట్లు చరిచి అభినందించారతన్ని.

"అంకుల్... కంగ్రాట్స్... చాలా బాగా మాట్లాడారు. ఓ సిగరెట్టు ముట్టించండి ఈ సందర్భంలో..." అని అతని జేబులోనుండే సిగరెట్టు పెట్టే, అగ్గిపెట్టే తీసి, ఓ సిగరెట్టు అతని పెదవులకందించి, అగ్గిపుల్లతో వెలిగించాడు అక్షనాథ్.

ఒక్క దమ్ములాగి, "ఇప్పుడేం చూశావోయ్ అక్షనాథ్, నేను కాలేజీలో చదువుకునే రోజుల్లో, భోపాల్లో..." అని ఏదో చెప్పబోతున్నాడు పరేషాన్‌రావు.

"అంకుల్ ప్లీజ్! కాసేపు టేప్‌రికార్డరు ఆపు చేయండి'' అని అంది, తరువాత ఎవరు ఏం మాట్లాడుతారో అని ఉత్సుకతతో వున్నరోజీ.

"పరేషాన్‌రావుగారి ఉపన్యాసం ఎంతో ఎనలైటినింగ్‌గావుంది. అయితే ఒక్క విషయం గమనించాలి. మన సభ్యుల్లోనే ఒకళ్ల స్వాతంత్ర్యం ఇంకోళ్లు హరించ ప్రయత్నించే నియంతృత్వ ధోరణులున్నాయి. యాజమాన్యాన్ని సాధించడం ఒక ఎత్తూ, ఇలాంటి ధోరణులను అరికట్టటం మరో ఎత్తూ. మనలోనే మనం కీచులాడుకుని ఏంసాధించగలం! ఈ విషయం మీరు గమనించాలి'' అన్నాడు రెడ్డి అధ్యక్షపీఠంనుండి.

"కాంగోరెడ్డిగారు సభ్యుల శీలాన్ని శంకిస్తున్నారు. ఇలాంటి వ్యక్తి సభకు అధ్యక్షుడుగా వుండతగడు. కాంగోరెడ్డిగారు అధ్యక్ష పీఠాన్నుండి దిగాలి'' అని అరిచాడు బులేరావు, తను కూర్చున్న చోటినుండే.

"బులేరావీజ్ కాస్టింగ్ ఆస్పర్షన్స్ అన్‌ఫైర్. వుయ్‌కెనాట్ టాలరేట్ దిస్'' అని తనూ కూర్చునుండే గొంతు పెద్దదిచేసి అరిచాడు హరబాబు. అప్పుడర్థమైంది నాకు బులేరావు, కాంగోరెడ్డి సభకు సిద్ధమై తమ వాళ్లకు నేర్పాల్సిన మాటలు నేర్పివచ్చారని.

లెబా వేదిక వద్దకు వచ్చి, కళ్లజోడు సవరించుకుని ఉపన్యాసం మొదలెట్టాడు, "బులేరావుగారు మాట్లాడిందాంట్లో అసత్యమేమీలేదు. అద్దె ఇచ్చి వుంటున్నామిక్కడ. యాజమాన్యపు దౌర్జన్యానికీ, నియంతృత్వ విధానాలకు బలి అవుతున్న వాళ్లం మనం. మనది దళిత, పీడిత వర్గం. వర్గ శత్రువును సాధించాల్సింది పోయి, మనలో ఒకళ్లమీద ఒకళ్లు నిందలు వేసుకోటం తగదు. బ్రిటీషువాడు డివైడ్ అండ్ రూల్ పాలసీతో మనలో మనకు చీలికలు తెచ్చి భారతదేశాన్ని ఏలాడు. మనలో మనకు ఐక్యత లేకపోతే మన వర్గ శత్రువు విజయం సాధిస్తాడు. మనం వర్గ స్పృహతో పోరాటాన్ని కొనసాగించాలి. మనకు పోయేదేం లేదు, సంకెళ్లు తప్ప. కనుక కాంగోరెడ్డిగారు సభ్యులపై ఆస్పర్షన్స్ కాస్ట్ చేయకుండా సభ నడపాలని కోరుతున్నాను'' అని వెళ్లి కూర్చున్నాడు.

రాచిప్పచెట్టి లేచాడు, "లెబాగారు వర్గ శత్రువు, వర్గపోరాటం లాంటి పదాలు అనవసరంగా ప్రయోగించారు. ఆం విదేశీపాలనను, అంటే జోషువాగారి బ్రిటీషు పాలనా విధానాలను మనం అంతమొందించాలి. ప్రాచీన కాలంనుండి మనమెట్లా అసంఘటి




తంగా వున్నామో, దాన్ని విదేశీయులు ఎలా అలుసుగా తీసుకున్నారో చరిత్ర చదువుకున్న వారందరికీ తెలుస్తుంది. పైగా మనలో బ్లాక్ గార్డ్స్ లేదన్నది కూడా సబబుకాదు. అంభి పురుషోత్తముడికి సాయం చేయకపోగా, గ్రీకు రాజైన అలెగ్జాండరుతో చేతులు కలపటం, ఫలితంగా భారతదేశం విదేశహస్తగతమ వటం మనం చరిత్రలో చదువుకున్నదే. కనుక ఈ దేశవాసులైన హిందువులు ఏక త్రితం కావాలి. విదేశీ పాలనను అంత మొందించాలి'' అన్నాడతను.

దీంతో జైన్‌కి ఆవేశమొచ్చింది. ఆయన ఉర్దూ ప్రసంగానికి తెలుగు అనువాదమిది. "ఇప్పుడు రాచిప్పచెట్టిగారు చెప్పిన మాటల వల్ల వెల్లడి అయ్యేదేమంటే మేము ము స్లింలం, క్రైస్తవులం హిందూస్థానీయులు కా దూ అని. అది తప్పు. మహా అసత్యం. మేం సహించలేం ఇది. హిందువులకు ఇక్కడ నివశించే హక్కు ఎంత వుందో, మాకూ అంతే వుంది. ఇక్కడి సంస్కృతి-మిక్స్‌డ్ కల్చర్. అది ఎవడబ్బసొమ్మూకాదు. మీకు తెలీదా? మొగలాయీ చక్రవర్తులకాలంలో ప్రజలు ఎంత సుఖశాంతులతో జీవితం గడి పారో. అక్బర్‌లాంటి మహానుభావుడు మరేడీ భారతదేశ చరిత్రలో. మన హైదరాబాద్‌లోనే కులీకుతుబ్‌షాలాంటి రాజు మరెవడు వున్నా డు. ఆయన మహాపండితుడు. ఒక్కభాషలో కాదు. అరబ్బీ, ఫారసీ- ఇంకా తెలుగులో కూడా మహాకవి. ఇక్బాల్ ఏమన్నాడు, సారే జహాసే అచ్ఛా హిందూస్తాం హమారా, హం బుల్‌బులేహైం ఇస్కీ, యే గుల్‌సితాం హమారా..." అని కూర్చున్నాడు జైన్. పిల్ల లందరూ తాలీ బజాయించి ఆయన్ను అభి నందించారు.

"జైన్‌గారు చెప్పింది సత్యం. మనది సెక్యులర్‌స్టేట్. మనం మతం, కులం పేరున ముక్కలు కారాదు. మనం అందరం ఈ భారతమాత సంతానమని గుర్తుంచుకుని మరీ మాటాడవల్సిందిగా నా మనవి'' అని విన్నపం చేశాడు కాంగోరెడ్డి.

అయితే రాచిప్పచెట్టికి ఇది నచ్చలేదు "మీరందరూ సూడో సెక్యులరిస్ట్‌లు. ఈ పాలసీ ఆఫ్ అప్పీజ్‌మెంట్..." అని ఇంకా ఏదో ఉద్రేకంగా చెప్పబోయాడు కాని ఇద్దరు, ముగ్గురు సభ్యులు అతన్ని బలవంతంగా కూర్చోబెట్టటంతో మరేం చేయలేకపోయాడు రాచిప్పచెట్టి.

ఇదంతా చూస్తున్న సిపిఐశర్మకు వ్యవ హారం గాడి తప్పుతున్నట్టనిపించింది. తను ఏ ఉద్దేశంతో సభ ఏర్పాటు చేశాడో దానికి భంగం వాటిల్లేటట్లు కన్పించింది అతనికి. "సభ్యులు నన్ను క్షమించాలి. మనం యాజ మాన్య నిరంకుశత్వానికి వ్యతిరేకంగా జమ య్యాము. మనం సంఘటితమవాలి. కీచులా డుకోవటం తగదు. మన సంఘానికి జోధలో కిరాయి వాసుల సంఘం (జోధలోకివా సం)గా పేరు పెట్టుకుందాం. మనం కార్య వర్గాన్ని ఎన్నుకుని, మన సమస్యలను ఐడెంటిఫై చేసేందుకై ఓ కమిటీని నియ మించాలని నా ప్రార్థన. కనుక ముందుగా అధ్యక్ష, కార్యదర్శి పదవులకు నామినేషన్లు కోరవల్సిందిగా కాంగోరెడ్డిగారిని అభ్యర్థిస్తు న్నాను'' అన్నాడతను.

కాంగోరెడ్డి అధ్యక్ష స్థానానికి నామినేషన్ల ను పిలవటంతో పరేషాన్‌రావు జైన్ పేరు ప్రతిపాదించాడు. సిపిఐశర్మ దాన్ని సెకండ్ చేశాడు.

"సిపిఐ శర్మగారు అధ్యక్షులుగా వుండా లని నా అభిమతం" అన్నాడు కూగాశాస్త్రి, కులాభిమానాన్ని ముక్కు పొడుంతో పాటు దట్టించి, నేను దానికి మద్దతు పల్కాను.

"అరె హరబాబూ! మీ కాంగోరెడ్డి అధ్యక్షు డిగా వుండటం నీకిష్టంలేదా?" అనడిగాడు బులేరావు.

"ఎందుకిష్టంలేదు'' అని లేచి, "ఐ ప్రొ పోజ్ మిష్టర్ కాంగోరెడ్డి'' అన్నాడు.

"ఐ సెకండ్ హిం" అన్నాడు బులేరావు.

ఇందులో బులేరావు రాజకీయం వుంది. తను కార్యదర్శి కావాలనుకుంటున్నాడు. కాంగోరెడ్డి సీనియర్ కివాసి, పైగా పదవీ కాంక్షవున్న మనిషి. అతనూ కార్యదర్శి పదవికి పోటీ చేస్తే అది తనకు దక్కటం సందేహం. అందుకే అతనికి అధ్యక్ష పదవి ముందుగా ఇప్పించి ఆ పీడా వదిలించుకోవాలనుకున్నాడతను.

ఇంకే నామినేషన్లూ రాకపోవటంతో, జైన్, కాంగోరెడ్డి నామినేషన్ ఉపసంహరించుకోటంతో సిపిఐశర్మ అధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నికయారు. దీంతో బులేరావుకు దిగులుపట్టుకుంది. వాడమ్మ కడుపుడక... వాడెక్కడ దాపురించాడు నాకు. కార్యదర్శి పదవికొట్టేసేట్టున్నాడీ కాంగోరెడ్డి...అనుకున్నట్టుగా పళ్లు కొరుక్కున్నాడతను. సభ్యులందరూ చప్పట్లు చరిచి సిపిఐ శర్మను అభినందించారు. కాంగోరెడ్డి కొత్త అధ్యక్షుడిని వచ్చి మిగతా కార్యక్రమాల్ని నిర్వహించమని కోరాడు కాని, సిపిఐశర్మ అతన్నే కొనసాగించమనటంతో మిగతా కార్యక్రమం కూడా కాంగోరెడ్డి అధ్యక్ష్యంలోనే నడిచింది.

కార్యదర్శి పదవికి నామినేషన్లు కోరినప్పుడు పరేషాన్‌రావు బులేరావును ప్రతిపాదిస్తే లెబా తన మద్దతు పల్కాడు. తమాషా ఏమిటో చూద్దామని నేను లెబా పేరు ప్రతిపాదించాను. దానికి సిపిఐశర్మ మద్దతు పల్కాడు. జైన్ కాంగోరెడ్డి పేరు సూచిస్తే రాచిప్పచెట్టి సెకండ్ చేశాడు.

మా ఆవిడ, "నేను రాచిప్పచెట్టిగారిని ప్రతిపాదిస్తున్నాను'' అన్నది. అక్కడితో గొడవ మొదలైంది. మా 'జోధలో కివాసం' చరిత్రలో ప్రధమ అపశ్రుతి అది.

"ఒక కుటుంబంను ఒక యూనిట్‌గా తీసుకోవాలి. కుటుంబ యజమాని అనగా భర్తకు సంఘ సభ్యత్వం వుంటుంది, భార్యకుండదు. భర్తలు లేని కిరాయివాసులకు అంటే అండమ్మగారి లాంటివాళ్లకు సంఘ సభ్యత్వముంటుంది. కనుక భర్తలున్న భార్యలు సభ్యులుకారు. పదకొండు కిరాయి భాగాలకు పదకొండు సభ్యులతో కూడిన సంఘం మనది. సభ్యత్వంలేని స్త్రీలు ప్రతిపాదించరాదు'' అన్నాడు బులేరావు.

"ఎ వెరీగుడ్ క్రికెట్‌టీం'జోధలో కివాసం' ఎలవెన్ వర్సెస్ జోషువా'' అనరిచాడు అక్షనాధ్.

ఆ పిల్లవాడి వ్యాఖ్యానాన్ని ఎవరూ పట్టించుకోలేదు.

"స్త్రీలను సెకండ్‌క్లాస్ సిటిజెన్స్‌గా చూడటం అన్యాయం" అంది ఆన్నీ.

"ఈ పురుషాధిపత్యం మనం సహించరాదు. పురుషులు మనవర్గ శత్రువులు. మనం వేరే సంఘం ఏర్పాటు చేసుకుందాం" అంది ఓల్గా.

"పోనీ ఏంబోయింది. వాళ్లనీ సభ్యుల్ని చేద్దాం" అన్నాడు సతీవ్రతుడు శర్మ.

"వీల్లేదు... మూడు కొప్పులు కలిస్తేనే రణరంగమవుతుందని సామెత. స్త్రీల రాకతో సంఘం ముక్కలవుతుంది'' అన్నాడు పరేషాన్‌రావు భార్యకు తెలుగు బాగా అర్థం కాదన్న ధీమాతో.

"నేనూ ఒప్పుకోను స్త్రీలకు సభ్యత్వం ఇవ్వటానికి'' అన్నాడు కూగాశాస్త్రి.

"పదండే మనం వేరే సంఘం పెట్టుకుందాం. ఈ మొగగాడిదలు రానిచ్చేదేమిటి మనల్ని. మనమింక ఈ మగదురహంకారాన్ని భరించలేం" అంది ఓల్గా.

"ఏవమ్మోవ్! కారు కూతలు కూయక, నోరుమూసుకో. మొగవాళ్లు గాడిదలా'' అన్నాడు బులేరావు.

"ఏమండీ! అలా బెల్లంకొట్టిన రాయిలా కూర్చున్నారేమండీ! చూడండి ఈయనేమంటున్నాడో, నేను నోరు మూసుకోవాలట, నావి కారుకూతలట" అంది పెద్దగా అరుస్తూ భర్తనుద్దేశించి ఓల్గా.




"మిస్టర్ బులేరావు! కాస్త నోరు సంబాళించుకు మాట్లాడవయ్యా! భద్రమహిళలతో అలానేనా మాట్లాడేది?" అన్నాడు సిపిఐ శర్మ.

"పోవయ్యా! మీరంతా జోరూకా గులాంలు కాబట్టే పెళ్ళాల్నిలా సభలో వాగనిస్తున్నారు'' అన్నారు బులేరావు.

దాంతో జైన్‌కి ఆవేశమొచ్చింది. అతనెళ్లి బులేరావు కాలరు పట్టుకున్నాడు. ఇద్దరూ ఆవేశంగా అరుచుకున్నారు. కొట్టుకుంటారేమోనని లెబా, కాంగోరెడ్డి విడిపించారు.

కాంగోరెడ్డి కూతురు రోజీ, "మాకూ సభ్యత్వం కావాలి, ఏవే చిలుకా'' అంది.

"అవును. సంఘంలో మనమూ చేర్దాం" అంది రామచిలుక.

"చేరండి, చేరండి. సంఘం పచ్చపచ్చగా వుంటుంది'' అన్నాడు హరబాబు.

"పచ్చకామెర్లు వచ్చినయ్యా నీకు! ఏమిటయ్యా పచ్చగా కన్పించేది'' అంది ఆన్నీ.

"ఆడపోరిలతో నీకేంది మాటలు?" అంది బేగం.

రాచిప్పచెట్టి వెళ్ళి అధ్యక్షుడి బల్లమీద గట్టిగా చరిచాడు. క్షణంసేపు గోల సర్దుమణిగి అందరూ అటు చూశారు. "అసలు నేను సంఘకార్యవర్గంలో వుండటం బులేరావు కిష్టంలేదు. అందువల్లే శ్రీమతి భానూగారు నా పేరు ప్రతిపాదించేటప్పటికి ఇంత గొడవ మొదలైంది'' అన్నాడతను.

"రామ రామ, నాకలాంటి ఆలోచనల్లేవు'' అన్నాడు బులేరావు.

"ఇవన్నీ అనవసరం మాటలు. స్త్రీలకు సంఘ సభ్యత్వమిస్తే సరి, లేకపోతే 'జోధలో కివాసం మాట ఆలోచించకండి'' అంది ఓల్గా సవాలు చేస్తూ.

"బ్రేవ్‌గర్ల్. దట్స్ ద స్పిరిట్ ఫైటిటవుట్'' అన్నాడు పైనుండి జోషువాగారు. ఆయన, మిద్దెదొరసాని, మైకేల్ ఎంతసేపటినుండో ఈ తమాషా చూస్తున్నారు.

"యజమాని జోషువాగారు'' అని నినదించాడు అక్షనాథ్.

"డౌన్ డౌన్'' అనరిచారు కివాసులు.

"యజమాని నిరంకుశ ప్రవృత్తి''

"నశించాలి... నశించాలి''

"పైనుంచీ కూడా నినాదాలు విన్పించాయి.

"కివాసం" అనరిచాడు మైకేల్.

"డౌన్ డౌన్'' అన్నారు మిద్దె దొరసాని, జోషువాగారు.

"కివాసుల జులుం"

"నశించాలి... నశించాలి''

చివరకు ఎలాగైతేనే స్త్రీలకు కూడా సభ్యత్వం ఇవ్వటానికి ఒప్పుకున్నారందరూ. విధవలకూ, విధురులకూ స్పెషల్‌గా రెండు జట్లు వుంటాయనీ అంగీకరించారు.

చివరకు మా ఆవిడ రాచిప్పచెట్టిని కార్యదర్శిగా ప్రతిపాదించటాన్ని అందరూ ఒప్పుకున్నారు. కూగాశాస్త్రి మద్దతు పల్కాడు. మణిని ఆన్నీ ప్రతిపాదిస్తే ఓల్గా సెకండ్ చేసింది. ఉపసంహారణలు కోరినప్పుడు లెబా, కాంగోరెడ్డి, రాచిప్పచెట్టీ తమ పేర్లు విత్‌డ్రా చేసుకున్నారు. బులేరావుకు మహానందంగా వుంది. ఇంత తేలిగ్గా కాంగోరెడ్డి పదవి వదులుకుంటాడని అతనూహించలేదు. ఇహ కార్యదర్శినవటం ఖాయం అనుకున్నాడు. కాని వ్యతిరేకత తనూహించని కోణాన్నుండి వస్తుందని అతనికి తెలియదు. బైఎలక్షన్‌లో తమ పార్టీ పరాజయ విషాదంలో మునిగిపోయిన కాంగోరెడ్డి 'జోధలో కివాసం' పదవిపట్ల నిర్లక్ష్యం వహించాడు. ఆ నిర్లక్ష్యం తరువాత దెబ్బతీస్తుందని అతనికి తెలియదు.

భార్య ఉపసంహరించుకోకపోవటంతో బులేరావు ఆమె దగ్గరగా వెళ్ళి ఉపసంహరించుకోమని ఆమెని అభ్యర్థిస్తున్నారు.

"బులేరావుగారు మా అభ్యర్థిని బెదిరించి

ఉపసంహరించుకునేటట్లు చేస్తున్నారు. ప్రజాస్వామ్యంలో అది నేరం. ఇంత ఘోరం జరుగుతున్నా మీరేం పట్టనట్టుంటారా అధ్యక్షా!" అంది ఓల్గా.

బులేరావు ఇరుకున పడిపోయాడు. అందరి ముందూ అరిచి భార్యకు చెప్పలేడు. ఏం చేయాలో తోచక కొట్టుమిట్టాడుతున్నాడు. లెబా ఆయన సహాయార్థం వచ్చాడు. "అధ్యక్షా! మన 'జోధలో కివాసం' మంచి సంప్రదాయంతో మొదలవాలంటే మొదటి ఎన్నికలు ఏకగ్రీవంగా జరిగితే మంచిది. సంఘంలో చీలికలు రావు. అందువల్ల మిగిలిన అభ్యర్థుల్లో ఎవరో ఒకరు రాజీపడే అవకాశమివ్వాలి. వాళ్ళను సంప్రదించుకోనివ్వండి'' అన్నాడు లేచి.

స్త్రీలంతా దీనికి ప్రొటెస్ట్ చేసినా, అధ్యక్షుడు మిగిలిన అభ్యర్థులకు సంప్రదించుకునే అవకాశమిచ్చాడు. మణీ, బులేరావూ కొంచెం దూరం వెళ్ళి మాట్లాడుకుంటున్నారు. చివర్లో నుంచున్న నాకు వాళ్ళ మాటలు విన్పిస్తూనే వున్నాయి.

"ఇదుగో మణీ! నా పరువుపోయే పరిస్థితి తెస్తున్నావు. నువ్వు ఉపసంహరించుకో"

"నేను నిలబడితే మీ పరువు పోతుందా? నేను ఉపసంహరించుకోను'' అంది మొండిగా మణి.

నువ్వు నిలబడితే కాదు, నా ప్రత్యర్థిగా నువ్వుంటే నా పరువు పోతుందంటున్నాను''

"అయితే, మీరే ఉపసంహరించుకోవచ్చుగా''

"భర్త మాట అట్లా ధిక్కరించటం మంచిది కాదు. చెప్తున్నా వినుకో"

"భార్యమాట ధిక్కరించటం మంచిదా?"

"మణీ! నీకెట్టా చెప్పాలో తెలియటంలేదు. ఆళ్ళందరూ మనకేసి ఎట్టా చూస్తున్నారో చూడు. భార్యకే చెప్పలేని మగాడను కుంటారు. రేపు పంట డబ్బు రాంగానే నీకు నాలుగోజత గాజులు చేయిస్తాను. ఇప్పటికి నన్ను రక్షించు'' అన్నాడు బులేరావు ఓ మెట్టు కిందకుదిగి.

"ఇలాంటి వాగ్దానాలు ఎన్నో చేశారు మీరు. ఎప్పుడయినా నిలబెట్టుకున్నారా?" అంది మణి.

"నువ్వేఒట్టు వెయ్యమన్నా వేస్తాను. ఆ తిరపతి వెంకన్నమీద ఒట్టు. గాజులు చేయించేది ఖాయం. నామాట నమ్ము. ఈ అప్రదిష్టనుండి నన్ను కాపాడు'' అన్నాడు దీనంగా బులేరావు.

భర్త ముఖంచూసి, మణి బంగారు హృదయం కరిగిపోయింది. చెప్పుడుమాటలు విని భర్తను తానెంత ఇబ్బంది పెట్టిందో గ్రహించిందామె. సభలో కొచ్చి తన పేరు ఉపసంహరించుకుంది.

ఆమె పేరు ప్రతిపాదించిన ఆన్నీకి, మద్దతు ప్రకటించిన ఓల్గాకు మండిపోయింది.

"గడ్డికరిచి పేరు ఉపసంహరించుకుంటున్న మణీ డౌన్ డౌన్' అనరిచింది ఆన్నీ.

"షి సోల్డ్ హర్‌సెల్ఫ్ ఫరె హాండ్ ఫులాఫ్ సిల్వర్' అంది ఓల్గా.

"హాంహాం ఐనాకీ దిఖ్‌రహా'' అంది రాణి.

"ఆర్డర్.. ఆర్డర్..." అనరిచాడు కాంగోరెడ్డి. ఉపసంహరణలయ్యాయి. బులేరావుగారు 'జోధలో కివాసం' కార్యదర్శిగా ఏకగ్రీవంగా ఎన్నికైనట్లు ప్రకటించడమైనది.

"ఆం పేద్ద అయ్యాడులే, చావుతప్పి కన్ను లొట్టపోయినట్టు..." అంది ఓల్గా.

మగసభ్యులు బులేరావు కార్యదర్శి అయినందుకూ, ఆడసభ్యులు ఓల్గా వ్యాఖ్యానానికి చప్పట్లు చరిచారు.

స్త్రీ ప్రతినిధి వేరుగా వుండాలని స్త్రీలు పట్టుబట్టడంతో, సభ అంగీకారంమీద, ఓల్గా సంఘ స్త్రీ ప్రతినిధిగా ఏకగ్రీవంగా ఎన్నికైంది. సంఘ సమస్యలను ఐడెంటిఫై చెయ్యటానికి ఓ ఉపసంఘం (ఉసం) వేయటం జరిగింది.






అందులో సభ్యులుగా అధ్యక్షుడు, కార్యదర్శి, మహిళా ప్రతినిధేకాక కాంగోరెడ్డినీ, రాచిప్పచెట్టినీ కూడా వేయటం జరిగింది. సంఘ కాన్స్టిట్యూషన్స్ కూడా తయారుచేసే బాధ్యత 'ఉసం'కు అప్పగించటం జరిగింది. వీలైనంత త్వరలో జరగబోయే సర్వసభ్య సమావేశం (ససస)లో సభ ఆమోదంకోసం, కాన్స్టిట్యూషన్ను, సమస్యలపై ఇంటరిం రిపోర్ట్ను సభ ముందుంచటం జరుగుతుందని అధ్యక్షులుగా ఎన్నికైన సిపిఐ శర్మ ప్రకటించటంతో ఆనాటి 'జోధలో కివాసం ప్రథమ ససస' ముగిసింది. జోధలో లో్రేడ్ యూనియన్ మూవ్మెంటుకు నాంది పల్కటమైంది.

జోధలో కివాసం 'ఉసం' సమావేశమై సంఘచట్టాన్ని తయారుచేస్తున్నారనీ, కివాసుల సమస్యలను గుర్తించి నివేదిక తయారు చేస్తున్నారనీ వార్తలు వచ్చాయి నాకు. ఇంతలో జోషువాగారు బులేరావును పిల్చి నెల రోజుల్లో ఇల్లు ఖాళీ చేయమని అల్టిమేటం ఇచ్చాడు. దాంతో సంఘ సభ్యులకు మతులు పోయాయి. 'ఆ ఆదివారం సాయంత్రం ఐదు గంటలకు అత్యవసర సర్వసభ్యసమావేశం (అససస) జరుగుతుందికనుక అందరూ రావల్సిందహో' అన్న టముకు మాకందరికీ అందింది.

సమావేశం మొదలైంతర్వాత, ఉసం కన్వీనరుగా సిపిఐశర్మ తాము డ్రాఫ్టు చేసిన సంఘ కాన్స్టిట్యూషన్ డ్రాఫ్టను సమావేశం ముందుంచాడు. కార్యకారిణి మండలి (కాకామం) బాధ్యతలు, అవిశ్వాస తీర్మానం వగైరా సవాలక్ష నిబంధనావళిని ఏకరువు పెట్టాడు. చివరగా సభ్యుల ఆమోదానికై నియమావళిని మీ ముందుంచాను. 'చర్చలకిదే ఆహ్వానం' అని కూర్చున్నాడతను.

జైన్ లేచాడు, "సదర్సాబ్! .హం మైనారిటీస్ కోభీ కాకామం మే రిప్రజెంటేషన్దేం" అన్నాడు.

"అవును మైనారిటీ వర్గమైనా క్రైస్తవులకు కూడా కాకామంలో ప్రాతినిధ్యమిస్తే ..బావుంటుంది'' అన్నాడు హరబాబు.

"నువ్వు క్రిస్టియన్‌వా, హరిజన్‌వా!" అడిగాడు రాచిప్పచెట్టి.

"అదుగో కులం పేరెత్తద్దు. మనం మైనారిటీల ప్రాతినిధ్యంగూర్చి చర్చిస్తున్నాం"

"మరి ముస్లింలలో, క్రైస్తవుల్లో కులాలు లేవు. నువ్వు ముందుగా, మైనారిటీ వర్గమో, మెజారిటీవర్గమో తేల్చుకో' అన్నాడు పట్టువిడవని విక్రమార్కుడు రాచిప్పచెట్టి.

"యెర్ఘూట్‌హై. మీ బడప్పనేంది? మా తక్కువేంది! మాలోన్నీ సున్నీలు, షియాలు, సయ్యద్‌లు, షేక్‌లు, మీర్‌లు అవుర్ బహుత్ సారెజాత్‌లున్నాయి. క్రిశ్చన్‌లోన్నీ కాథలిక్కులు, ప్రొటెస్టెంటులున్నాయి. అరే బోల్తేక్యోం నహీం హరే బాబూ!" అన్నాడు జైన్ రొజుకుంటూ, రొప్పుకుంటూ. హిందూ మతం గొప్పేం, మాలోనూ కులాలున్నాయని చెప్పాలని ఆయన తహతహ.

"అవును జైన్‌భాయి చెప్పింది నిజమే. క్రిస్టియన్లలోనూ సబ్‌సెక్టులు చాలావున్నాయి. మెథడిస్ట్స్, సెవంత్‌డే ఎడ్వెంటిస్ట్స్, హరిజన్స్..." అని ఇంకా ఏదో చెప్పబోతున్నాడు హరబాబు.

"ఇదుగో ఈయనిక్కడ సిగరెట్లు తాగుతూ కూర్చుంటే పొగతో మాకు ఉక్కిరిబిక్కిరి అవుతోంది. స్త్రీలున్నారనయినా గమనించక్కర్లే" అంది మణి. పరేషాన్‌రావు ధూమపానంపై వ్యాఖ్యానమది. దాంతో సభలో సిగరెట్లు తాగొచ్చా లేదా! అన్న విషయంపై చర్చ మొదలైంది.

"ప్రజాస్వామ్యంలో ఇలా ఒకరి స్వాతంత్ర్యాన్ని మరొకరు హరింపచూడటం ప్రజాస్వామ్య సిద్ధాంతాలకే విరుద్ధం. ఆయన సిగరెట్టు గొడవ మీకెందుకమ్మా'' అంది భాను. నిజానికి సిగరెట్లు మానమని నన్ను రోజూ సతాయిస్తూనే వుంది ఆమె. అయితే ఈ ధూమపాన చర్చ నన్ను కూడా కలియబెడుతుందేమోనని ఆమె ముందే జాగ్రత్తపడింది.

"మనీబేన్ అన్నది సరి. మజ్‌లిస్‌లో సిగరెట్ పీనా మనా చెయ్యాల" అంది బేగం.

"క్యోం మనా కర్నా చాహియే. ఇస్‌లియే కితుమ్హారా పతీ పీతా నహీం" అంది రాణి.

"నహీం ఇస్‌లియేకి తుమారె మర్ద్ పీతా హై..." అంది బేగం.

దాంతో రాణి హిందీలో గడగడా అందరి అలవాట్లూ బట్టబయలు చేసింది. ఆమె మాటలకు తెనుగిది: 'నా మొగుడు తాగితే నీకేం పోయిందమ్మా? ప్రతి మనిషికీ ఏవో అలవాట్లుంటాయి. పోనీబాబూ సిగరెట్లు తాగుతాడు, నీ మొగుడెప్పుడు చాయ్ కప్పులు కప్పులు తాగుతుంటాడు. నువ్వేం తక్కువా, గేదెలా ఎప్పుడూ తమలపాకులు నముల్తూనే వుంటావు. కూగాశాస్త్రి ముక్కు పొడుం పీలుస్తారు, సిపిఐశర్మ, బులేరావ్, కాంగోరెడ్డి, లెబాబ్రాందీ పుచ్చుకుంటారు..."

దాంతో గొడవ మొదలైంది. రాణి పేర్లు చెప్పిన వాళ్ల భార్యలందరూ ఒక్కసారిగా లేచి ఒకళ్లమాట ఇంకోళ్లు విన్పించుకోకుండా అరవసాగారు.

"నీకెందుకమ్మా ఆయన తాగితే? ఆయన తాగుతారు, బజార్లో పడతాడు. నీ కొంప మీదకొచ్చేం పడటం లేదుగా'' అంది కాళి.

"ఎవరి డబ్బుపెట్టి వాళ్లు తాగితే మీకందరికీ ఏం మాయరోగం, కళ్లు కుట్టి చస్తున్నారు'' అంది మణి.

"మా ఆయన తాగితే నీదేం బోయిందే గయ్యాళి మొహందానా? కూర్చో, కూర్చో. కన్య నోరు వెల్లుల్లి కంపుకొడ్తున్నా మేమెప్పుడైనా మాట్లాడామా?" అంది ఓల్గా.

"నేనేం తింటే నీకేం. నువ్విట్టా మాట్లాడటం బావుండలా అక్కా!" అంది కన్య ఏడుపు గొంతుతో.

"మైం పాన్ చబాయేతో తుమారా క్యా జారహా? హమారా చాయ్ హం పీతే, తూ కోన్ హై పూఛనేవాలీ?" అంది బేగం.

 

అందరి మాటలకంటే బేగం మాటలు బాగా అర్థమయాయి రాణికి. "అరె జావ్ జావ్... తుమ్హారే చాయ్ మేం తూ జాకే డూబ్‌మరో, హమేం క్యా జారహా? మేరేపతీ సిగరెట్ పీయేతో తుమ్హే క్యా ఎతరాజ్‌హై'' అంది రాణి చేతులు తిప్పుతూ.

"అవును, అధ్యక్షా! ఎవరి అలవాట్లు వాళ్లవి. వాటినిబట్టి సభలో ఎవర్నీ అవమానించటం మర్యాదకాదు. మీరు చూస్తూ మాట్లాడక కూర్చోటమేం బాగాలేదు. ఇది సంఘ సభ్యుల ప్రాథమిక హక్కుల నపహరింపచూసే ప్రయత్నం" అంది భాను.

సమావేశానికి ముందే ఓ చుక్కేసుకు వచ్చి జోగుతున్న అధ్యక్షుడికి అప్పుడు మెలకువ వచ్చింది. టేబిల్‌మీద చేత్తో చరుస్తూ, "ఆర్డర్... ఆర్డర్..." అన్నాడతను.

పక్కకుర్చీలోని బులేరావు లేచాడు. "ఇట్లా పబ్లిక్ ప్లేసెస్‌లో పొగతాగటం ఇతర్ల ఆరోగ్యానికి హానికరం. సభలో పొగతాగ్గూడదని అధ్యక్షులు రూలింగివ్వాలి'' అన్నాడు.

"ఐ అబ్జక్ట్ యువరానర్.:. ఈ విషయంలో మీరేరూలింగూ ఇవ్వాల్సిన అవసరంలేదు'' అంది భాను.

"లేదు, ఇవ్వాల్సిందే. ఇట్టా అందరి ఎదుటా పెద్దలు సిగరెట్లు తాగుతుంటే చూసి పిల్లలు కూడా నేర్చుకొనే ప్రమాదముంది. సిగరెట్లు తాగటం జోధలోలో నిషేధించాల్సిందే'' అంది మణి.

"హు దహెల్ ఆర్యూ టు పుటెబెల్ ఆన్ మైస్మోకింగ్' అని ఘీంకరించాడు జోషువాగారు మిద్దెమీదినుండి గుప్పుగుప్పున సిగార్ పొగవదుల్తూ. పైనుండి సంఘ కార్యక్రమాలను పరిశీలిస్తున్నారాయన.

దాంతో, యాజమాన్యానికి వ్యతిరేకంగా నినాదాలివ్వటం జరిగింది. జోషువాగారు లోపలికెళ్లి పోవటంతో మళ్లీ సభవారి దృష్టి ప్రస్తుత విషయానికొచ్చింది.

"శ్రీమతి మణిగారు అన్నట్లు పొగతాగటం తమకూ, ఇతరుల ఆరోగ్యానికి హానికరమేకాక పిల్లలు కూడా చెడిపోయే ప్రమాదముంది. కనుక దీన్ని జోధలోలో నిషేధించాలి'' అన్నాడు బులేరావు.

"ఆప్ అపనీ ఔరత్‌కీ బాత్ పర్ జోర్ దేరహేం హైం బులేరావ్‌జీ! మై పూఛ్‌తీహుం ఆప్ అపనీ పత్నీ కే కార్యదర్శీహైం యా జోధలోకివాసం కా?" అంది రాణి భర్తనడిగి ఏం జరుగుతోందో తెల్సుకుని.

"టేకె నో టాఫిట్ మిష్టర్ ప్రెసిడెంట్! షి ఈజ్ కాస్టింగ్ ఆస్పర్షన్స్ ఆన్‌మై ఇంటెగ్రిటీ'' అన్నాడు బులేరావు.

"అయ్యా బులేరావుగారూ! పెద్దవాళ్లు సిగరెట్లు తాగితే చూసి పిల్లలు చెడిపోతారు. బీరుకాయలు పుచ్చుకుంటే చెడిపోరా? చాయ్ అన్నిసార్లు తాగితే చూసి చెడపోరా? తమలపాకులు వేసుకుంటే చూసి చెడిపోరా? అం నస్యం కూడా పీలుస్తారేమో పిల్లలు. కాబట్టి జోధలోలో ఎవరూ సిగరెట్లు తాగరాదు, బీరుకాయలు పుచ్చుకోరాదు, వెల్లుల్లి తినరాదు, టీ తాగ్గూడదు, కాఫీ తాగ్గూడదు, నస్యం పీల్చరాదు, నిద్రపోరాదు, పిల్లలు చూసి చదువుకోకుండా నిద్రపోయి చెడిపోతారు. మొగవాళ్లతో ఆడవాళ్లు, ఆడవాళ్లతో మొగవాళ్లు మాట్లాడరాదు... పిల్లలు చెడిపోతారు. అన్నం తినవచ్చా మిస్టర్ ప్రెసిడెంట్! కైండ్లీ పర్మిటజ్ టు టేకవర్ ఫుడ్' అంది ఆవేశంగా మా ఆవిడ.

"యెస్.. ఐ డు టేక్‌నోటాఫ్ ద ఫీలింగ్స్ ఆఫ్ ఆనరబుల్ మెంబర్స్. సభ్యుల వ్యక్తిగత అలవాట్లపై మనం శాశించరాదు. గౌరవనీయ సభ్యులకు నాదో విన్నపం. తమ వ్యక్తిగత అలవాట్లతో సాధ్యమైనంత వరకూ ఇతరులకు అసౌకర్యం కల్గించవద్దని'' అన్నాడు అధ్యక్షుడు.

తనకే ఓ అలవాటుంది కనుక, ఇంక ఎవరు ఏం మాట్లాడినా, గోలపెట్టినా, ..ఆ విషయంలో రూలింగ్ ఇవ్వటానికి అంగీకరించలేదు అధ్యక్షుడు.

మళ్లీ మైనారిటీస్ రిప్రజెంటేషనేం చేశారని ప్రశ్నించాడు జైన్.

"హాం అధ్యక్ష మహోదయ్! హంభీతో లింగ్విస్టిక్ మైనారిటీస్ హైం, మైం, ఔర్ మేరేపతిదేవ్, హమారే రిప్రజెంటేషన్ హెనాభీ మునాసిబ్‌హై'' అంది రాణి.

"నీ మొగుడు తెలుగువాడుకదే నీ మొహం మండా?" అంది ఓల్గా.

ఈ గొడవ చాలా దూరం పోతుందని సభవారు ఏ మైనారిటీస్‌కీ 'కాకామం'లో ప్రాతినిధ్యమివ్వ అంగీకరించలేదు. దాంతో జైన్, బేగం, హరబాబు, కన్య, పరేషాన్‌రావు, రాణి సభలోనుండి వాకౌట్ చేశారు.

"ఐ విల్ నాట్ బి కౌడ్ డౌన్ బై సబ్ టాక్టిక్స్. సంఘచట్టాన్ని సభ్యులు ఆమోదించారని నేను భావిస్తాను'' అన్నాడు అధ్యక్షుడు.

"అయ్యా! ఒక్క విషయం. 'కాకామం' పదవీకాలం ఒక్క సంవత్సరమేనని పేర్కొన్నారు. కార్యదర్శి పదవైనా రెండేళ్లుంటే బావుంటుంది. ఒక్క సంవత్సరంలో ఏ కార్యదర్శైనా ఏం సాధించగలడు?" అంది మణి.

అధ్యక్షుడికి ఓపిక నశించింది. "ఇక దీన్లో చర్చలకు తావులేదు. 'కాకామం'లో అందరి పదవీకాలం సంవత్సరం మాత్రమే వుంటుంది. మొత్తం నియమావళి సభ్యుల అంగీకారం పొందిందని భావిస్తున్నాను. ఎజెండాలో రెండో అంశం 'ఉసం' వారి నివేదిక కాంగోరెడ్డిగారు చదివి విన్పిస్తారు, మీమీ అభిప్రాయాలు చెప్పండి'' అన్నాడు.

కాంగోరెడ్డి నివేదిక పట్టుకు లేచాడు. ఇష్టంలేని పని చేస్తున్నట్టుగా వుంది ఆయన ధోరణి.

"మొదటిది- మన 'జోధలో యజమాని జోషువాగారు, మన కార్యదర్శి బులేరావుకు ఇచ్చిన అల్టిమేటం ఒక నెలరోజుల్లో ఆయన ఇల్లు ఖాళీ చేయాలట" అని చెప్పాడు కాంగోరెడ్డి.

దానిపై అతనేమీ వ్యాఖ్యానించలేదు. ఇంతకుముందే 'ఉసం' సమావేశాల్లో ఆ విషయమై తర్జన భర్జనలు జరిగి ఒకరి వాదం ఒకరికి నచ్చక అందరూ దీన్ని 'ససస'లో ప్రవేశపెట్టాలని తీర్మానించుకున్నట్టున్నారు.

"ఇది వ్యక్తిగత సమస్య. సమిష్టి సమస్యలనే ఇక్కడ చర్చించాలి'' అన్నారు రాచిప్పచెట్టి.

"ఇది వ్యక్తిగత సమస్య ఎట్లా అవుద్దబ్బా! బులేరావుగారు మన సంఘసభ్యులు. సంఘ కార్యదర్శి. మన ఐక్యతను దెబ్బతీయాలనే ఆయనకా నోటీసిచ్చాడు జోషువా. యాజమాన్యంవారి దమననీతిలో ఇది ప్రథమ చర్య. దీన్ని మనం సమిష్టిగా వ్యతిరేకించాలి. ఇది వ్యక్తిగత సమస్య కాదు'' అన్నాడు లెబా.

"బులేరావుగారు కొత్త కివాసి. జూనియర్ కివాసుల్ని ఇబ్బందిపెట్టడం జోషువాగారికి మామూలే. కనుక ఆపద ఆయన కివాసం కార్యదర్శి ఐనందువల్ల వచ్చింది కాదు. అధ్యక్షుడికేం నోటీసివ్వలేదే ఆయన! అందువల్ల ఇది వ్యక్తిగత సమస్య'' అన్నాడు హరబాబు, కాంగోరెడ్డి పాఠాలు అప్పచెప్తూ.

"సరే వ్యక్తిగత సమస్యే అనుకుందాం. మన సంఘసభ్యుడికి ఆ పదవిస్తే మనం ఆదుకోవద్దా?" అన్నాడు అధ్యక్షుడు.

"అదెట్లా, తప్పక ఆదుకోవల్సిందే'' అన్నాడు తిరిగొచ్చిన పరేషాన్‌రావు.

"అసలు వ్యక్తిగత సమస్య అంటే నేనొప్పుకోను 'డివైడ్ అండ్ రూల్‌పాలసీ' అండీ ఇది. ఐదారునెల్ల బట్టీ బులేరావుగారు ఇక్కడ వుంటున్నారుకదా! అంతకుముందు ఇవ్వని నోటీసు మనం సంఘం పెట్టగానే ఎందుకిచ్చారు? వలసవాద తత్వాన్నీ, పెట్టుబడిదారీ ధోరణినీ గమనించండి. మన ఐక్యతకు భంగం కల్గించాలనే ఆయనీపనిచేశాడు. అంటే సమస్య బులేరావుది కాదు. 'జోధలో




కివాసం'కే ఎదురైన సమస్య'' అన్నాడు లెబా.

"అంటే- బులేరావంటే జోధలో కివాసం', 'జోధలో కివాసం' అంటే బులేరావు. బాగుందండీ మీ వ్యాఖ్యానం" అన్నాడు హరబాబు.

"పెద్దలు మీరేమంటారు కాంగోరెడ్డిగారూ..." అడిగాడు అధ్యక్షుడు.

"అయ్యా! నన్నీ విషయంలోకి లాగవద్దని మొన్న 'ఉసం' సమావేశంలోనే మీకు చెప్పాను''

"నేను చెప్పలేదుటయ్యా, ఈ 'సనస' ఓ కప్పల తక్కెడని. ఇంతమందితో ఈ సమస్య పరిష్కారమవుతుందా? ఒకడు నూతికి లాగితే, మరొకరు గోతికి లాగుతాడు'' అన్నారు బులేరావు.

దాంతో చాలామంది సభ్యులు లేచి నిలబడ్డారు, బులేరావు మాటలు వ్యతిరేకిస్తూ.

"నువ్వూ, నీ మిత్రపక్షి లెబానే కప్పలు, మీదే కప్పల తక్కెడ" అనరిచాడు పరేషాన్‌రావు.

"సభ్యులనిలా అవమానించే బులేరావు కార్యదర్శిగా వుండతగడు'' అన్నాడు హరబాబు.

"హాఁహాఁ పూరే 'కాకామం'కో రద్ కర్‌దేనా చాహియే'' అన్నాడు జైన్.

లెబా బులేరావువంక గుర్రుగా చూసి అన్నాడు, "సంఘసభ్యులు క్షమించాలి. కార్యదర్శిగారి ఉద్దేశం సభ్యులనవమానించాలని కాదు. ఇట్ వాజ్ జస్ట్ ఎస్లిప్ ఆఫ్ టంగ్. ఆ విషయం మీరు మర్చిపోవాలి. ఈ సమస్యకో పరిష్కారం సూచిస్తాను నేను. మీ కంగీకారమైతే అలా నడుద్దాం. ఈ సమస్య పరిష్కరించటానికి ఒక ఏకసభ్య కమీషన్ వేద్దాం. జోషువాగారితో సత్సంబంధాలున్న శ్రీ పోనీబాబు ఈ కమీషన్‌కు ఛైర్మన్‌గా వుండి, మన కార్యదర్శిగారిపై వచ్చిన ఈ ఆపద తొలగించాలి'' అని.

మన బరువు ఇంకోడిమీద వేసి భుజాలు దులుపుకోటం అందరికీ ఇష్టమే కనుక, నేను నావల్ల కాదని మొత్తుకున్నా వినక, నన్ను ఏకసభ్య కమీషన్ ఛైర్మన్ చేసేశారు సభ్యులు.

ఆ తర్వాత 'జోధలో డ్రైనేజీ బాగుచేయించే విషయంలో తర్జన భర్జనలై, చివరకి రాజీకి రావటం జరిగింది. ఇంకా చర్చించాల్సిన విషయాలున్నాయి కానీ మహిళా సభ్యుల కోరికపై 'సనస' అడ్జరన్ అయింది.



సనస నిర్ణయం ప్రకారం కూగాశాస్త్రి డబ్బు వసూలు చేయటంతో కాంగోరెడ్డి రెండు రోజుల్లో డ్రైనేజీ బాగుచేయించాడు. ఎటొచ్చీ ఏకసభ్య కమిషన్‌గా నేను చేసిందేమీలేదు. జోషువాగారితో విషయం ఎలా కదపాలో అర్థం కాలేదు. ఆయన అసలే కొరకరాని కొయ్య. పైగా నేను కూడా కిరాయివాసుల సంఘంలో సభ్యుడైనందుకు ఆయన మండిపడుతున్నాడు. ఆయనతో మాట్లాడి నెలరోజులు పైనే అయింది. ఇదివరకు అప్పుడప్పుడు మందుపార్టీలు ఇచ్చేవాడు. ఇప్పుడు మానుకున్నాడు. బులేరావు మిత్రబృందంతో వచ్చి "మీరే మన తెలుగు ఆత్మగౌరవం నిలబెట్టాలి'' అని మొత్తుకున్నాడు. ఏం చేయాలో తోచక కొట్టుమిట్టాడుతున్నపుడు మా శ్రీమతి నా రెస్క్యూకొచ్చింది.

"త్రూ ప్రాపర్ ఛానల్ వెళ్లమన్నారు. మిద్దె దొరసానితో విషయం ముందు కదపండి. పని సానుకూలపడుతుంది'' అని సలహా ఇచ్చింది.

అట్లకాడ పట్టుకున్న ఆడదాని బుర్రేబుర్ర. "నిజమేనోయ్, చక్కటి ఉపాయం చెప్పావు'' అన్నాను.

మిద్దెదొరసాని కవితలు రాస్తూ వుంటుంది. నాకు వినిపిస్తూ వుంటుంది. ఓపిగ్గా తమగోల వినేవాళ్లంటే కవులకు, కవయిత్రులకు మహా ఇష్టం. 'ఇంతగా వాళ్లని బాధిస్తున్నాంకదా' అన్న సానుభూతి కూడా వాళ్లకు శ్రోతలమీద వుంటుందేమో. ఆమె నాకు తప్పక సహకరిస్తుందని నా నమ్మకం.

ఆమెతో అన్నాను, "మీ నాన్నగారు బులేరావును ఇల్లు ఖాళీ చేయమని నోటీసిచ్చారు. ఈ సమస్య పరిష్కరించమని నన్ను వన్‌మాన్ కమీషన్‌గా వేశారు. ఈ విషయంలో మీరు మీ నాన్నగారితో మాట్లాడి నన్ను గట్టెక్కించాలి'' అని.

"దానికేం... ఇవాళ మీ భోజనం మా ఇంట్లోనే. నాన్నతో మాట్లాడొచ్చు తీరిగ్గా'' అంది.

నేను "సరే' నన్నాను, జోషువా గారొచ్చేలోపల ఆమె తన కవితలతో నన్ను తాడిస్తుందని తెలిసీ. అనుకున్నట్టుగానే ఆమె తన ఉద్గ్రంథం... అదే కవితలు రాసే పుస్తకం తెచ్చి, "ఈమధ్యే ఓ కవిత రాశాను. వింటారా'' అంటూ మొదలెట్టింది.

అలా మొదలైన కవితా పఠనం ఒక కవితతో ఆగలేదు... రెండుమూడు చదివింది. మధ్యలో ఆయా కవితల్లోని కవిత్వాంశాన్ని పదాల పొందికను, సొంపునూ, భావరమ్యతనూ ఇమేజీలు, సింబల్సూ గురించి మాట్లాడుకున్నాం.

ఇలా మా కవితా పారాయణం కొనసాగుతుండగా జోషువాగారొచ్చారు. నన్ను చూశారు. పలుకరించకుండా లోపలకెళ్లాడు. చేతికర్ర, కోటూ వంకెకు తగిలించి, రెండు గాజు గ్లాసులు, విస్కీ బాటిలూ పట్టుకొచ్చాడు. బాటిలు మూత విప్పి ద్రావకం రెండు గ్లాసుల్లో పోశాడు. మిద్దెదొరసాని ఫ్రిజ్‌లోనుండి సోడా బాటిల్స్, ఐస్ పట్టుకొచ్చింది. గ్లాసుల్లో సోడాపోసి ఐస్ వేసింది. జోషువాగారు తన గ్లాసు పుచ్చుకుని, టీపాయ్‌మీద నాకుద్దేశించిన గ్లాసుకు దాన్ని తాకించి, మౌనంగా ఛియర్స్ చెప్పి ఓ గుక్కపుచ్చుకున్నాడు.

ఆయనకు నా మీద కోపం వున్నమాట నిజం, అయినా హృదయంలో స్నేహభావముంది. ఆ రెంటినీ ప్రదర్శిస్తున్నారాయన. ద్రావకంచుక్కలు గొంతు దిగింతర్వాత మాట బయటకొచ్చింది.

"యువారె ట్రెయిటర్' అన్నాడు.

"అదేంటి డాడీ! పెద్ద మనిషిని పట్టుకుని అలా అనటం" అంది మిద్దె దొరసాని.

"నీకు తెలీదు. నువ్వుండమ్మాయి! హౌడేర్ హి టు స్టార్ట్ ఎ టెనెంట్స్ యూనియన్ అగనెస్ట్‌మి?"

"డోంట్ బ్లేం మి మిష్టర్ జోషువా! ఇట్స్ నాట్ హిజ్ టుక్‌ద ఇనీషియేటివ్. అయినా కిరాయిదారులు సంఘంగా ఏర్పడటంలో తప్పేముంది?"

"షటప్... ఐసే షటప్... యూవారె స్కాండ్రల్, రోగ్' అని తిట్లకు లంకించుకున్నాడు.

నేనేం మాట్లాడలేదు. తిట్టేమనిషి కిందకు దిగజారటం తప్పదని నాకు తెల్సు.

"డాడీ! ఇదేం మర్యాదగా లేదు, పెద్దమనిషిని భోజనానికి పిల్చి తిట్టటం" అంది మిద్దె దొరసాని.

"భోజనానికెవరు పిల్చారు?" అడిగాడు జోషువాగారు ఆశ్చర్యపోతూ.

"నేనే పిల్చాను. పోనీబాబు రావటంలేదని విసుక్కుంటున్నావుకదా! అందువల్ల నీకు కంపెనీ ఇస్తారని పిల్చాను'' అంది




ఆమె.

నన్ను విందుకు పిలవటం ఆయన కిష్టమే కానీ, నాకోసం తను ఎదురుచూస్తున్నాడన్న సంగతి నాకు తెలియటం ఆయనకిష్టంలేదు. ఒకోసారి ఆయన ప్రవర్తన పసిపిల్లవాడిని తలపించేటట్టుగా వుంటుంది.

"నువ్వుండమ్మా! నీకేం మాట్లాడాలో, ఏం మాట్లాడకూడదో కూడా తెలీదు'' అని విసుక్కున్నాడాయన.

'సరే, తింటానికేమయినా తెస్తాను'' అని ఆమె లోపలకు వెళ్ళిపోయింది.

"అమ్మాయికి పెళ్లి చేసేయాలయ్యా! ఆ క్రిస్టోఫర్‌ని నువ్వు చూశావా? ఎలావున్నాడంటావు'' అన్నాడు జోషువాగారు. మానవుడికి మాట్లాడే దిక్కులేక సగం చిక్కిపోయాడు. ఆత్మీయుల్లేని ప్రపంచం శూన్యంగా వుంటుంది.

"అతనికేం సలక్షణంగా వుంటాడు. మంచి ఉద్యోగం, ముందు ఆమె ఇష్టపడాలికదా!" అన్నాను.

"ఇష్టపడినట్టే వుందయ్యా! నువ్వు కాస్త కనుక్కో'' అని ముందుకి వంగి చెవిలో చెప్పినట్టు, "కట్నం కూడా పెద్దగా ఆశించేట్టు కన్పట్టంలేదు. మన కూగాశాస్త్రి జాతకాలు దివ్యంగా కలిశాయన్నాడు. ఇహ పెళ్లి చేయటం మంచిదేమో. నేనెంత కాలం బతుకుతానో ఏమో. నీతో సంప్రదిద్దామంటే నువ్వు బద్ధ శత్రువై కూర్చున్నావు. రావు, మాట్లాడవు. ఇదేం బాగలేదు'' అన్నాడు.

నేను శాకాహారినని ఆలుచిప్స్, బూంది ప్లేట్లలో పట్టుకొచ్చింది మిద్దెదొరసాని.

"చూశావా అమ్మాయ్! ఈ గడ్డి (శాకాహారం) మేసి, తిక్కకాయలు (కూరగాయలు) తిని ఎలా వున్నాడో మనిషి! రెండు ముక్కలెయ్యవయ్యా అంటే వినడు'' అన్నాడు జోషువాగారు.

నేను నవ్వాను, మరేం మాట్లాడకుండా...

"ఊఁ ఏవంటున్నారు మీ జోధలో కివాసం సభ్యులు. వాడు... ఆ బులేరావు కొంపకి నిప్పంటించాడు. ఎప్పుడూ లేంది యూనియనట, గాడిదగుడ్డట, వాడు సెక్రటరీట, ఆ వెధవన్నర వెధవ సిపిఐశర్మ ప్రెసిడెంటట.. వీణ్ణి తోలేసిన మరుక్షణంలోనే వాణ్ణి తోలేస్తాను'' అన్నాడు జోషువాగారు సిగారు వెలిగించి.

"పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించటం న్యాయం కాదు. అలా పెద్దమనిషిని అమాంతం ఇల్లు ఖాళీ చేయమంటే ఎక్కడికి పోతాడు''

"వాడా... వాడా పెద్ద మనిషి... స్కాండ్రల్, రోగ్, ఇడియట్.. వాడికి పొగరయ్యా! వాడిపార్టీ అధికార పార్టీ అయితే నాకేంది? నామీద చూపిస్తాడా వాడి ప్రతాపం. చూస్తా... చూస్తా, వాడి అంతు తేలుస్తా'' అని హూంకరించాడాయన.

"నువ్వట్టా అంటే ఎట్టా డాడీ! ఆయన పరువు గంగలో కలిసేటట్టుంది'' అంది మిద్దె దొరసాని.

"అదేంది? నీకేం పోయేకాలమొచ్చిందయ్యా?"

మిద్దె దొరసాని విషయం తండ్రికి విడమర్చి చెప్పింది, అలా కవితా బాధితుడి ఋణం తీర్చుకుంటూ,

"నువ్వు ఇట్టాంటివేవో కొంపమీదికి తీసుకొస్తావు!" అని నుదుటి మీద కొట్టుకుంటూ, "సరే ఆగాద్దని పిలువు'' అన్నాడు.

రమ్మూని పంపి బులేరావును పిలిపించింది మిద్దె దొరసాని. బులేరావు అంగబలంతో వచ్చాడు, లెబా, రాచిప్పచెట్టి పరేషాన్‌రావు, సిపిఐశర్మలతో.

"రండి, రండి'' అని నేనాహ్వానించి కూర్చోపెట్టాను వారిని.

"ఆఁ చెప్పవయ్యా! ఏమంటావు. పోనీబాబుతో ఏదో చెప్పి పంపావంట?" అన్నాడు జోషువాగారు.

"మీరిలా చెప్పాపెట్టకుండా ఇల్లు ఖాళీ చేయమనటం దురన్యాయం" అన్నాడు బులేరావు.

అంతే, జోషువాగారికి కోపం వచ్చింది. "నాది దురన్యాయమా? స్కౌండ్రల్, రోగ్... నీకసలు ఇల్లు ఇవ్వటమే దురన్యాయం. నా ఇంట్లో దూరి యూనియన్ పెడ్తావా, యూనియన్... పో, నీ అబ్బకు చెప్పుకో పో' అన్నాడు జోషువాగారు.

"యూనియన్ పెట్టుకుంటే తప్పేందండీ... అసలు ట్రేడ్ యూనియన్ మూవ్‌మెంటు స్టార్టయిందే బ్రిటన్‌లో. అన్ని విషయాల్లో బ్రిటన్ని అనుకరించే మనం యూనియన్లను కాదంటే ఎట్టా?" అన్నాడు లెబా డిప్లొమాటిగ్గా

"అవునయ్యా, తప్పులేదు. యూనియన్ పెట్టుకున్నారు. మీకు సమస్యలుంటే నాతో చెప్పకుండా జోషువా డౌన్‌డౌన్! ఇంపీరియలిజం డౌన్‌డౌన్! అనరిస్తే మీ సమస్య పరిష్కారమైపోతుందా?"

పరేషాన్‌రావుకు ఆయన మాటల్లో సత్యం గోచరించింది. "అవున్నిజమే... ముందు యాజమాన్యంతో సంప్రదించకుండానే యాజమాన్యాన్ని దుయ్యబట్టటం అన్యాయం" అన్నాడతను.

"పరేషాన్‌రావూ! నువ్వొక్కడవయ్యా సత్యాన్ని గుర్తించినవాడవు. తప్పుంటే ఒప్పుకోవాలి. అహ అది లేదు. ఒప్పుకోటానికి మనకు అహంకారం అడ్డొస్తుంది. వీడు బులేరావు నాతో అనొచ్చుగా తప్పయింది ఈసారికి క్షమించండి అని. అహ ఎందుకంటాడు. వాడికి పొగరు, అహంకారం, గర్వం. వాడి తెలుగు పౌరుషం దెబ్బతింటుంది. మీరందరూ వాడికి వత్తాసు. ఈ సిపిఐశర్మను కూడా పంపేస్తాను. మీరందరూ నామీద కత్తిగడ్తారా! నేనేం చేయలేననుకున్నారా? ముసలాణ్ణి అనుకోకండి. ఒక్కొక్కణ్నీ తన్ని ఇల్లు ఖాళీ చేయించేస్తాను'' అన్నాడు ఉగ్రంగా జోషువాగారు.

"అయిందేదో అయింది. బైగాన్స్ ఆర్‌బైగాన్స్. ఇప్పుడు చెయ్యాల్సిన కర్తవ్యమేమిటో ఆలోచించండి జోషువాగారూ'' అన్నాడు.

అంతలో కూలయిపోయాడు జోషువాగారు. "సరేనయ్యా! మీకు బులేరావు సమస్య పరిష్కారమైతే చాలా, లేక మిగతా సమస్యలు కూడా శాశ్వతంగా పరిష్కారమవాలా?"

"అన్ని సమస్యలు శాశ్వతంగా పరిష్కారమవటమే మాకు కావల్సింది'' అన్నాడు లెబా.

"సరే, నువ్వు మూడొందలు అద్దె ఇస్తున్నావు. మూడొందలకు మూడు గదులు, వరండావున్న పోర్షను నీకు హైదరాబాదు సిటీలో దొరుకుతుందా చెప్పు? మీరీ మధ్యన వచ్చినవాళ్లు. సీనియర్ కివాసులు కాంగోరెడ్డీ, జైన్, సిపిఐశర్మలు ఏమిస్తున్నారు. ముష్టి వంద! మరి నేను మీకెలా కన్పిస్తున్నాను. ఎక్స్‌ప్లాయిటర్, కాపిటలిస్ట్, డిక్టేటర్ ఇవి మీరు నాకు పెట్టిన పేర్లు..."

"అవునండీ... అందుకనేగా మేం లోగిలికి జోషువాగారి ధర్మ లోగిలి 'జోధలో' అని ముద్దుగా పేరు పెట్టుకొంది'' అన్నాడు పరేషాన్‌రావు.

"అవునా... ఇళ్లకు వైట్‌వాష్ చేయించలేదు, గోడలు పెచ్చులూడిపోయాయి. డ్రైనేజ్ పాడయింది. లావెటరీలు, బాత్‌రూంలు చాలటంలేదు. బోరింగ్‌కి మోటర్ పెట్టిస్తే బావుంటుంది. ఎలక్ట్రిక్ కనెక్షన్లు పాతవి, రీవైరింగ్ చేయించాలి. ఇవన్నీ సమస్యలే. ఐదేళ్లనుండీ మీరెవరూ అద్దెపెంచలేదు, నేనడగటం తప్పు. ఆ ఖరంగాడు రెండు వేల దాకా ఎగ్గొట్టాడుకదా! అయితే శాశ్వత పరిష్కారంగా మీరందరూ తలోపాతిక రూపాయలూ అద్దె పెంచండి. అన్ని సమస్యలు పరిష్కరిస్తాను''

"బులేరావు సమస్య అయితే ఎలా పరిష్కరిస్తారు?" అడిగాడు లెబా.




"ఎలా ఏముందీ! ఆయన ఇంటి అద్దె ఈ నెలనుండి యాభై రూపాయలు పెరుగుతుంది. అప్పుడు మిగతా సమస్యలు నేను పట్టించుకోను''

"నేనేం పాపం చేశాను, నా ఒక్కడి అద్దె పెంచటానికి? ఇదన్యాయం. ఆరుకోట్ల ఆంధ్రులకు ద్రోహం చేయటమది'' అన్నాడు బులేరావు మొత్తుకుంటూ.

"ఇంక దీంట్లో వాదనలకు తావులేదు. మీ సంఘంలో చర్చించుకుంటారో, ఎలా మీరు నిర్ణయించుకుంటారో నాకు తెలీదు. నౌ ది బాల్ ఈజ్ ఇన్ యువర్ కోర్ట్'

మళ్లా విషయం డైలమాలోపడ్డది. ఏం మాట్లాడే అవకాశం లేక జోషువాగారికి థాంక్స్ చెప్పి, నాకేసి కూడా చూడకుండా బయలుదేరింది బులేరావువర్గం. జోషువాతో కుట్రపన్ని అద్దె పెంచటానికి ప్రయత్నం చేశాననీ, నావల్ల సంఘానికి అపకారమేకాని ఉపకారం జరగదని అప్పటినుండి భావించటం మొదలెట్టారు వాళ్లు.

"మీకు కృతజ్ఞతలు జోషువాగారు. చాలా తెలిగ్గా పరిష్కరించారు సమస్యను'' అన్నాను నేను.

"దీంట్లో ఏముందయ్యా? ఇలాంటి సమస్యలెన్ని పరిష్కరించకపోతే ఈ వయసు వచ్చిందంటావు. అనుభవం లేని కుర్రకుంకలు. నన్నే సాధిద్దామనుకుంటున్నారు. ఇంగ్లీషువాళ్ల జమానాలో రాటుతేలిన పిండమిది. నాకు తెలీదూ ఈ గాడ్దలకు ఇంత చవగ్గా ఇల్లెక్కడ దొరికి ఛస్తుందని? వీళ్లకీ వీళ్ల పిల్లలకీ తేడా ఏముందయ్యా? నాముందర వీళ్లెంత? డబ్బుకోసమటయ్యా నేను వాళ్లకద్దెకిచ్చింది? కంపెనీకోసం. ఐ వాంట్ దెం, ఐ లైక్‌దెం" అన్నాడు జోషువాగారు.

ఇవాళ ఆయనలో నాకు హృదయం ఉన్న మనిషి కన్పించాడు.

"ఆ లెబా, సిపిఐ శర్మలు నన్ను పెట్టుబడిదారీనంటారు. కానీ మనలోమాట ఇప్పుడున్న కమ్యూనిస్ట్ నాయకుల్లో ఎవరికి ఆస్తిలేదు, డబ్బు లేదు. బయటకొచ్చి 'ఆస్తిహక్కుండరాదు, భూ సంస్కరణలు, నేషనలైజేషన్ వగైరా పనికిరాని మాటలన్నీ మాట్లాడతారు. ఆc తీసెయ్యి ఆస్తిహక్కు. హాయిగా బతకటానికి వీలు కల్పిస్తే ఆస్తి, డబ్బు ఎవడికి కావాలయ్యా! మనం నెత్తిన కట్టుకుపోతామా పొయ్యేటప్పుడు..."

"కాని వ్యక్తులు వేరు, ఆదర్శం వేరు. వ్యక్తుల్ని చూసి ఆదర్శాన్ని తప్పు పట్టడం ఎంతవరకు సమంజసం?"

ఆయన నా మాట విన్పించుకోలేదు "ఐ నో దిస్ డెమోక్రసీ ఈజ్ బాడ్ బట్ నాట్ వర్స్ దెన్ టోటలిటేరియనిజం. నిజమేనయ్యా ప్రజాస్వామ్య దేశంలో వున్న కమ్యూనిస్టులు కొంతవరకు దేశహిత చింతకులూ, దళితవర్గ బంధువులూ - నేను వప్పుకుంటాను. కాని కమ్యూనిస్టు దేశాల్లోని కమ్యూనిస్టులున్నారే, వాళ్లు వరెస్ట్ పెర్పెట్రేటర్స్ ఆఫ్ ఇన్‌జస్టిస్ అండ్ టిరనీ. షుడ్ వుయ్ లివ్ టు ప్రిజర్వ్ ది బాడీ ఆర్ ది మైండ్? టెల్‌మి?"

ఆయన ఎక్కడనుండి ఎక్కడకు వచ్చాడో నాకర్థంకాలేదు. నేనేం మాట్లాడలేదు.

"ఆ నువ్వు మాట్లాడవు. నీ రిజర్వేషన్సు నీకున్నాయి. కాని ఒక్క విషయం... నువ్వింకా యంగ్. ఎప్పుడో ఓ రోజు నా మాటల్లో సత్యం నీకు గోచరిస్తుంది. అప్పటికి గుర్తుచెయ్యటానికి నేను బతికుండకపోవచ్చు''

మిద్దె దొరసాని భోజనానికి పిలవటంతో భోజనం చేస్తూ మాట్లాడుకోసాగాం.

"ఆc నువ్వనవచ్చు 'వృద్ధనారీ పతివ్రతా' అని. నువ్వేం డబ్బు దోచలేదా? లంచాలు తీసుకోలేదా? ఇప్పుడు ముసలితనంలో పత్తిత్తు కబుర్లు చెప్తున్నావు' అని. నేనేం పవిత్రుణ్ణని చెప్పటంలేదు. నేనూ లంచాలు పట్టాను, మోసం చేశాను. ఇవాళ ముసలాడి

నై బలహీన మనస్తత్వంతో చెప్తున్నాననుకోవద్దు. మొట్టమొదటి లంచం పట్టినప్పటినుంచి గిల్టీ కాన్షన్స్ నన్ను ప్రిక్ చేస్తూనేవుంది''

"మరి ఆ తరువాత మానెయ్యాల్సింది మీరు?"

"చెప్పటం తేలికయ్యా చెయ్యటం కష్టం. మనమో వ్యవస్థలో వున్నాం. నేనొక్కణ్ణే మానేసినందువల్ల అది శుద్ధమవదు. ఐ టుక్ ఎడ్వాంటేజ్ ఆఫిట్. ఐ డోంట్ హావ్ ది స్ట్రెంగ్త్ టు రెజిస్ట్ ఇట్. కాని నేను మహా పవిత్రుణ్ణని డబ్బా వాయించుకోలేదు. అందుకే నేను చర్చికి వెళ్లను. ఈ మలినమైన చేతుల్తో దేవుడి దగ్గరకెలా వెళ్తామయ్యా! కాని ఈతరం మనుషులకు ఆమాత్రం ఇంగిత జ్ఞానం లేదు. దే వర్షిప్ మామ్మన్ - గోల్డ్, బట్ నాట్ గాడ్''

మిద్దె దొరసాని మా మాటలు వింటోంది. మాక్కావల్సినవి వడ్డిస్తోంది.

"కాని సామాజిక సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలమీదే ఆధారపడివున్నాయి. ఆ మాట మీరూ కాదనలేరు. ఏ సమాజం, జాతీ ఆర్థికంగా వెనకబడి, సాంస్కృతికంగా, నాగరికతాపరంగా అభివృద్ధి గాంచలేదు. ఆర్థిక సంబంధాల పునాదిమీద సమాజ భవన నిర్మాణమైంది. అందువల్ల 'ఈతరం మనుషులు డబ్బుకు దాసోహమంటున్నారు' అని తిట్టి ప్రయోజనం లేదు.వ్యవస్థనుమార్చాలి, మనం మారాలి"అన్నాను.

"కాని ఆ వ్యవస్థ మీరనుకుంటున్న ఆర్థిక సంబంధాల నధిగమించివుండాలి. వాటీజ్ యువర్ కమ్యూనిజం? ఇటీజ్ రియలిస్టిక్ ఎట్ ద బేస్, బట్ ఐడియలిస్టిక్ రొమాంటిక్ ఎట్ ద టాప్. ది ట్రాజెడీ ఆఫ్ద కమ్యూనిస్ట్స్ ఈజ్ దే ఆల్వేస్ రిమైన్ ఎట్ ద బేస్, దె డోంట్ ట్రై టు రీచ్ ద టాప్..."

నేనేం మాట్లాడలేదు. "మరి మిగతా పార్టీల సంగతేమిటి నాన్నా?" అంది మిద్దె దొరసాని.

"కొన్ని సిద్ధాంతాలున్నవాళ్లయినా, దేశాన్నీ ప్రజలనూ గూర్చి ఆలోచించేవాళ్లు రెండే రెండు గ్రూపులు - ద లెఫ్టిస్ట్స్ అండ్ ద రైటిస్ట్స్. మిగతావి అవకాశవాద పార్టీలు. మన ఇన్‌ఫాంట్ స్టేజిలో వున్న డెమోక్రసీ ఇంకా ఇవాల్వు అవుతోంది. అప్పుడీ ఆయారాం, గయారాంలు పోతారు. దేశ భవిష్యత్తును అల్టిమేట్‌గా నిర్ణయించేవి ఆ రెండు వర్గాలే.

"మరి రైట్‌వింగ్ సంగతేమిటి నాన్నా?" అడిగింది మిద్దె దొరసాని.

"ద రైట్ వింగ్ హాజ్ నో బేస్ బట్ ద టాప్ - టోటల్లీ ఐడియలిస్టిక్. ఇటీజ్ హార్డ్ టు గెట్ కన్విన్స్‌డ్ ఆఫిట్స్ ఐడియాలజీ, బట్ వన్స్ కన్విన్స్‌డ్ దెరీజ్ నో బార్ టు రీచ్ ద టాప్. హేతువాదానికంత ప్రాధాన్యం ఇవ్వకపోవటమే రైట్‌వింగ్ ట్రాజెడీ'' అన్నాడాయన.

జోషువాగారు పాతకాలం మనిషనీ, ఆంగ్ల మానస పుత్రుడనీ అనుకున్నామే తప్ప ఆయనకు సమకాలీన సమాజంపై, వ్యవస్థపై నిర్దిష్ట భావాలున్నాయని నేననుకోలేదు. నాకు ఆయన అభిప్రాయాలంగీకారమైనా, కాకపోయినా ఓ కొత్త దృక్కోణంలో దర్శనమిచ్చాడు జోషువాగారు నాకు.

★ ★ ★

అడ్జరన్ అయిన 'సససా' ఆరోజు ఆదివారం జరుగుతుంది కనుక నేనూ, మా ఆవిడా అన్ని పనులూ పూర్తిచేసుకుని సిద్ధంగా వున్నాం. అన్ని భాగాలవాళ్లూ ఎవరి గొడవల్లో వాళ్లున్నారు కానీ ఎవరూ సమావేశ స్థలానికి రాలేదు. అంతలో హరబాబు, కూగాశాస్త్రీ, జైన్, కాంగోరెడ్డీ ఒక్కొక్కరే వచ్చి చేరారు. సమయమైనా మరింకెవరూ రాకపోయేసరికి అనుమానమొచ్చి లెబాని పిల్చి అడిగితే, "ఇవాల్టి 'సససా' కాన్సిలయిందిగా. బులేరావు అత్యవసరమైన పనిమీద వాళ్ల ఊరు వెళ్లాడు. సమావేశాన్ని పై ఆదివారానికి పోస్ట్‌పోన్ చేశాడు'' అనన్నాడు. ఆ సమాధానంతో తృప్తి





పడలేదు కాంగోరెడ్డి. సిపిఐ శర్మను పిలిపించి అడిగినా అదే జవాబిచ్చాడు. ఈ విషయం పరేషాన్‌రావుకీ, రాచిప్పచెట్టికీ కూడా తెల్సట. మమ్మల్ని చూసి పిల్లలందరూ అక్కడికి రాసాగారు.

"ఇదేమిటి? జోధలోకివాసంలో మీరయిదుగురూ, మీ భార్యలే సభ్యులా? మాకు తెలియనవసరంలేదా?" అన్నాడు కాంగోరెడ్డి సిపిఐ శర్మతో.

"మీరు వేరే అర్థాలు తీయకండి. ఆయనకు పనివుండి వెళ్లాడు. అందుకని ఇవాళ మీటింగ్ లేదు'' అన్నాడు సిపిఐ శర్మ.

"ఇదన్యాయం. ఒక్క మనిషికోసం ముందుగా నిర్ణయింపబడిన సమావేశం రద్దవటం ఎక్కడా జరగదు''

"అయితే ఆయన్ని అన్ని పనులు మానుకొని కూర్చోమంటారా?"

"పనులు ఎవరు మానుకోమన్నారు? పోస్ట్‌పోన్ అయినట్లు అందరికీ చెప్పొచ్చుగా'' అన్నాను మాటజారి, విషయం ఎంతదూరం పోతుందో అంచనా వేయక.

"ఎవరు లేకపోయినా ఇవాళ మీటింగ్ జరిగితీరుతుంది. ఇదుగో హరబాబూ, కూగాశాస్త్రీ మీరు ఏర్పాట్లు చేయండి, సమావేశం ప్రారంభిద్దాం''

"మా ఇంట్లో జంపకానాలు, కుర్చీలు వున్నాయి. పట్టుకొచ్చేదా అంకుల్' అన్నాడు అక్షనాధ్.

"నీకెందుకూ, నువ్వు నోర్మూసుకో' అని కసిరాడు సిపిఐ శర్మ కొడుకును.

"పోనీ బులేరావంకుల్ వచ్చింతర్వాత మీటింగు పెట్టుకుంటే ఏం నాన్నా? ఇంతలో ఏంపోయింది?" అంది రోజీ.

"అమ్మాయ్! నీకు తెలీని విషయాలు పట్టించుకోవటం మంచిదికాదు. వెళ్లి టి.వి. చూసుకో ఫో' అన్నాడు కాంగోరెడ్డి కోపం బిగబట్టి.

"టి.వి.కంటే మీటింగే బావుంటుంది. మేమిక్కడే వుంటాం" అంది ఇందిర.

"అంకుల్! మీరు ప్రతి ఆదివారం మీటింగులు పెట్టుకుంటుంటే మాకు క్రికెట్ ఆట్టానికి వీల్లేకుండా వుంది'' అన్నాడు అల్లాబక్ష్ కాంగోరెడ్డితో.

"పిల్లలూ! మీరంతా పైకిరండి. మనం వర్డ్ బిల్డింగ్ ఆడుకుందాం" అని పైనుండి పిల్లల్ని పిల్చారు జోషువాగారు. పెద్దవాళ్లని గదమాయించినా, పిల్లలకు ఆయన దగ్గర చనువు.

చిన్న పిల్లలు ఇందిర, చంద్రశేఖర్, రాము, ఝాన్సీ, మిత్ర, జానకి, మెహర్, జహంగీర్, నసీమా, మేర్కా, బద్రూ, సరోజ, లల్లీ, విరి, రాజీలు 'పోలో'మంటూ మెట్లెక్కసాగారు. పెద్ద పిల్లలు అక్షనాధ్, రామచిలుక, రోజీ, రోషన్లు అక్కడే వుండిపోయారు. "ఒరేయ్! మీరూ పైకి రండి, కారంబోర్డ్ ఆడుకుందాం" అని మైకేల్ కేక వేయటంతో అక్షనాధ్ బృందం కూడా పైకివెళ్లింది. బకష్, కోదండరాంలకు జోషువాగారు సూచించిన ఆట అన్‌మాన్లీగా అన్పించి బయటకెళ్లారు.

హరబాబు, కూగాశాస్త్రీ జంపకానాలు పరుస్తున్నారు. స్త్రీ సభ్యులు కూడా రాసాగారు.

"మీటింగ్ జరగటానికి వీల్లేదు. అలా మేం కాకామంలో నిర్ణయం తీసుకున్నాం" అన్నాడు సిపిఐ శర్మ.

"'కాకామం' 'ససస' కంటే పెద్ద బాడీ కాదు. కనుక సససలో తీసుకున్న నిర్ణయాన్ని మార్చే హక్కు కాకామంకి లేదు'' అన్నాడు కాంగోరెడ్డి.

"ఎందుకొచ్చిన గొడవండీ ఇది. ఓ వారంలో ముంచుకుపోయేదేంది?" అన్నాడు లెబా.

"ఎందుకు ముంచుకుపోదు. మీకు తెల్సు కాబట్టేనా? మాకు తెలీదు కాబట్టి ముంచుకుపోతుంది''

అన్ని ఏర్పాట్లూ అయ్యాయి. ఇహ సమా

వేశం ప్రారంభమవటమే తరువాయి. కాంగోరెడ్డి టేబుల్ దగ్గర నిలబడి సిపిఐ శర్మని వచ్చి అధ్యక్షం వహించమని ఆహ్వానించాడు. అతను నిరాకరించటంతో లెబాని పిల్చాడు.

"ఇదన్యాయం. సంఘ అధ్యక్షులు ఎట్టఎదుట దయ్యంలా వుండగా మరొకరా? పీఠాన్ని అధిష్టించవీల్లేదు'' అని పెద్దగా అరిచింది ఓల్గా.

"నీ దయ్యపు మొగుడు రానంటే మేమేం చేస్తాం" అన్నాడు హరబాబు.

"ఓరి దుర్మార్గుడా! నా మొగుడు దయ్యమా! నువ్వే ప్రేతం మొహానివి'' అంది ఓల్గా.

"ఏమయ్యా లెబా! నువ్వు అధ్యక్షత వహిస్తావా లేదా?" అనడిగాడు కాంగోరెడ్డి.

"నేను రాను. బులేరావు నాకు చెప్పాడు. నేనిప్పుడు అధ్యక్షత వహిస్తే మిత్రద్రోహం చేసినట్టవుద్ది''

"నేను చెప్పలేదా రెడ్డిగారూ! మిత్రపక్షులు పడనివ్వరని'' అన్నాడు హరబాబు.

"మర్యాదగా మాట్లాడు. పక్షులు, గిక్షులు' అని నోరు పారేసుకోబోకు'' అంది మణి.

"మా ఆయన ఏమన్నాడక్కా! ఆయన్ని అట్లా గదమాయిస్తావు'' అంది కన్య ఏడుపు గొంతులో.

"అరె కన్నియా బటియా! రోవోమత్. మై ఇసే దేఖ్‌లేతుం"

"క్యా దేఖ్‌లేతేజీ! ఘర్‌మేc బచ్చోంకో సంభాల్‌లో వహీ బహత్‌హై'' అంది రాణి.

"అరె దేఖోనఇసే, ఛోటాముహ్ బడీబాత్' అంది బేగం భర్తకు కంప్లైంట్ చేస్తూ.

కాంగోరెడ్డి బల్లమీద చరిచి, రాచిప్ప చెట్టిని అధ్యక్షత వహించమని కోరాడు.

"మావారు లేకుండా ఈ సమావేశం జరగటానికి వీల్లేదు'' అంది మణి.

"మీ ఆయన ఎక్కడ చచ్చాడో! ఆయన లేకపోతే ఈ సమావేశం ఎందుకు జరగ్గాడదూ?" అంది అండమ్మ.

"మా ఆయన్ని చావమంటావా? నేను కూడా నీలాగా కావాలని వుందా పాడు ముండా'' అని తిట్టింది మణి.

"అవునే. వెనకటికి ఎవరో కాళ్లకు మొక్కితే 'నాలాగా వెయ్యేళ్లు వర్ధిల్లు తల్లీ!' అని దీవించిందట, ఓ ముండమోపిది. అలాగుంది ఈవిడ వరస" అంది ఓల్గా.

"మీ నోళ్లు పడ... నన్ను ముండ అంటారా... మీరే ముండలు. మీ మొగుళ్లుమాత్రం ఎల్లకాలం బతికి ఛస్తారా?" అంది అండమ్మ.

"ముండని ముండనక ముత్తయిదువంటారా... చోద్యం" అంది ఓల్గా.

"ఊర్కో చిన్నమ్మా! వాళ్ల నోళ్లకు ఉప్పాపత్రీలేదు. ఎట్టాబడితే అట్టా వాగిఛస్తారు. గయ్యాళిసంత" అంది కన్య అండమ్మను సముదాయిస్తూ.

మళ్లీ బల్ల చరిచి "పరేషాన్‌రావుగారిని అధ్యక్షులుగా వుండమని కోర్తున్నాను'' అన్నాడు కాంగోరెడ్డి.

"ఆపన్నే చేయనండీ! కాకామం నిర్ణయించిందిగా ఇవాళ సభ జరగదని'' అన్నాడు పరేషాన్‌రావు.

"విచీజ్ సుప్రీం? కాకామం ఆర్ ససస? కిందటి సససలో ఇవాళ సభ జరుగుతుందని నిర్ణయం తీసుకున్నాం. కాకామం ససస ఎన్నుకున్న మండలి. ఇందులో దేనిమాట చెల్లాలి? కాకామంని ఎన్నుకున్న ససదా? ససస సృజించిన కాకామందా?" అన్నాను నేను వుండబట్టలేక.

"ఈ మాటలన్నీ అనవసరం. నేను అధ్యక్షుడుగా వుండను'' అన్నాడు పరేషాన్‌రావు.

"సోదర సోదరీమణులారా! చూశారుగా లెబా, రాచిప్పరెడ్డి, పరేషాన్‌రావుగార్లకు అధ్యక్షుడుగా వుండటం ఇష్టంలేదు. జోధలోకి వాసం అధ్యక్ష మహెూదయుడైన సిపిఐ




శర్మగారికి అసలే ఇష్టంలేదు. అధ్యక్షత వహించటం ఇష్టంలేని అధ్యక్షుడు మనకొద్దు. చెప్పకుండా ఊరెళ్లే బాధ్యతారహితుడైన కార్యదర్శి మనకసలే వద్దు. పాత కాకామంపై అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టి కొత్తబాడీని ఎన్నుకుందాం" అన్నాడు హరబాబు. అతని మాటలు వింటూంటే బులేరావు ఊళ్లో ఉండని విషయం కాంగోరెడ్డి బృందానికి ముందే తెలిసిందా అన్న అనుమానం కలిగింది నాకు. లేకపోతే హరబాబు చిలక పలుకుల్లా ఇంత చక్కగా వల్లించటం సాధ్యమా అని అన్పించింది నాకు.

"ఈడ మీరు మీటింగ్ పెట్టటానికి వీల్లేదు. ఇది జోధలోకివాస సభాప్రదేశం" అన్నాడు లెబా.

"బోడి నువ్వు చెప్పేదేందయ్యా! ఈ స్థలం అందర్దీ. నిన్న అందరమూ ఉపయోగించుకున్నాం. ఇవాళ మా సొంతం అంటే చెల్లదు'' అన్నాడు కూగాశాస్త్రి. లెబావల్ల అతనికేం ప్రయోజనమే లేదు. తద్దినాలు పెట్టడు. కనీసం అప్పూ తీసుకోడు. అలాంటి మనిషివల్ల ఎవరికేం ప్రయోజనం చెప్పండి? ప్రయోజనం లేనిచోట ఖరాఖండిగా వుంటాడు కూగాశాస్త్రి.

జైన్ కాంగోరెడ్డిని అధ్యక్షత వహించమని అర్థించటంతో కాంగోరెడ్డి కుర్చీలో కూర్చున్నాడు. బులేరావు వర్గం తప్ప అందరూ చప్పట్లు కొట్టారు. ఆ వర్గం లెబా ఇంట్లోకి వెళ్లి బయట జరిగే కార్యక్రమాల్ని పరిశీలిస్తున్నారు. కాంగోరెడ్డి లేచి ఉపన్యశించ మొదలెట్టాడు. "బులేరావు సంఘద్రోహం చేశాడు. ఈరోజు ముఖ్యమైన నిర్ణయం తీసుకోవాల్సి వుండగా, తన వర్గంవారికి మాత్రం తెల్పి, తను ఉడాయించాడు. ఫాక్షన్ లీడరుగా పనిచేశాడు కాని, సంఘ కార్యదర్శిలా కాదు. యాజమాన్యం మనందరినుండి అధికంగా కిరాయి వసూలు చెయ్యాలని సంకల్పించింది. ధరలు పెరిగే ఈ గడ్డురోజుల్లో పాతిక రూపాయల అదనపు భారం మనం భరించగలమా? ఇంతటి ముఖ్య విషయంలో నిర్ణయం తీసుకోవల్సివుండగా ఆయన తన స్వార్థం చూసుకుని, బాధ్యతారహితంగా వెళ్లిపోయాడంటే నేనింక ఆ పెద్దమనిషిని గురించి మీకేం చెప్పను? అంతేకాదు సంఘటితంగా వుండే మనలో చీలికలు తెచ్చాడు. జోధలో చరిత్రలో ఎప్పుడైనా ఇలా జరిగిందా? ఇహ అధ్యక్ష పదవి ఇచ్చి గౌరవించిన సిపిఐ శర్మగారు ఓ వర్గానికి వెన్నుకాస్తూ అధ్యక్షత వహించ నిరాకరించాడు. ఆయన ఎవరికి విశ్వాసపాత్రుడుగా పనిచేస్తున్నాడు? సంఘానికా? కాదు. బులేరావు బంటులా పనిచేస్తున్నాడు. ఆయన ప్రవర్తనను గూర్చి నేను మీకు చెప్పాల్సిందేంలేదు. మీరే మీ కళ్లతో చూశారు. కనుక మన జోధలోకివాసంకి ఇంత ద్రోహం తలపెట్టిన పాత కార్యవర్గాన్ని రద్దు చేయవల్సిందిగా మీకు విజ్ఞప్తి చేస్తూ, ఆ పాత కార్యవర్గంపై నేను విశ్వాసరాహిత్య తీర్మానం ప్రవేశపెడ్తున్నాను. అభ్యంతరమున్న వాళ్లెవరైనా మాట్లాడవచ్చు'' అన్నాడు.

ఈ పెద్దపెద్ద మాటల వెనక వున్న ఆంతర్యం తెలియని వాళ్లెవరూ అక్కడ లేరు. కాంగోరెడ్డి విషాదయోగంలో తను వదులుకున్న పదవిని, పలుకుబడిని తిరిగి ఎలాగైనా సంపాదించాలని ప్రయత్నిస్తున్నారని నాకర్థమైంది. బులేరావు అలా వెళ్లిపోవటంతో, అతనికి అవకాశం దొరికింది. ఆ సాకు లేకపోయినా మరోటి వెతికేవాడే కివాసంని చేజిక్కించుకోటానికి.

ఎవరూ మాట్లాడకపోవటంతో విశ్వాసరాహిత్య తీర్మానం సభావాది ఆమోదం పొందినట్లుగా భావించటం జరిగింది.

లెబా ఇంటి తలుపులు తెర్చుకుని పరేషాన్‌రావు, రాణి వాళ్ల భాగానికి వెళ్లారు. మిగతా వాళ్లు కిటికీలోనుండి నిక్కి చూస్తున్నారు. బయటికెళ్లిన కోదండరాం, బకష్ లోగిల్లో ప్రవేశించటం చూసి, "ఒరేయ్! ఇట్టారా'' అని

పిల్చాడు సిపిఐ శర్మ కోదండరాంను. వాడిని లోపలికి పిల్చి వాడికేదో చెప్పి పంపేశాడతను. పిల్లలిద్దరూ మళ్లీ బయటికి వెళ్లారు.

కొత్త కాకామాలో జైన్ అధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యాడు. అందరూ అతన్ని అభినందిస్తూ చప్పట్లు కొట్టారు. ఆ సమయంలో పరేషాన్‌రావు, రాణి తిరిగి వచ్చారు సభకు. తరువాత పరేషాన్‌రావు చెప్పగా నాకు తెల్సింది. ఇంటికెళ్లింతర్వాత ఇద్దరూ ఈ విషయాన్ని చర్చించారట. కాకామం నిర్ణయంకంటే ససస నిర్ణయమే గొప్పదనీ, బులేరావు అందరికీ మీటింగు పోస్ట్‌పోనయినట్టు చెప్పలేదంటే 'జరూర్ కుఛ్ దాల్ మేం కాలా హై' అన్నదట రాణి. అందుకే తిరిగి సభకొచ్చారు భార్యాభర్తలిద్దరూ.

సెక్రటరీ పోస్టుకు నామినేషన్లు పిల్చినప్పుడు రాణి కాంగోరెడ్డి పేరు ప్రపోజ్ చేసింది. ఆమె సంఘ సభ్యురాలుకాదు కనుక ఆమెకు మాట్లాడే హక్కులేదని బేగం అభ్యంతర పెట్టినా అవిశ్వాస తీర్మానం పాత కాకామం పైనే కానీ సభ్యులపై కాదని కాంగోరెడ్డి నచ్చచెప్పటంతో ఆ అభ్యంతరాన్ని తోసిపుచ్చటం జరిగింది. నేను కాంగోరెడ్డి పేరు సెకండ్ చేయటంతో ఇక మరే నామినేషన్లు లేని కారణాన అతనూ ఏకగ్రీవంగా కార్యదర్శిగా ఎన్నికైయాడు అందరూ చప్పట్లు చరిచి అతనికి అభినందనలు తెల్పుతున్న సమయంలో ఎవరో మెడికల్ షాపు మిద్దెమీదినుండి సభలోకి పేడనీళ్లు చల్లారు. సభ్యులందరూ గోలగా లేచారు. పిల్లలెవరో మెడికల్ షాపు బయటి సన్‌షేడ్‌నుండి ప్రహరీ గోడమీదకు దూకి పారిపోయినట్లు కన్పించింది.

"ఇది బులేరావు కొడుకు కోదండరాం పనే అయిుండాలి. ఇందాకవాడు ఇటు రావటం, సిపిఐశర్మ వాడికేదో చెప్పి పంపటం చూశారో లేదో మీరు'' అనరిచాడు హరబాబు,

పేడనీళ్ల చుక్కలను చొక్కామీదనుండి దులుపుకుంటూ.

చాలామంది స్త్రీ సభ్యుల చీరెలమీదా, తలల మీదా కూడా పడ్డాయి పేడనీళ్లు. వాళ్లు హాహాకారాలుచేశారు. జేబు గుడ్డల్తో మొహాలు తుడ్చుకుంటూ ఆగ్రహంగా లేచారు మగ సభ్యులు.

"వాడితోపాటు బేగం పెద్దకొడుకు అల్లా బక్ష్ కూడా వున్నాడు'' అంది కాళి.

"హమారా బచ్చా ఐసీ కర్తూత్ నహీం కరేగా'' అంది బేగం.

"పిల్లల సంగతి వదిలేయండి. వాళ్లకి తెలిసీ తెలియకా చేస్తారు. వాళ్లచేత ఇలాంటి పనులు చేయించిన వాళ్లననాలి'' అంది భాను.

"మన సమావేశం భగ్నం చేయటానికి ప్రత్యర్థివర్గం చేయించే దుర్మార్గం ఇది. కుటిల రాజకీయాలు నశించాలి'' అని నినదించాడు హరబాబు.

"భౌభౌభౌ... భౌ..." అని కుక్క అరుపు విన్పించింది లెబా ఇంట్లోనుండి. అది శర్మ గొంతు.

"బ్యా... బ్యా... బ్యా..." అని గాడిద ఓండ్రపెట్టింది. ఆ గాడిద లెబా.

"అంబా... అంబా... అంబా..." అనరిచింది రాచిప్పచెట్టి గోమాత.

"మనమీ జంతువుల అరుపులకు భయపడేదిలేదు. మన కార్యక్రమం కొనసాగిద్దాం" అన్నాడు రెడ్డి.

ఆఖరి ప్రయత్నంగా లెబా ఇంట్లో సమావేశమైన ఏడుగురూ మళ్లా సభా ప్రవేశం చేశారు.

"జంతువులకు మా సంఘంలో స్థానంలేదు'' అనరిచాడు హరబాబు.

"ఆవుపేడ, పంచితం మీదపడి, వాడి శరీరం పవిత్రమైనా, బుర్రలో మాత్రం ఏం తెలివిరాలేదు'' అన్నాడు రాచిప్పచెట్టి.

నాయకి కాళితో మంతనాలు సాగించింది.




వాళ్లిద్దరి చుట్టూ ఆడంగులు జమయ్యారు. అన్ని కొప్పులు కలసింతర్వాత ఇంక రహస్యా లుండవు. అంతా బహిరంగమే.

"అలా వీల్లేదు'' అంటోంది భాను.

"ఎందుకు వీల్లేదు. నువ్వు చెప్పవే కన్యా! మన స్త్రీల సమస్యలు వేరు. ఈ మగాళ్లు ఎంతసేపూ రాజకీయాలేగాని మన సంగతి పట్టించుకోరు. మనం వేరే జోధలో స్త్రీకివాసం పెట్టుకుందాం" అంది ఓల్గా.

"సరే నీ ఇష్టం" అంది కన్య. పెద్దక్క నుండి విడాకులు పుచ్చుకున్న తర్వాత నీటి నుండి బయటపడ్డ చేపలా గిలగిలా కొట్టు కుంటోంది ఆమె. అక్క సంధి కొచ్చాక, వేరే ఆలోచనలేం లేకుండా బుర్ర ఊపేసింది కన్య.

"నువ్వు నోర్మూయ్యవే. మొహం వాచేట ట్లు తిట్లుతిని కూడా సిగ్గులేదూ వాళ్లతో కలియటానికి'' అంది కాళి.

"యె జాల్‌మేం అబ్ నఫసేంగే..." అంది రాణి.

"ఇందులో చాల్‌లేదు, జాల్‌లేదు. మిమ్మ ల్ని ఫసాయించి పబ్బం గడుపుకోవాల్సిన అవసరం మాకేం లేదు'' అంది ఆన్నీ.

"మరెందుకొచ్చినవ్ భాయీ! నాకు సమ ఝువుతలేదు'' అన్నది బేగం, పాన్‌బీడా నోట్లో తోసి మేకలా నవ్వుతూ, చేతులు రెండూ నడుంమీద పెట్టుకుని నిలబడి.

"ఏమయ్యా కాంగోరెడ్డీ! మీరిలా సంఘా న్ని చీల్చటం ఏమంత మంచిపని. ఇలా బలహీనపడితే మనం ఏం సాధించగలం. పూర్వం అంభి పురుషోత్తమునితో కలవక..."

రాచిప్పచెట్టిని పూర్తి చెయ్యనివ్వలేదు కాంగోరెడ్డి. ఈ పాత కథలన్నీ మీరు చెప్పగా విని మా తల బొప్పికట్టింది. ఇంకా వినే ఓపిక లేదు మాకు. అసలు చీలికలు తెచ్చింది ఎవరయ్యా? మీరు..." అన్నాడతను.

'యె సబ్‌క్యోం భాయీ! తుమేం ఔర్ హమేం నహీం బన్‌రహే. దోస్తీసే అలగ్ హెూజాయెంగే' అన్నారు జైన్.

"ఈ వేర్పాటు ధోరణి మానుకో. దేశాన్ని ముక్కలు చేశారు చాలదా?" అన్నాడు రాచి ప్పచెట్టి.

"కోన్‌కరే ముల్క్‌కీ బంట్‌వారా? తుం ఔర్ తుమారే రహనుమాంయేం' అన్నాడు జైన్.

"ఈ మాటలన్నీ అనవసరమయ్యా! ఇహ మీకూ మాకూ కుదర్దు. మా సభను ఇలా ప్రశాంతంగా నడవనివ్వండి'' అన్నాడు కాంగోరెడ్డి.

"అట్టా వీల్లేదు. మేమూ సభ్యులమే. మే మూ సభలో పాల్గొంటాం" అన్నాడు లెబా.

"మంచిది మాకేం అభ్యంతరంలేదు'' అన్నాడు కాంగోరెడ్డి.

రాచిప్పచెట్టి అండమ్మతో తమిళంలో మా ట్లాడుతున్నాడు (మీరు వాళ్లతో కలవొద్దు. కాంగోరెడ్డి చేసేదంతా అన్యాయం. మనం తమిళులమంతా ఒకటి. మీరు మా పక్షమే వుండాలి) అనన్నాడతను.

"అప్పిడి శొల్లవాండాం చెట్టియార్! నన్రా ఇరక్కాదు. అనాలుం బులేరావు పండ్రదు నల్లకార్యమా?" (అలా అనకండి చెట్టిగారూ! బావుండదు. అయినా బులేరావు చేసింది మంచిపనా?) అంది అండమ్మ.

"ఇదుగో వీళ్లేదో అరవంలో బుడబుడలా డుతున్నారు. అండమ్మత్తని మీతో కలుపుకోవా లని ప్రయత్నమా! అరవబుద్ధి పోనిచ్చుకు న్నావుకాదు రాచిప్పచెట్టీ' అన్నాడు హరబా బు.

దాంతో మరేం మాట్లాడక పక్కకు తొలగి పొయ్యాడు రాచిప్పచెట్టి.

కాంగోరెడ్డి "ఆర్డర్... ఆర్డర్' అని బల్ల మీద చరిచి మహిళా ప్రతినిధికై నామినేషన్లు కోరాడు. మళ్లీ అన్ని పదవులకూ ఎన్నికలు జరగాలని పట్టుబట్టింది బులేరావు వర్గం.

"రెడ్డొచ్చె మొదలెట్టన్నట్టు, ఎన్నికలు మళ్లీ మొదలెట్టటానికి వీల్లేదు'' అన్నాడు కూగాశా స్త్రి.

"ఇక్కడ రెడ్లెవరూ లేరు'' అంది ఆన్నీ.

"రెడ్లు కాకపోతే బాపనోళ్లు, కమ్మోళ్లు, కోమట్లూ ఉన్నారుగా'' అంది కన్య.

"ఈ అగ్రకులాలు తరతరాలనుండి మమ్మల్నణి చేస్తున్నాయి. కుల దురహంకారం నశించాలి'' అన్నారు హరబాబు.

"ఇప్పుడు మీరు మమ్మల్ని రిజర్వేషన్ల పేరుతో అణిచేస్తున్నారు'' అంది ఓల్గా.

"అది అణిచేయటంకాదు. మీరు తరతరాలనుండి చేసుకున్న పాపాన్ని కొంత కడిగేసుకుంటున్నారు'' అన్నాడు పరేషాన్‌రావు.

"ఓహెూ నీకూ పొడిచేసుకొచ్చింది. మీ బి.సిలకేం మాయరోగమయ్యా'' అన్నాడు చెట్టి.

"మీ ఎఫ్.సిలకు మేం హాయిగా బతకాలని లేదు. తరతరాలనుండి వస్తున్న హక్కులు పోయాయని ఏడుస్తున్నారు'' అన్నాడు పరేషాన్‌రావు.

"కులప్రసక్తి అనవసరం. ఇప్పుడు జరగాల్సినవి ఎన్నికలు. సభ్యులు వస్తూ వుంటారు, పోతూ వుంటారు. మెజారిటీ సభ్యులు మళ్లీ ఎన్నికలు జరపాలంటే మళ్లీ జరపండి. లేకపోతే మిగిలిన ఒక్క పోస్టుకేనంటే దానికే జరపండి'' అన్నాను నేను.

కాంగోరెడ్డి బృందానికి నా సలహా నచ్చలేదు. బులేరావు వర్గానికి పచ్చివెలక్కాయ గొంతుకు అడ్డం పడ్డట్టయింది. వాళ్ల వర్గానికి పడే ఓట్లున్నాయి. ఓటింగ్ తీసుకుంటే వాళ్ల ప్రతిపాదన వీగిపోవటం ఖాయం.

"ఇంత చిన్న విషయానికై ఓటింగెందుకండీ'' అన్నాడు అమాయకంగా లెబా.

"మరి ఓటింగూ వద్దు, మా మాటే అందరూ వినాలంటే అదేం ప్రజాస్వామ్యమండీ'' అన్నాడు పరేషాన్‌రావు.

"ఇదుగో పరేషాన్‌రావూ! సిగ్గు లేదుటయ్యా! ఇప్పటిదాకా మా పక్షానవుండి, ఇప్పుడటు తిరిగిపోటానికి. ఏం ఆశ చూపారో వాళ్లు'' అన్నాడు రాచిప్పచెట్టి.

"బుద్ధి లేనందుకు, మీతో చేరినందుకు సిగ్గుపడాలి. మీనుండి బయటకొచ్చినందుకు సిగ్గుపడక్కర్లేదు. ఎవరు ఏం ఆశ చూపినా నేను లొంగే మనిషిని కాదని గుర్తుంచుకో'' అన్నాడు పరేషాన్‌రావు.

"బూర్జువా మనస్తత్వం ఉన్న మనుషులు కాపిటలిస్ట్‌ల ఏజెంట్లు'' అన్నాడు సిపిఐ శర్మ. ఏంచేయలేని పరిస్థితుల్లో ఉపయోగించే కమ్యూనిస్ట్ పదజాలపు బాణాలవి.

"నువ్వు మాట్లాడేదానికి తలా తోకా ఏమన్నావుందా? ఇక్కడ బూర్జువాలెవరు, కాపిటలిస్టు లెవరు? మంది కిరాయివాసుల సంఘం. అంతేగాని తప్పుడు కూతలు కుయ్యకు'' అన్నాడు పరేషాన్‌రావు.

"నువ్వుండవయ్యా! నీకేం మాట్లాడాలో తెలీదు. పరిస్థితి చెడగొడ్తావు'' అన్నాడు రాచిప్పచెట్టి.

"నీ రియాక్షనరీ మొహానికి నాకంటే ఎక్కువేం తెల్సు. నోరు మూసుకో'' అన్నాడు సిపిఐ శర్మ.

"నీ రివల్యూషనరీ మొహం చేసే నిర్వాకం తగలడినట్టే వుంది. ఒకప్పటి కాంగ్రెస్ తొత్తు అయిన పార్టీ జాతీయ స్థాయి నుండి ప్రాంతీయ స్థాయికి దిగి తెలుగుదేశం తొత్తయింది. మంచి రివల్యూషనే సాధించావులే'' అన్నాడు రాచిప్పచెట్టి కోపంగా.

"మనలో మనకు తగాదాలెందుకూ జరగాల్సింది చూడాలిగానీ'' అన్నాడు లెబా.

"నువ్వు నోర్మూసుకోవయ్యా! నువ్వు, నీ పార్టీ మాత్రమేం తక్కువ తిన్నారు. ఓపక్క బూర్జువా పార్టీ అని తెలుగుదేశాన్ని తిడ్తూనే, నాలుగెంగిలి మెతుకులకోసం వాళ్ల కొమ్ము కాస్తున్నారు'' అన్నాడు చెట్టి కోపంగా.

రెడ్డి బల్ల చరిచి ఎన్నికైన పదవులకు మళ్లీ ఎన్నికలు జరగవనీ, ఒక్క మహిళా ప్రతినిధికి మాత్రం నామినేషన్లు వెయ్యవల్సిందిగా కోరటంతో, 'నేను ఈ సమావేశం చట్టబద్ధం




కాదని భావిస్తున్నాను. ఎన్నికైన కార్యదర్శి వుండగా, మళ్లీ ఎన్నికలు జరపాలని చూడటం ప్రజాస్వామ్యాన్ని నిలువుగా గోయి తవ్వి పాతిపెట్టటం, సంఘ ఐక్యతను దెబ్బతీయాలనే దుష్ట శక్తులతో నేను సహకరించలేను. నేను అక్రమమని భావించే ఈ సభనుండి నా వ్యతిరేకత తెల్పుతూ నిష్క్రమిస్తున్నాను'' అని విసురుగా బయలుదేరింది మణి. తప్పక, ఆమెతోపాటు సిపిఐ శర్మ, ఓల్గా, లెబా, ఆన్నీ సభనుండి లేచి వెళ్లిపోయారు. తన భర్త వీళ్లందరిమీద భారం వేసి ఊరికి వెళ్తే వాళ్లల్లో ఒక్కడూ పరిస్థితిని తమకనుకూలంగా తిప్పగలిగే రాజకీయ పరిజ్ఞానం లేని చవటల్లాగా కన్పించారామెకు.

మహిళాప్రతినిధిగా రాణీ ఏకగ్రీవంగా ఎన్నికైంది. సభ ముగిసింది.

జనం నిట్టూర్పు విడిచి లేచారు ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోవటానికి. అప్పుడే పిల్లలందరూ మెట్లు దిగి వస్తున్నారు. జోషువాగారు సిగార్ పొగ గుప్పు గుప్పున వదుల్తూ పైనుండి కిందకు చూస్తున్నారు.

"జోషువాగారూ! థాంక్యూ ఫర్ద బేబీ సిట్టింగ్' అన్నాను.

"ఇట్స్ బెటర్ జాబ్ దాన్ వాట్ యు డిడ్ డౌన్‌స్టెయిర్స్'' అన్నాడాయన చిద్విలాసంగా నవ్వుతూ.

★ ★ ★

ఆరోజు హోలీ పండగ సందర్భంగా సెలవు. జోధలో సందడిగా వుంది. అల్లాబక్ష్, కోదండరాం, చంద్రశేఖర్, రాములు మూలమూలల దాక్కున్నవాళ్లని కూడా వెతికి రంగులు పూస్తున్నారు. మైకేల్, అక్షనాథ్‌లు గులాల్ చల్లుతున్నారు. అప్పటిదాకా మూలమూలల దాక్కున్నవాళ్లు ఒకసారి రంగు వంటిమీద పడ్డ తర్వాత చలి వదలినట్లయి, విజృంభించి రంగులు పూస్తున్నారు మిగతా వాళ్లకు. 'వద్దు, వద్దంటున్నా వినక మా ఇంటికొచ్చి నాకూ రంగులు పులిమారు. మా ఇంటి వెనుక పెద్దగా ఆడవాళ్ల మాటలు వినపడటంతో ఏమిటా అని అటు వెళ్లాను. తమ ఇంటి భాగానికి ఎదురుగా వున్న పునాది



గోడమీద నిలబడివుంది ఓల్గా. అటువైపు తమ ఇంటి భాగానికి ఎదురుగా వున్న పునాది గోడమీద నిలబడివుంది కాళి. ఇద్దరూ చేతు లూపుకుంటూ బిగ్గరగా అరుస్తున్నారు. రోజీకి వద్దన్నా వినకుండా రంగులు పులిమాట్ట అక్షనాధ్. అది కథకు నాంది.

"వయసొచ్చిన పిల్లమీదపడి అట్టా రంగు లు పుయ్యటమేంది? నీ కొడుకునదుపులో పెట్టుకో. అంత వళ్లు కొవ్వెక్కి వుంటే ఊరి మీద పడమను. నా పిల్లల జోలికొస్తే నేను ఊర్కోను'' అంటోంది కాళి.

"గయ్యాళి మొహందానా! నీ కూతుర్ని అదుపులో పెట్టుకోలేక నా కొడుకునంటావు. వాడు మొగాడు. సరదాగా అందరికీ రంగులు పూసినట్టే నీ కూతురిమీదా చల్లాడేమో! అంత ఘోషావుంటే గదిలో పెట్టి తాళం వేసుకోలేకపోయావా కూతుర్ని'' అంది ఓల్గా.

ముఖాలకు రంగులు పులుముకునున్న జనం ఒక్కొక్కరూ రాసాగారు.

"ముందు అక్కే పూసింది నాధుమా మకు'' అన్నాడు రాము.

"నేనేం పూయలేదు'' అంది తమ్ముణ్ణి ఓ మొట్టికాయ మొట్టి రోజీ.

"నువ్వు పూయలేదులే. రంగులు చల్లావు'' అన్నాడు అక్షనాధ్.

"అక్కాయ్! అబద్ధమాడకు. నువ్వే ముందు రంగులు పూశావు'' అంది శర్మ కూతురు లోలిత.

"అదో వింటున్నావా? మొదలెట్టింది నీ కూతురేనంట. నీ కూతురే చెప్తోంది'' అంది కాళి.

"మరి నీ కొడుకేం చెప్పాడు. రోజీనే ముందు రంగులు చల్లిందట" అంది ఓల్గా.

"వొ మైకేల్ క్యాకరా దేఖీ? మేరీ రోషన్‌పే రంగ్ ఛిలక్ రహాథా. మైc మనాకరా తొ భాగ్ నికలా'' అంది బేగం.

"మా మైకేల్ పైనుండి కిందకే దిగలేదు. రోషనే వచ్చి వాడిమీద రంగుపోసింది'' అంది పైనుండి మిద్దె దొరసాని.

"వచ్చాను. నీకు రంగు పూశాను కానీ మెకేల్‌కు పూయలేదు'' అంది రోషన్ ముక్కు ఎగబీలుస్తూ.

'రంగ్ జమాయెతో హువాక్యా
కపడా ఖరాబ్ హువే తోక్యా
కర్‌దియే హెరా మేరే దిల్‌కో రోషన్
డర్‌కాయ్‌కీ సచ్ బోలో తో సహీ రోషన్

అని పైనుండి కవిత్వం చదివాడు మైకేల్.

"ఓరి బరితెగించినవాడా! వయసొచ్చిన ఆడపిల్లమీద రంగులు చల్లటమేకాక కపిత్వం చదువుతున్నావా? కపిత్వం" అంది కాళి మెటికలు విరుస్తూ.

"శహభాష్, శహభాష్'' అని చప్పట్లు కొట్టింది రాణి, మైకేల్ కవిత్వాన్ని మెచ్చు కుంటూ.

"అరె సైతాన్! నీచే ఉతర్. తేరే ఖాల్ ఉఖాడ్ దూంగా'' అనరిచారు జైన్ కోపంగా.

"షటప్ రాస్కెల్! నా ఇంట్లో ఉండి నా మనమడి చర్మం వలుస్తానంటావా భాడ ఖోవ్' అనరిచాడు జోషువాగారు.

"ఇదుగో కాంగోరెడ్డీ! నీ కూతుర్ని అదు పులో పెట్టుకో. జరగరానిదేమన్నా జరిగితే నా బాధ్యత లేదు'' అన్నాడు సిపిఐ శర్మ.

"ఏం జరుగుతుందయ్యా జరగరానిది. మాది నిప్పులాంటి వంశం. పాడుబుద్ధులు మా ఇంటా వంటా లేవు'' అన్నాడు కాంగోరె డ్డి.

"మీరట్టా చూస్తూ కూర్చోండి. జరిగేదెట్టా గో జరిగిపోతుంది'' అన్నాడు బులేరావు.

"ఏం జరుగుద్దయ్యా! అదేందో చెప్పు'' అన్నాడు కాంగోరెడ్డి.

"మొన్న సినిమా హాల్లో వీళ్లిద్దర్నీ చూశా ను. ఆ నవ్వులు, ఆ కబుర్లు... నేను చెప్పలే ను'' అన్నాడు బులేరావు.

"ఏరా నిజమా!" అడిగాడు సిపిఐ శర్మ కొడుకుని.




"అవున్నిజమే. కలిసి సినిమా చూస్తే తప్పేంవుంది?" అన్నాడు అక్షనాథ్.

"ఓసి త్రాష్టపు మొహందానా? నలుగుర్లో తలవంపులు తెచ్చావు గందే. నీకు చదువొద్దు, పొద్దొద్దు ఇంట్లో పడిచావు" అని కాళి కూతుర్ని ఈ చెంపా ఆ చెంపా వాయించి జుట్టు పట్టుకు ఈడ్చుకు వెళ్లింది ఇంట్లోకి.

"కలిసి చూస్తే తప్పు లేదురా గాడిదా? పెళ్ళీడుకొచ్చిన పరాయిపిల్లతో తిరగటానికి సిగ్గు లేదట్రా! మన వంశమేమిటి, మన కులమేమిటి? నీకా పిల్ల కావల్సి వచ్చిందిరా" అని కోపంగా కొడుకునొక తోపు తోశాడు శర్మ.

"మధ్య పసివెధవ వాడినంటారెందుకండీ! ఆ పిల్ల బోగం హొయలు చూపి వీణ్ణి వల్లో వేసుకుంది. ముదనష్టపు జాతి! వంశనాశనం గాను! ఈ తద్దినం మాకెక్కడ దాపురించిందంట" అని గుండెలు బాదుకుంది ఓల్గా.

"ఏవమ్మోయ్ నోరు సంబాళించుకు మాట్లాడు. నీ కులం నీకు గొప్పయితే, నా కులం నాకు గొప్ప. ఆ బోగం టక్కులన్నీ మీవాడి దగ్గరే వున్నాయి. ఏం తెలీని పిల్లని వాడే వలలో వేసుకున్నాడు" అని తనవైపు పునాది గోడమీదకు దూకాడు కాంగోరెడ్డి.

"ఏం కొడతావా! రా చూస్తాను. ఇవ్వాళ నువ్వో నేనో తేలిపోవాలి" అన్నాడు సిపిఐ శర్మ.

"బుద్ధిలేకపోతే సరి! ఇప్పుడేం కొంపలు ముంచుకు పొయ్యాయనీ ఈ గోల" అన్నాడు లెబా.

"నీకేమయ్యా చెప్తావు. అందరూ నీలా తయారవాలనా నీ ఉద్దేశ్యం?" అన్నాడు సిపిఐ శర్మ.

"ఇదుగో నా ఇంట్లో కొట్లాటలు పనికిరావు. ఏదో చిన్న పిల్లలు కలిసి సినిమా చూస్తే పుట్టి మునిగిపోయినట్టు గోలెడుతున్నారు ఇద్దరూ" అన్నాడు పైనుండి జోషువాగారు.

"పైన కూర్చున్న నీకేం కన్పిస్తుంది. పాపం పిచ్చిమొహంది, రోషన్నలా వదిలేయండి నువ్వూ, నీ మనమడూ" అంది ఆన్నీ.

"ఏం నేనూ, నా మనమడేం చేశాం?"

"ఏం చేశాడో అందరికీ తెల్సు. ఇందిరాపార్కులో మనకు కనపడలేదుటండీ ఈ జంట. చెప్పలేం" అంది ఆన్నీ.

"ఏమో నాకు తెలీదు" అన్నాడు లెబా.

"సత్యం చెప్పటానికి భయమెందుకండీ? ఏం నాయకీ! నువ్వయినా చెప్పు. జైన్, బేగమయినా కూతుర్ని అదుపులో పెట్టుకుంటారు. ఆ మైకేల్‌కెట్టాగో అదుపు లేదు. అచ్చోసిన ఆంబోతులా ఊరిమీద వదిలారు" అంది ఆన్నీ.

"అవును ఇద్దరూ వచ్చి మూడోనంబరు బస్సులో వెళ్ళటం నేనూ చూశాను" అంది ఝాన్సీ.

"అరె చెప్పరా బకష్! మీ అక్క ఉత్తరాలు రాసి మైకేల్‌కు పంపిస్తుందా లేదా?" ఆన్నీ గదమాయించింది.

"దీదీ కాయితమిస్తే మైకేల్ మామకిచ్చాను" అన్నాడు చిన్న మొహంతో వాడు. తాను చేసిన తప్పేంటో వాడికర్థం కాలేదు.

"అరె దేఖోనాజీ క్యా హెూరహా హై? దునియా డూబ్‌రహా ఔర్ హమేఁ పతానహీఁ మేరీ మాసూం బచ్చీకో భడకారహా హై యే హరాంఖోర్, సైతాన్..." అని తిట్లకు లంకించుకుంది బేగం.

"మధ్యవాడిని తిట్టటమెందుకమ్మా! వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారు. పెళ్ళి చేస్తే పోలా?" అన్నాడు అక్షనాథ్, తన విషయం కూడా తల్లిదండ్రులకు సూచనచేస్తూ.

"ఛుప్ హెూజావ్! షాదీ హెూగీకైసీ? వో క్రిశ్చిన్, హం ముసల్మాన్" అన్నాడు జైన్.

"ముసల్మాను గొప్పేంటి, కిరస్తానీ తక్కు

వేంటి? పెళ్ళికేం ఆటంకం" అన్నాడు అక్ష నాథ్.

"అరె సైతాన్‌కి ఔలాద్! ముసల్మాన్‌కి ఇజ్జత్ తీస్తావ్‌బే..." అని అరుస్తూ రంగు కలిపిన నీళ్ళ బక్కెట్ అక్షనాథ్‌మీద గుమ్మరించింది బేగం.

అక్కడితో మొదలయింది లోగిలిలో హెూలీరంగుల హేల. పాంటుజేబులో వున్న బుక్కాపొట్లం తీసి తడిచేత్తోనే బేగం, జైన్లమీద చల్లాడు అక్షనాథ్. జైన్ నల్లటి గడ్డంకెంపులా మెరిసింది. మైకేల్ పిచికారితో అందరిమీద రంగులు చల్లుతున్నాడు. పిల్లలు రంగులతో తృప్తిపడలేదు. ఎక్కడ సంపాదించారో పెయింట్లు పులుముకోవటం మొదలెట్టారు. బకష్ రామచిలుక ముఖమంతా ఎనామిల్‌తో పులిమి, "అక్క తెల్లగా వుంది'' అని కూడా వ్యాఖ్యానించాడు. "గుమ్మమెక్కితే కాళ్లు విరగ్గొడతాన"ని ఆన్నీ బెదిరించినా వినకుండా ఆమెకూ, లెబాకు రంగులు పులిమారు పిల్లలు. కన్య ఎక్కడ తన మొగుడు రామచిలుక జోలికెళ్తాడేమోనని జాగ్రత్తపడి హరబాబును కట్టడి చేసింది.

స్నాన, భోజనానంతరం ఓ కునుకు తీసి లేచానో లేదో జైన్ వచ్చాడు. "పోనీసాబ్! సోరహే క్యా'' అంటూ. అతని ముఖం వేలాడిపోయివుంది. జీవితంలో విలువైందేదో పోగొట్టుకున్నట్టుగా వుంది అతని ముఖం. అతని మాటల సారాంశమిది. "పెళ్ళి చేసుకుంటే మైకేల్‌నే చేసుకుంటాను. నన్ను కొట్టి తిట్టి మమ్మల్ని వేరుచెయ్యగలమని భావించకండి. అతనికేమన్నా నష్టం వాటిల్లితే మీ కూతురు మీ కూతురు కాదు. నన్ను ఇంట్లో పెట్టి తాళం వేద్దామనుకుంటే మాత్రం మీవల్ల కాదు. లేచిపోయి పెళ్ళి చేసుకుంటాం" అందట రోషన్. పుట్టిన తర్వాత ఒక్క తిట్టు కూడా తిట్టి ఎరుగని బేగం కూతుర్ని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టి, కొట్టి అలసిపోయింది.





జైన్ ఆమెను పక్కకు లాగాడు కానీ, రెండు దెబ్బలు అతనికి కూడా పడ్డాయి. అతను చెప్పిన ఉర్దూ మాటల సారాంశమిది. "దానికేం తెల్సు పసిపిల్ల. అదట్లాగే అంటుంది. నాకు రెండు మార్గాలు కన్పిస్తున్నాయి పోనీబాబు! పిల్లని మా భాయిజాన్ ఇంటికి పంపిస్తాను. ఆయన బీదర్లో వుంటాడు. ఆ మైకేల్ నుండి విడగొడ్తే కొద్దికాలంలో ఈ ప్రేమ దోమలన్నీ మర్చిపోతోంది. లేకపోతే ఇప్పుడే దానికి వేరే పెళ్ళి చేసేస్తాను''

"ప్రాక్టికల్‌గా లేవయ్యా నీ ఆలోచనలు. ఇద్దరికీ మతం పట్టింపులు లేవని నువ్వే చెప్తున్నావు. వాళ్ళే లేచిపోయి పెళ్ళి చేసుకుంటే ఎంత అప్రతిష్ట! ఆలోచించు'' అన్నాను.

"షాదీ కైసా హెూగా భయీ! ముల్లాకే సామ్‌నే యా క్రిశ్చిన్ ఫాదర్ సామ్‌నే. అగర్ షాదీ కర్‌లియేతోభీ వో క్యాహెూతే- ముస్లిం, యా క్రిశ్చిన్?"

"ఇన్సాన్ హెూతే భాయీ..." అని నేను ఏదో చెప్పబోతున్నాను, ఇంతలో సిపిఐ శర్మ వచ్చాడు.

నాతో మాట్లాడటం అతనికి ఇష్టం లేకపోయినా, రాజకీయ మిత్రులతో సంప్రదించలేని క్లిష్టపరిస్థితి రావటంతో నా దగ్గరకు వచ్చాడతను. రావటంతో సమస్యా పరిష్కారమవుతుందని అతను భావించలేదు. మనసులో బాధని, బరువును పంచుకునే వ్యక్తి 'జోధలో'లో మరెవరూ కన్పించక నా దగ్గరకు వచ్చాడు. బులేరావు 'నీ కొడుకుని అదుపు ఆజ్ఞల్లో పెంచలేదని' అవహేళన చేస్తాడు. తన పిల్లల్ని క్రమశిక్షణలో పెంచుతున్నానని అతనికి గర్వం. పైగా ఈ వ్యవహారాన్నంతా బట్టబయలు చేసింది అతనే. రాచిప్పచెట్టి మనిషి సహృదయుడే కాని సనాతనుడు. అటు సంప్రదాయం, ఇటు హేతు దృక్పథం- ఏదీ వదులుకోలేక త్రిశంకుస్వర్గంలో వున్న సిపిఐ శర్మకు అతను ఛాందసుడుగా కన్పడతాడు. అందువల్ల అతను చెట్టితో తన గోడు వెళ్లబోసుకోలేదు. లెబాకు పిల్లల్లేరు. తల్లి

దండ్రుల మనస్తత్వం అతనికి తెలీదు. పైగా అతనిదీ ప్రేమ వివాహమే. అతన్నుండి తన క్కావల్సిన సలహా రాదు. పైగా ఆన్నీ సరైన మనిషి కాదు. ఏదో కుంటికూత కూస్తుంది. హరబాబు, పరేషాన్‌రావులు ఇంకా పిల్లకుంక లు. కూగాశాస్త్రితో తద్దినాలు పెట్టించుకుంటా రు. కాని ఇలాంటి వ్యవహారాలు మాట్లాడలే రు. అక్షనాథ్ రోజీనే పెళ్లి చేసుకుంటానన్నా డట. "మరి మీరే పెళ్ళి చేయండి'' అన్నాను.

"పెళ్ళెట్టా చేస్తామండీ... ఒక కులం కాదు, గోత్రం కాదు..." అన్నాడు సిపిఐ శర్మ.

"మీరు చెయ్యకపోతే వాళ్లే చేసు కుంటారేమో?"

"ఆ చేసుకుంటారు. పెళ్ళి చేసుకుని ఏంపె ట్టి తింటారు, ఉద్యోగం సద్యోగం లేదు. చదువే ఇంకా పూర్తికాలేదు. ప్రేమ తిని బతకాలి. పెళ్లి గిల్లీ అన్నాడంటే తన్నితగలేస్తా ను ఇంట్లోనుండి'' అన్నాడు సిపిఐశర్మ కో పంగా, మనిషి లోపల సగం చచ్చిపోయివు న్నాడు.

"దాంతో సమస్య పరిష్కారం కాదండీ. మీరు లెఫ్ట్ లీనింగ్సున్నవాళ్లే ఇట్టా మాట్లాడితే ఎలా?"

"నై పోనీబాబూ! సియాసత్‌కీ బాత్ అలగ్ హై, ఘర్‌కా మామ్లా అలగ్ హై'' అన్నాడు జైన్.

"అటు కాదూ, ఇటు అవును అన్న పరిస్థితి పోనీబాబూ! ఏం చేయాలో తోచటం లేదు'' అన్నారు సిపిఐ శర్మ. అది పూర్తి కన్‌ఫెషన్. అంత నిజాయితీగా జీవితంలో అతనెప్పుడూ మాట్లాడలేదు.

"ఒకపనిచేస్తే, జోషువాను, కాంగోరెడ్డినీ కూడా సంప్రదిస్తే ఏదయినా ఆలోచన రావ చ్చేమో... వాళ్లు కూడా ఇన్‌వాల్వ్‌డ్ పార్టీస్‌క దా'' అన్నాను.

"ఠీక్‌హై మాట్లాడటానికేంది. కాని యా దుంచుకో. ఆ మైకేల్ బచ్చా ముసల్మాన వ్వాలి. అక్క గైర్‌ముసల్మాన్‌కీ షాదీ చే స్కుంది. బాకీ పిల్లల్కి షాదీ కైసాహెూగీ?' అన్నాడు జైన్.

"ఆయనన్నది నిజమే. మా లిల్లీ పెళ్లి కూడా కావాలి కదా! అన్న వేరే కులందాన్ని చేసుకుంటే చెల్లెలికెట్లా పెళ్ళవుతుంది. అంద రూ వేలెత్తి చూపరూ'' అన్నాడు సిపిఐ శర్మ.

"నేనో మాటంటాను. మీరిద్దరూ ఏం అను కోకపోతే... మనం పిల్లల్ని కంటాం. వాళ్ళ కోసం కాదు, మనకోసం. జీవితంలో మనం వాళ్లకేం సంపాదించిపెట్టగలం? చదువుకి డబ్బు ఖర్చుపెడ్తాం. వీలయితే తగిన వాతా వరణం కల్పిస్తాం. చదువుకోవల్సింది వాళ్లేక దా. పోనీ వాళ్ళకు పెద్ద పెద్ద ఉద్యోగాలు కట్టబెట్టగలమా? వాళ్ళ జీవితం హాయిగా వెళ్ళిపోయేంత డబ్బు కూడబెట్టి ఇవ్వగల మా? ఇచ్చినా వాళ్లు దాన్ని కాపాడుకునేట్టు చేయగలమా? భవిష్యత్తులో రాబోయే ప్రమా దాలనుండి వాళ్లను మనం రక్షించగలమా? మనకంటే ఓవిధంగా పక్షులు, జంతువులు నయం. పిల్లలకు ఆహారం వేటాడటం నేర్పి, వాటి బతుకు వాటిని బతకమని వదిలేస్తా యవి. మనం మాత్రం మన పిల్లలు మన ఆలోచనలకనుగుణంగా బతకాలని కోరు కుంటాం. దిసీజ్ ఇర్రేషనల్' అన్నాను.

"హంహం పాలే, పోసే, బడేకియే. హం భీతో ఉన్కే భలా చాహతే హైం, బురాన హీం... కంసేకం యెతో సమఝనా చాహియే ఉన్హే' అన్నాడు జైన్.

"నిజమే. కానీ మనం పిల్లల్ని ఒంటి స్థంభం మేడలో వుంచి పెంచలేం. బయటి పొల్యూషనుకు పిల్లలు చెడిపోతారని, ప్ర పంచానికి వాళ్లు ఎక్స్పోజ్ కాకుండా పెంచ లేం. నిజానికి ఒక్క మన ఇన్‌ఫ్లుయెన్స్‌తోనే కనుక వాళ్లు పెరిగితే వాళ్లు వికృత స్వరూపు లవుతారు. సమాజం వాళ్లకి మనమిచ్చేదాని కంటే మరెంతో అధికంగా ఇస్తోంది. వాళ్లే అధికంగా జీవితంలో సాధించవల్సివుండగా వాళ్ళని మనం శాశించి ప్రయోజనమేంటి?

పైగా మీ విషయంలో ఓ అనుకూల పరిస్థితి వుంది. రోజీ ఎలాంటి పిల్లో, మైకేల్ ఎలాంటి పిల్లవాడో మనకు తెల్సు. ఎప్పటినుండో చూస్తున్నాం వాళ్లని. మీకు తెలీని వేరే పిల్లని ప్రేమించి అక్షనాథ్ పెళ్లి చేసుకుంటాడను కోండి. ఆ పిల్ల 'అత్తమామల్తో నాకేం పని. నా మొగుడే నాకు సర్వస్వం. నేను వాళ్ళింటికే రాను. వాళ్ళ ముఖమే చూడను' అంటే మీరేం చేయగలరు? అబ్బాయిని సాధించగల రు. ఆ పిల్లవాడు ఎటూ చెప్పలేక నలిగిపోవ టంకంటే జరిగేదేం లేదు. రోజీ ఎలాంటి అమ్మాయో మనకు తెలుసు. అలాంటి మొండితనం, మూర్ఖత్వం లేదు ఆమెలో మంచి పిల్ల. ఇంకా మైకేల్ విషయానికొస్తే చక్కని తెలివితేటలు, ఆలోచనలు, నడత వున్నవాడు. అతనిలో వంక పెట్టటానికే వీల్లే దు. నేనూ మీలాంటివాడినే, కన్జర్వేటివ్‌నే. మార్పును అమాంతంగా స్వీకరించలేను. మీరున్న పరిస్థితుల్లో నేనుంటే ఐ ఛూజె లెస్సర్ ఈవిల్. కులంపిల్ల, పిల్లవాడు కాకపో యినా, మనలో కలిసిపోయే వాళ్లయితే అంత కంటే కావల్సిందేమీ లేదనుకుంటాను'' అన్నాను.

"సరేనయ్యా! పద మాట్లాడదాం" అన్నా డు సిపిఐ శర్మ అయిష్టంగా.

కాంగోరెడ్డికి మా అబ్బాయి విరిచేత కబు రుపంపి. మేం ముగ్గురం జోషువాగారింటికె ళ్ళాం.

"రా... రా... నీ కోసమే చూస్తున్నాను. నువ్వూ, నీ కూతురూ ఇంత బద్మాషులనుకో లేదు'' అంటూ ఆహ్వానించాడు జోషువాగా రు.

"హం నహీం... తూ ఔర్ తేరే పోతేహీ బద్మాష్..." అన్నాడు జైన్ తానూ కోపంగా.

"ఏమనుకున్నావ్‌బే నా గురించి. రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యంలో తరిఫీదు అయినవాణ్ణి. తుపాకితో కాల్చిపారేస్తాను, నిన్నూ, నీ కూతుర్నీ..." అన్నాడు జోషువాగా రు ఆవేశంగా.

"అరె ఛుప్. హం క్యా కం హైం? హిందూ స్తాన్‌కో సైకడోంసాల్ హుకూమత్ కరేసో జాత్‌హై హమారా. హమారా ఖాన్‌దాన్ క్యా హై, అంగ్రేజోంకీ గులాంగిరీ కరేసో తుమారా ఖాన్‌దాన్ క్యాహై. హంభీ కతల్‌కర్‌దేంగే. తుమే ఔర్ తుమారే పోతేకోభీ'' అన్నాడు జైన్ మరింత ఆవేశంగా.

ఇంతలో కాంగోరెడ్డి వచ్చారు. వస్తూనే సిపిఐ శర్మని చూసి, అతని దగ్గరకు దూకుడు గా వచ్చి, అతని చొక్కా కాలరు పడిసిపట్టుకు న్నాడు. "అరేయ్ బాపనోడా! జాగర్త నీ కొడుకుని అదుపులో పెట్టుకో. లేకపోతే రేపీపా టికి నీ కొడుకు కాళ్ళూ చేతులూ విరుగుత య్యి''

సిపిఐ శర్మ కాంగోరెడ్డి నొక్కతోపు తోశా డు. "నువ్వే నీ కూతుర్ని అదుపులో పెట్టుకో. ఇక్కడ చేతులు ముడుచుకు కూర్చున్నవాళ్ళె వరూ లేర్రా రెడ్డినాయాలా" అన్నాడు కో పంగా.

"మా రెడ్డోళ్ళ ప్రభుత్వం పడిపోయిందను కోకు. దేహశుద్ధి చేయిస్తాను''

"పోరాపో. తక్కువ కులంలో పుట్టిందికాక నీ నోటికి పెద్ద మాటలు కూడానా?"

"నీదేరా తక్కువ కులం. 'దేహీ' అని యాచిస్తే మేం వేసిన బిచ్చంతో బతికిన కులం మీది''

ఆవేశంతో లేచిపోతున్న వాళ్ళని మేం ముగ్గురం సర్దిచెప్పటానికి ప్రయత్నించాం.

"ఆగండి. మీ ఇద్దరికీ ఈ పెళ్లి ఇష్టంలేదు, అంతేకదా'' అనడిగాను.

"ముమ్మాటికీ ఇష్టంలేదు. కులం తక్కువ వాడికి పిల్లనెలా ఇస్తాం" అన్నాడు కాంగోరెడ్డి.

"కులం తక్కువ పిల్లను చేసుకోవాల్సిన అవసరమూ నాకు లేదు'' అన్నాడు సిపిఐ శర్మ.

"మరి మీ మాట వినకుండా వాళ్లు పెళ్ళి చేసుకుంటే మీరేం చేస్తారు?"




"కాళ్లు విరగ్గొడతాను'' అన్నాడు సిపిఐ శర్మ.

"చర్మం వలిచేస్తాను'' అన్నాడు కాంగ్రెస్ రెడ్డి.

"అబ్బ! ఎంత చక్కగా కలిశాయండీ మీ అభిప్రాయాలు! నా అంచనా ప్రకారం వాళ్ళిద్దరూ మీ మాట వినరు. నువ్వు నీ కూతురు తోలు వలిచెయ్యి. ఆయన కొడుకు కాళ్లు విరగ్గొడతాడు''

"క్యా బాత్‌కర్తే పోనీబాబూ! కుఛ్ బన్‌నేకీ బాత్‌కహెూ. ఏక్ మజహబ్‌వాలే హైం. షాదీ కరేతో క్యాహువా? నాకు సమఝువుతలేదు. ఈ బొమ్మన్ క్యా, రెడ్డీకా- ఇయ్యాలా రేపు ఎవరు చూస్తుండారిది. సమఝుదారీతో పఱ్జేయాల. హంభీ దునియాకే సాథ్ బదల్తేజానా'' అన్నాడు జైన్.

"మరింకేం నీ కూతుర్ని జోషువా మనుమడికిచ్చి పెళ్లి చెయ్యి'' అన్నాడు శర్మ విసురుగా.

"వో కైసా భాయీ! మజహబ్ హం బనాయే సో చీజ్‌నహీం. ఓ అల్లా పర్‌వర్‌దిగార్ కాదేన్‌హై. హంబందే ఉన్కే హుకుం నామే పర్ చల్నాహై''

"క్రిస్టియన్ కానిదాన్ని నేను మాత్రం నా మనవడికెందుకు చేసుకుంటాను. ఆ నీ కూతుర్ని నా మతంలోకి మారమను. అప్పుడు చూద్దాం" అన్నాడు జోషువాగారు పెద్ద హృదయంతో.

'నాకీ కూతుర్ క్రిశ్చిన్ ఎందుకు కావాలి? నీ పోతానే ముస్లిం అవ్వాలి''

ఇది తెగే వ్యవహారంగాలేదు. మతం మార్చుకుంటే జోషువా, జైన్లు పెళ్లికి ఒప్పుకునేట్టున్నారుగానీ, హిందూ కుల వ్యవస్థలో మార్పిడికి అవకాశం లేనందున శర్మ, రెడ్డి మాత్రం ఈ పెళ్లి ససేమిరా వీల్లేదని పట్టుపట్టుక్కూర్చున్నారు. అందువల్ల నేనో సూచనచేశాను. "ఓ పనిచేద్దాం. పిల్లల్ని పిల్చి నచ్చచెబ్దాం. మగపిల్లలకు ఉద్యోగాలొచ్చిందాకా పెళ్లి ప్రస్తావన చెయ్యొద్దు. ఈలోపల మూడు, నాలుగేళ్లు గడుస్తాయికదా! అప్పటికీ మీ ప్రేమ గట్టిదయితే అప్పుడేం చెయ్యాలో ఆలోచిస్తాం అన్దాం. ఈ లోపల ఒకర్నొకరు కలుసుకోటం, సినిమాలు, షికార్లు, ప్రేమలేఖలు వగైరా బందు చెయ్యాలనీ చెబ్దాం. అలాకాక అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నట్టు తెలిస్తే వెంటనే ఆడపిల్లలకు పెళ్లి చేసేస్తామని బెదిరిద్దాం. వాళ్లు దీనికి ఒప్పుకుంటారు. ఈ నాలుగేళ్లలో ప్రేమ గట్టిదో, ఓటిదో తేలిపోతుంది. ఎవరు ఎక్కడవుంటారో, ఏ కొత్త ప్రేమల్లో పడ్తారో, పరిస్థితులెలా వుంటాయో చెప్పలేం కనుక మీరందరూ నా సలహా నంగీకరించవల్సింది'' అని వాళ్లకో క్లాసు తీసుకున్నాను. నా ఆర్గ్యుమెంటులోని ఫాల్లసీ నాకు తెల్సు. ఇది సక్సెసవటం కూడా నాకనుమానమే. అందరికీ ఆ సూచన నచ్చింది. నిజానికి అందరికీ సందేహమే. అయినా మనిషి ఏదో పరిష్కారమార్గానికి అది తాత్కాలికమే అయినా ప్రయత్నిస్తాడు. రమ్మాని పంపి నల్గుర్నీ రప్పించాము. నేను వాళ్లకు చెప్పవల్సిన మాటలన్నీ చెప్పాను.

"ఆయనతో మాట్లాడకుండా వుండటం కష్టం అంకుల్!" అంది రోషన్.

"అమ్మా! ఈమాత్రం కూడా ఆగలేకపోతే కష్టం. మీ ప్రేమ గట్టిదని మాకు రూఢి కావాలికదా!"

'సరే, మాకుద్యోగాలు దొరికింతర్వాత కూడా ఈ పెద్దలు కాదు పొమ్మంటే'' అడిగాడు అక్షనాథ్.

"ఆ పూచీనాది. మీ ప్రేమ దృఢమైతే మీ పెద్దల్ని నేను ఒప్పిస్తానుకదా!"

"మా నాన్నేం మాట్లాడటంలేదు'' అన్నాడు అక్షనాథ్.

"ఏం మాట్లాడాలి. చేశావుగా నిర్వాకం... అన్నీ ఆయనే మాట్లాడతారు'' అన్నాడు శర్మ.

"అట్లాగే అంకుల్, ఉయ్ డూ అవర్ బెస్ట్,



అండ్ యుమస్ట్ ఆల్సోకీవప్ యువర్ వర్డ్' అన్నాడు మైకేల్.

"మళ్లీ నాన్న తంతే మాత్రం ఊర్కోను'' అంది రోజీ.

"ఏం తన్నడు. నీ బాగుకోసమేగా ఆయనంత తాపత్రయపడ్తున్నది. పెద్దవాళ్ల పరిస్థితి కూడా మీరు గమనించాలి'' అన్నాను.

అందరూ అంగీకరించటంతో "అలా అని పత్రం రాసుకుంటే మంచిది'' అన్నాడు జోషువాగారు. ఆయనకు పనులన్నీ ఓ క్రమ పద్ధతిలో జరగటం ఇష్టం.

నేను ఒప్పందపత్రాన్ని డ్రాఫ్ట్ చెయ్యగా, మిద్దె దొరసాని జోషువాగారి టైపు మిషను మీద టైపు చేసింది. దానిపై పిల్లలు కుడివైపునా, పెద్దలు ఎడంవైపునా సంతకాలు చేశారు. నేనూ, మిద్దె దొరసానీ సాక్షి సంతకాలు చేశాం.



జోధలోకివాసం కార్యదర్శి బులేరావు ఈ నెల నుండి రూ. 25.00 అద్దె పెంచటానికి తన సభ్యులు అంగీకరించారని తెలియపర్చాడు కాన, నేను పెద్ద మనుషుల వప్పందాన్ని తు.చ తప్పకుండా పాటిస్తానని మీకు హామీ ఇస్తూ, కివాసులు కూడా ఈ నెలనుండీ పెంచిన అద్దె చెల్లిస్తూ ఒప్పందం అమలు చేయటంలో తమ వంతు బాధ్యత నిర్వహించవల్సింది అని ఆ నెల ఫస్టు తారీఖున రమ్మా చేత ఇంటింటికీ నోటీసు పంపాడు గృహమేధి జోషువాగారు.

ఇదో కొత్తవార్త. జోధలోలో విపరీతమైన సంచలనం మొదలయింది. దీనికి రియాక్టయిన వాళ్లల్లో మొదటివ్యక్తి సిపిఐశర్మ. నోటీసు రాంగానే బులేరావుతో వెళ్లిమాట్లాడాడు. వాళ్లిద్దరూ ఏం మాట్లాడుకున్నారోగాని ముఖం వేలాడేసుకుని తిరిగి వచ్చాడు సిపిఐ శర్మ. మేం కాంగోరెడ్డి, రాచిప్పచెట్టి, పరేషాన్‌రావు, లెబా, కూగాశాస్త్రీ, నేను- సిపిఐశర్మ ఏం మాట్లాడి వస్తాడోనని ఎదురు చూస్తున్నాం. సిపిఐశర్మ రాంగానే "ఏమన్నాడు బులేరావు?" అనడిగాడు.

"ఏమంటాడు. తనొక్కడే ఎందుకు అద్దె పెంచాలి. తను చేసిన నేరమేంటి? జోధలో సభ్యుల సంక్షేమానికై ప్రయత్నించినందువల్లేకదా తను యాజమాన్యం కోపానికి గురైంది. అందువల్ల తనొక్కడే అద్దె పెంచనక్కరలేదట. అందరూ భరించాల్సిందేనట" అని బులేరావు సందేశాన్ని విన్పించాడు శర్మ.

"ఆయనెవరు జోషువాగారి దగ్గర మా అందరి ప్రతినిధిగా వ్యవహరించటానికి? విశ్వాస రాహిత్య తీర్మానంలో మొదటి కాకామం రద్దయింది. ఇప్పుడు జోధలోకివాసం కార్యదర్శిని నేను'' అన్నాడు కాంగోరెడ్డి.

"మీ కాకామంకి జోషువాగారు గుర్తింపు ఇవ్వలేదు'' అన్నాడు సిపిఐశర్మ.

"కాకామంని ఎన్నుకునేది సంఘ సభ్యులు. ఏ కాకామం ఎన్నికయితే దానికి ఆయన గుర్తింపునివ్వాలి. ముందీ విషయమేదో తేల్చాలి. పరేషాన్‌రావూ, రాచిప్పచెట్టీ మీరెళ్లి బులేరావును పిల్చుకురండి'' అన్నాడు కాంగోరెడ్డి.

ఇద్దరూ కల్సి బులేరావు ఇంటికి వెళ్లారు. పావుగంట వాళ్లని నిరీక్షింపచేసి వచ్చాడతను.

"ఏమయ్యా బులేరావూ! మేం అందరం అద్దె పెంచుతామని నీకు మాట ఇచ్చామా?







నువ్వెందుకు జోషువాగారి దగ్గర వప్పుకు వచ్చావు'' అడిగాడు కూగాశాస్త్రి.

"నేను ఒక్కణ్ణే ఎందుకు ఒప్పుకున్నాను. ఆ రోజు పెద్ద మనుషుల వప్పందం జరిగినప్పుడు పోనీబాబు, లెబా, రాచిప్పచెట్టీ, సిపిఐ శర్మ, పరేషాన్‌రావులు కూడా వున్నారు. వాళ్ల ఎదుటే ఈ ఒప్పందం జరిగింది.

"ఇట్స్ ఎ బ్రేజెన్‌లై. ఆ రోజేం వప్పందం జరగలేదు. రెండు సూచనలు మాత్రం చేశారాయన. నువ్వు యాభై రూపాయలయినా పెంచాలి. లేక అందరూ పాతిక పెంచాలి. అప్పుడు అన్ని సమస్యలు పరిష్కరిస్తానన్నాడు ఆయన. సంఘంలో చర్చించి ఏ విషయం చెప్తానన్నావు. అంతేగాని మరేం ఒప్పందం జరగలేదు ఆనాడు'' అన్నాను.

"నాకు జరిగిన అన్యాయం గూర్చి ఒక్కడూ మాట్లాడడేం? అసలు నేనెందుకు ఖాళీ చెయ్యాలి. మీ బాగోగులు పట్టించుకున్నందుకేగా? రెండు, నేనే యాభై రూపాయలు అద్దె ఎందుకు పెంచాలి? ఇదీ నా పట్ల జరిగిన అన్యాయమే. అసలు నీ ఏకసభ్య కమీషన్‌వల్ల మాకు ఒరిగిందేమిటి? ఒక సమస్యను పరిష్కరించబోయి, ఇంకో సమస్యను నెత్తి మీద తెచ్చిపెట్టావు. కనుక అద్దె అందరూ పెంచాల్సిందే, నేనొక్కణ్ణేకాదు''

"నువ్వెవడివసలు అద్దె పెంచుతామని ఆయనతో చెప్పిరావటానికి?" అడిగాడు కాంగోరెడ్డి.

"నేను లేని సమయంలో ఏదో నలుగురితో ఎన్నికైనంత మాత్రాన నువ్వు సంఘ కార్యదర్శివి కాదు. నేనే అసలు సంఘ కార్యదర్శిని. ఆ హోదాలోనే ఆయనతో మాట్లాడాను. పదండి బ్రదర్స్. వాళ్లతో మాట్లాడి ప్రయోజనం లేదు. ఏం చేసుకుంటారో చేసుకోమన్న'' అని లెబా, సిపిఐశర్మ, రాచిప్పచెట్టిలను వెంటబెట్టుకు పోయాడు బులేరావు.

కాంగోరెడ్డి జైన్‌ని పిలిపించి తన బృందంతో జోషువాగారి దగ్గరకెళ్లాడు. నేనూ వాళ్లననుసరించాను. అప్పుడాయన పేపరు చదువుతూ తీరిగ్గా కూర్చునున్నాడు.

వెళ్లగానే, "మీరు అద్దె పెంచమని అంద

ర్నీ ఆదేశించారు. మేము జోధలోకివాసం ససస లో అలాంటి నిర్ణయం తీసుకోలేదు'' అన్నాడు కాంగోరెడ్డి.

"వాట్స్ దహెల్, ఇట్వాజ్ వాట్యువర్ సెక్రటరీ టోల్డ్ మీ ద అదర్‌డే''

"ఆయనిప్పుడు సెక్రటరీ కాదులెండి. ఆ కాకామంపై నో కాన్ఫిడెన్స్ మోషన్ పెట్టి, కొత్త బాడీనెన్నుకున్నారు. ప్రస్తుతం కాంగోరెడ్డి సంఘకార్యదర్శి., ఈ కాకామాన్ని మీరు గుర్తించాలి''అని నేను వివరించాను.

"సరే గుర్తిస్తాను. మీరు ఎన్‌హాన్స్‌డ్ రెంట్స్‌పే చెయ్యండి''

"ఆ విషయం సససలో చర్చించి మీకు చెప్తాం" అన్నాడు కాంగోరెడ్డి.

"అదంతా నాకు తెలవదు. విషయం ఇప్పుడే పరిష్కారం కావాలి''

"థోడా సబ్‌కరో జోషువా సాబ్! జల్దీ కరేతో బాతేం బన్తేనహీం" అన్నాడు జైన్.

"దెన్ వాడ్డూయు వాంట్ మి టుడు?"

"సససలో చర్చించి ఓ నిర్ణయం తీసుకున్నదాకా మీరాగాలి'' అన్నాడు కాంగోరెడ్డి.

"అదేం వీల్లేదయ్యా! ఇల్లు ఖాళీ చెయ్యమని బులేరావుకు నోటీసిస్తాను''

"సరే మీ ఇష్టం" అన్నాడు కాంగోరెడ్డి.

సాయంత్రం బులేరావును పిల్చి జోషువాగారు చడామడా తిట్టేశాట్ట. రాత్రి కాలేజీ నుంచి వచ్చింతర్వాత ఆవిడ రిపోర్టిచ్చింది.

★ ★ ★

"సంతకాలెందుకండీ. ఐ షల్ పెరేడ్ దెం బిఫోర్‌యూ ఫర్ ఫిజికల్ వెరిఫికేషన్' అన్నాడు రెడ్డి.

"చూద్దాం. ముందు సంతకాలతో మీమీ లిస్టులివ్వండి''

మర్నాడు రాత్రి బులేరావు, కాంగోరెడ్డీ ఇచ్చిన సీల్డ్ కవర్స్ చింపి లిస్టులను పరిశీలించాం నేనూ జోషువాగారు. బులేరావు లిస్టులో బులేరావు, మణి, లెబా, ఆన్నీ, సిపిఐ శర్మ, ఓల్గా, రాచిప్పచెట్టి, నాయకి, పరేషాన్‌రావు, కూగాశాస్త్రి, అండమ్మ సంతకాలున్నాయి. కాంగోరెడ్డి లిస్టులో కాళి, కాంగోరెడ్డి, కన్య, హరబాబు, బేగం, జైన్, రాణి, కూగాశాస్త్రి, అండమ్మ సంతకాలున్నాయి. రెండు లిస్టుల్లోనూ కూగాశాస్త్రి, అండమ్మ పేర్లెలా వచ్చాయో నాకు అర్థంకాలేదు. రెండు లిస్టుల్లో ఆ పేర్లు తొలగించినా బులేరావుకే మెజారిటీ వస్తుంది.

"ఇంకేమయ్యా! బులేరావుకే మెజారిటీ సభ్యుల మద్దతు ఉన్నట్టు కన్పిస్తోంది. అతని కాకామంకే నేను గుర్తింపు ఖాయం చేస్తాను'' అన్నాడు జోషువాగారు.

"అదెలా సార్! కాంగోరెడ్డి మా సంతకాల డగలేదు. అడిగితే ఆయనకూ పదకొండు మంది సభ్యుల మద్దతు వుండేది'' అన్నాను.

"అది వాడి ఖర్మ. అడగనప్పుడు మనమేం చేస్తాం?"

"పోనీ నేనిప్పుడు సంతకం పెట్టేదా?"

"రాద్ వీల్లేదు. లిస్టు ఫైనలయి నాదగ్గరకు వచ్చినాక ఇంక సంతకాలెవరూ పెట్టరాదు''

ఇహ లాభంలేదు. ఆయన బుర్రలోకేం దూరదు. జోషువాగారు బులేరావును, కాంగోరెడ్డిని పిల్చి ఒకళ్ల లిస్టు మరొకళ్ళకు చూపి "బులేరావుకే మెజారిటీ సభ్యుల మద్దతు వుంది. అందువల్ల నేను ఆయన కాకామంకే గుర్తింపునిస్తున్నాను'' అన్నాడు.

కాంగోరెడ్డి లబోదిబోమన్నాడు. "ఇదేం అన్యాయం సార్! అండమ్మ, కూగాశాస్త్రి సంతకాలు కూడా ఈ లిస్టులో వున్నాయి. ఇవి వాళ్ల సంతకాలు కావు ఫోర్జరీ'' అన్నాడతను.

"నువ్వే ఫోర్జరీ చేశావు. వాళ్లిద్దరూ నాతరఫే'' అన్నాడు బులేరావు.

"జోషువాగారూ! ఇదీ పరిశీలించాల్సిన విషయమే. రెండు లిస్టుల్లో ఇద్దరి సంతకాలెలా వుంటాయి?" అన్నాను.





"ఎస్, దేర్ లైసె పాయింట్ వర్దీ ఆఫ్ కన్సిడరేషన్. అయినా బులేరావు కాకామంకు తాత్కాలిక గుర్తింపు మంజూరు చేస్తున్నాను. వచ్చే ఆదివారం సాయంత్రం 5-7 గంటలమధ్య సనస జరపండి. అందులో బులేరావు తన మెజారిటీ ప్రూవ్ చేసుకోవాల్సి వుంటుంది. ఈలోపల సభ్యుల లిస్ట్ ఒకటి నాకివ్వండి''

"సభ్యుల లిస్ట్ ఎందుకండీ... మీకు తెలీని సభ్యులెవరున్నారు?" అన్నాను నేను.

"ఫాం మాన్ ఫాం... ఎవ్విరిథింగ్ మస్ట్‌బి ఇన్ ఆర్డర్'

"అయ్యా... ఇదన్యాయం" అని కాంగోరెడ్డి ఏదో చెప్పబోయాడు.

"ఇంకేం చెప్పొద్దు కాంగోరెడ్డీ! నా ఫైనల్ డెసిషన్ ఇచ్చేశాను'' అని లేచి లోపలకు వెళ్లబోయాడాయన.

"యె కహాఁ కీ డిక్టేటర్‌షిప్ హై. హమారీ బాత్ సునియే'' అని ఆయన చెయ్యి పట్టుకున్నాడు జైన్.

అతని చెయ్యి విదిలించుకుని లోపలకు పోతుంటే హరబాబు అడ్డం వచ్చాడు.

"మీరు మామాట వినకుండా వెళ్లటానికి వీల్లేదు'' అన్నాడతను.

"హరబాబును పక్కకు లాగాడు బులేరావు. కాంగోరెడ్డి బులేరావును ఒక్క తోపు తోశాడు. సిపిఐ శర్మ కాంగోరెడ్డి జుట్టు పట్టుకు లాగాడు. జైన్ సి.పి.ఐ శర్మ వీపుమీద ఒక్కటి తగిలించాడు. లెబా జైన్ గడ్డం పట్టుకు లాగాడు. "అరె ఛోడ్ ఛోడ్' అంటూ లెబా గొంతు ఒక చేత్తో, అడ్డం వచ్చిన రాచిప్ప చెట్టి గొంతు ఒకచేత్తో పట్టుకున్నాడు జైన్.

"స్టాప్... స్టాప్ దిస్ రయెడింగ్. ఐ ఆల్రెడీ అనౌన్స్‌డ్ మై డెసిషన్. బులేరావ్ షల్ ప్రూవ్ హిజ్ మెజారిటీ ఇన్ద ఎన్స్యూయింగ్ సనస ఆన్ సన్డే. అరె రమ్మూ! వీళ్లందర్నీ బయటకు తోలరా'' అన్నాడు జోషువాగారు గట్టిగా అరుస్తూ.

బులేరావు వర్గం నవ్వుకుంటూ, కాంగోరెడ్డిని హేళన చేస్తూ బయటపడ్డది.

"నాపై అవిశ్వాస తీర్మానం ప్రవేశపెడ్తావా? చూస్తా? అసలు నువ్వీ లోగిల్లో వుండకుండా చేస్తా'' అని ఛాలెంజ్ చేసి బులేరావు తన వాళ్లతో వెళ్లిపోయాడు.

మెట్లు దిగి కిందకొచ్చిన కాంగోరెడ్డి దిగ్భ్రిమలో నిలబడిపోయాడు. తన కాలిక్యులేషన్ ఎక్కడ దెబ్బతిందో అతనికర్థంకాలేదు. ఏం చేయాలో స్ఫురించలేదు.

"ఏమయ్యా కాంగోరెడ్డీ! రెండోసారి ఎన్నికలు జరిగినప్పుడు నీ నామినేషన్‌ని సమర్థించిన నన్ను కూడా నువ్వు నమ్మలేదు. అటువేపు వర్గంవాడిననుకొని సంతకానికే రాకపోతివి. నాదీ, నా భార్య సంతకం తీసుకుంటే నీకూ పదకొండుమంది సభ్యుల మద్దతు వుండేదిగా'' అన్నాను నేను.

"పొరపాటు అయింది పోనీబాబూ! ఇప్పుడేం చేయాలో నాకర్థం కావడంలేదు''

"ముంచుకుపోయిందేం లేదు. రేపు బులేరావు మెజారిటీ ప్రూవ్ చేసుకోవాలి. అతనికెలాగో మెజారిటీ లేదు. నీ సభ్యులు జారిపోకుండా చూసుకో' అని సలహా ఇచ్చాను.

ఆ ప్రయత్నమేదో గట్టిగానే చేశాడు కాంగోరెడ్డి. నేననుకోనివిధంగా ఆదివారం ఇంకా నాల్గు రోజులుండనగా కాలేజీనుండి నేను వచ్చేటప్పటికి మా ఆవిడో న్యూస్ చెప్పింది. అజంతా, ఎల్లోరా, షిర్డీ వగైరా ప్రదేశాలకు తీర్థయాత్రలకు కాంగోరెడ్డి బస్సు ఏర్పాటు చేశాడట. బస్సు ఛార్జీలు తలొక్కంటికి ఎనభై రూపాయలు పెట్టుకుంటే బోర్డింగ్, లాడ్జింగ్ ఏర్పాట్లన్నీ ఫ్రీనట. నేనో వందరూపాయలు కట్టి మనక్కూడా సీట్లు రిజర్వు చేయించాను'' అంది భాను.

"నన్నడక్కుండా ఎందుకు చేయించావు? నేను రావటానికి కుదర్దు. అసలు విషయం

నువ్వు గమనించలేదు. తనవైపు సభ్యులు బులేరావు ప్రలోభంలో పడకుండా వుండేందుకూ, బులేరావు వర్గంలో వున్న సభ్యులను తనవైపు ఆకర్షించుకునేందుకూ కాంగోరెడ్డి ఎత్తిన ఎత్తు ఇది'' అన్నాను.

"అయితే ఏమైంది? మా గొప్పగా కనుక్కున్నారు. నాకూ తెల్సు ఆ విషయం"

"అందువల్ల మనం వెళ్లవద్దు. ఇలాంటి ఛీప్ ప్రలోభాలకు దూరంగా వుందాం"

"మనమేం ఊర్కే వెళ్లటంలేదు. డబ్బు కట్టి వెళ్తున్నాం. మీర్రాకపోతే మానుకోండి. నేనూ పిల్లలూ వెళ్తాం"

"బస్సెప్పుడు బయల్దేరుతుంది?"

"గురువారం సాయంత్రం భోజనాలు చేసిం తరువాత. శుక్రవారం ఔరంగాబాద్, ఎల్లోరా, అజంతా, శనివారం షిర్డీ చూసి రాత్రి బయల్దేరి ఆదివారం మూడుగంటలకల్లా వచ్చేస్తామని కూగాశాస్త్రి అన్నాడు''

కాంగోరెడ్డి పకడ్బందీగానే ప్రోగ్రాం వేశాడు. ఇది విని బులేరావు వర్గం ఆందోళనలో పడింది. నాకు పరేషాన్‌రావు చెప్పాడు. నాయకి, ఓల్గా కూడా వెళ్తున్నారని తెల్సి బులేరావు తిట్టాడట శర్మనీ, చెట్టినీ.

"మీరొట్టి చవట సన్నాసులు. భార్యల్నే అదుపులో పెట్టుకోలేని మీకు రాజకీయాలెందుకు?" అని.

"నువ్వు ఇవ్వాళ రాజకీయాలు నేర్చుకుంటున్నవాడివి. నాకామాత్రం తెలీదా? అవతల కాంపులో ఏం జరుగుతోందో తెల్సుకోనక్కర్లా. అందుకే నా భార్యను పంపుతున్నాను'' అన్నాడట సిపిఐ శర్మ.

"మరి బస్సు ఆదివారం రాకపోతే ససస ఎలా జరుగుతుంది?" అని సందేహం వెలిబుచ్చాడు లెబా.

"మరీ మంచిది. తరువాత ఆదివారానికి పోస్ట్‌పోన్ చేయిద్దాం. సభ్యులను మనవైపు తిప్పుకునే అవకాశం వస్తుంది'' అన్నాడు సిపిఐ శర్మ.

"కీడెంచి మేలెంచమన్నారు. మనవాళ్ల సంగతలావుంచి. కూగాశాస్త్రి, అండమ్మ అటు వైపు తిరిగిపోతే మన బలం పోద్దిగదయ్యా'' అన్నాడు బులేరావు.

ఓ చిరునవ్వు నవ్వాడు సిపిఐ శర్మ. "బులేరావు! నేనోమాట చెప్పనా? కూగాశాస్త్రిని తద్దినాలకు పిలవననీ, రామచిలుక పెళ్లి కావాలంటే మా సాయం నీకు కావాలని అండమ్మనీ బెదిరించాను. వాళ్లు మన పక్షమే. పైకనకూడదుగాని కులాభిమానం బలవత్తరమైంది. నా కులంవాళ్లు నేను అడిగితే కాదంటారా? నువ్వనవసరపు అనుమానాలు పెట్టుకోకు'' అన్నాడట సిపిఐ శర్మ.

ఆరోజు సాయంత్రం కాలేజీకి వెళ్తూ ఓ మిత్రుడు కలిస్తే టూరిష్టులో కాఫీ తాగుదామని వెళ్ళాం. కాఫీ తాగి బయటకొచ్చేటప్పుడు ఎదురుగా టూరిస్టు లగ్జరీ ట్రిప్స్‌నుండి బులేరావు, ఇంకో వ్యక్తి ఖాకీ గుడ్డల్లో వున్నాడు. బహుశా డ్రైవరనుకుంటాను బయటకొస్తూ కనపడ్డారు. "హలో'' అని నేను విష్ చేశాను కానీ నన్ను తాను గమనించలేదు. ఇద్దరూ ఏ విషయమో తీవ్రంగా చర్చించుకుంటూ టూరిస్ట్ బార్‌లోకి వెళ్లారు. అతన్ని విష్ చేయటమే నా పొరపాటు అనుకున్నాను.

★ ★ ★

గురువారం రాత్రి 10 గంటలకు యాత్రాస్పెషల్ బస్సు బయలుదేరింది. లోగిల్లో నేనూ, సిపిఐ శర్మ, రాచిప్పచెట్టీ, జోషువాగారూ, బులేరావు, అతని కుటుంబం అలాగే లెబా, అతని భార్య తప్ప అందరూ తీర్థయాత్రకు వెళ్లారు. శనివారంరోజు మాకు సెలవు కనుక నేనూ జోషువాగారూ క్రిస్టోఫర్ వాళ్లింటికి వెళ్లాం, మిద్దె దొరసాని పెళ్లి సంబంధం ఖాయం చెయ్యటానికి.

ఆదివారం సాయంత్రం ఆరున్నరదాకా యాత్రాస్పెషల్ బస్సు అయిపులేదు. బు




లేరావు వర్గం బస్సు టైముకి రాలేదు కనుక వచ్చే ఆదివారానికి సససను పోస్టుపోన్ చేయమని అర్థించింది.

"సరే ఫో. బస్సు ఏడుగంటలదాకా రాకపోతే వచ్చే ఆదివారానికి మీటింగ్ పోస్ట్‌పోన్ చెయ్యటానికి అనుమతిస్తున్నాను'' అన్నాడు జోషువాగారు.

ఇంతలో కిందనుండి ఖులేరావు కొడుకు "నాన్నా! బస్సొచ్చింది'' అని బిగ్గరగా కేకపెట్టాడు.

మేమందరం కిందకు దిగాం జోషువాగారింటినుండి. ప్రయాణీకులు పెట్టెబేడలతో దిగుతున్నారు. బులేరావు ముఖం ఎందుకో చిన్నబోయివుంది.

డ్రైవరు ఎదురుగా వున్న బులేరావును చూపించి, "వహీ ఆద్మీ హై సాబ్!' అన్నాడు కాంగోరెడ్డి, జైన్లతో. కాంగోరెడ్డి 'థూ' అని ఊసి పక్కన నిలబడ్డాడు. అప్పుడు నేను ఆ డ్రైవర్ని గుర్తుపట్టాను. టూరిస్ట్ లగ్జరీ టూర్స్‌లో బులేరావుతో కలిసి వెళ్లింది అతనే. సంగతేమిటో నాకర్థంకాలా.

కూతుర్ని, మనవడిని రిసీవు చేసుకోటానికొచ్చిన జోషువాగారితో, "అయ్యా! పదిహేను నిమిషాల్లో ససస మొదలవుతుంది. మీరు ఎవరికి ఎక్కువమంది సభ్యుల మద్దతు వుందో పరిశీలించవల్సింది'' అన్నాడు రెడ్డి.

"సరే, ఏర్పాట్లు కానీ'' అని కూతురు, మనవడ్తో పైకెళ్లిపోయారాయన.

బులేరావు ఏదో అనబోయి గప్‌చుప్‌గా వుండిపోయాడు.

కాంగోరెడ్డి హడావుడిగా ఏర్పాట్లన్నీ చేశాడు. సభ్యులందరూ జమకూడిం తర్వాత "పోనీ బాబూ! మీరు జోషువాగార్ని అధ్యక్షులుగా డయాస్‌మీదకు ఆహ్వానించండి'' అనటంతో నేను డయాస్ దగ్గరకు వెళ్లాను.

"ఐ రిక్వెస్ట్ అవర్ ఆనరబుల్ లాండ్‌లార్డ్ హిజ్ ఎక్సెలెన్సీ మిస్టర్ జోషువా టు ప్రిసైడ్ ఓవర్ ద మీటింగ్, మిస్టర్ జోషువా విల్ నౌ కంటు డయాస్'' అని నేను ఆహ్వానించటంతో ఆయన 'రాజువెడలె రవి తేజములదరగ' అన్నట్టు వెనకబంటు రమ్మూ్మ అనుసరించగా, చేతికర్రతో ఠీవిగా వచ్చి అధ్యక్ష పీఠాన్నలంకరించాడు. వెనక రమ్మూ్మ అటెన్షన్ పొజిషన్‌లో నిలబడున్నాడు.

"అధ్యక్షా! ఎ పాయింటాఫ్ ఆర్డర్. ఈ మీటింగిప్పుడు జరగరాదు. ధర్మప్రభువులు మీరు ససస సాయంత్రం నాలుగ్గంటలకు జరగాలని ఆదేశమిచ్చారు. ఇప్పుడు పావుతక్కువ ఏడైంది. ఇది ఇంతకుముందు తమరిచ్చిన ఆదేశానికి విరుద్ధం" అన్నాడు లెబా.

"సభ్యులకు ప్రలోభాలు చూపి కాంగోరెడ్డి వాళ్ల మనసులు మార్చాడని నాకనుమానంగా వుంది. ఎలాంటి వత్తిడులు లేని స్వేచ్ఛాయుత వాతావరణంలోనే మీటింగు జరగవల్సి వుంటుందని మీకు తెలియంది కాదు. కనుక మీటింగును పోస్ట్‌పోన్ చెయ్యమని ప్రజాస్వామ్య పరిరక్షణా కంకణ బద్ధులైన జోషువాగార్ని నేను కోర్తున్నాను'' అని కూర్చున్నాడు సిపిఐ శర్మ.

"సభ్యులు ప్రయాణం చేసి అలసి సొలసిపోయ్యారు. వారి గౌరవనీయమైనముఖాలను పరిశీలిస్తే సరైన భోజనం, నిద్రా లేనట్టు కరుణాసింధులైన తమకవగతమౌతుంది. అందుకని వచ్చే వారానికి ఈ సససను పోస్ట్‌పోన్ చెయ్యవల్సిందిగా తమర్ని అర్థిస్తున్నాను'' అన్నాడు రాచిప్పచెట్టి.

బులేరావు గ్రూపు స్ట్రాటెజీ నిర్ణయించేది లెబా. ఐదు నిమిషాల్లో ఎవరి పాఠం వారికి బోధించి, శిక్షణ ఇచ్చిన అతని కార్యకుశలత్వాన్ని మెచ్చుకోకుండా వుండలేకపోయాను. స్ట్రాటెజీలో ఒకభాగం అధ్యక్షుడిని ఉబ్బేయటం. ఆ పనిని విశృంఖలంగా చేపట్టింది ఆ బృందం. జోషువాగారు దాంతో డంగైపోయాడు.

వాళ్ల అభ్యర్థనకు అంగీకరించ సిద్ధంగా వున్న క్షణంలో "మీటింగ్ పోస్ట్‌పోన్ చెయ్య



క్కర్లేదు'' అనరిచారు హరబాబు.

"అవును పోస్ట్‌పోన్ చెయ్యాల్సిన పనిలేదు'' అంది ఓల్గా.

"నీకు తెలియదు నువ్వూర్కో'' అన్నాడు సిపిఐ శర్మ.

తనకు తెలియందేదీ లేదని ఆమె సదుద్దేశం. "మీకేం తెల్సు, మీరూర్కోండి'' అంది ఆమె.

"మహాఘనత వహించిన అధ్యక్షా! ఒక సభ్యుడు, ఇంకో సభ్యురాలి స్వాతంత్ర్యాన్ని అపహరించ ప్రయత్నించటం, అదీ తమ ముందు జరగటం అప్రజాస్వామికం. తమరీ అరాచక ధోరణులనరికట్టాలి'' అన్నాడు పరేషాన్‌రావు. అధ్యక్షులనెలా ట్రీట్ చెయ్యాలో అప్పటికే కాంగోరెడ్డి బృందానికి ఉప్పు అందింది.

"అనుకున్న టైముకు ససస మొదలుకాలేదు. ఇంత హడావుడిగా సమావేశం జరగాల్సిన పనిలేదు. తొందరలో తప్పుడు నిర్ణయాలు తీసుకునే అవకాశముంది'' అన్నాడు లెబా.

"దట్స్ కరెక్ట్. వైషుడ్ వుయ్ కండక్ట్ ద మీటింగ్ ఇన్ హేస్ట్. వైకాన్ట్ వుయ్ పోస్ట్‌పోనిట్ టు నెక్స్ట సండే?" అనడిగారు జోషువాగారు.

"అసలు జరిగింది తెలిస్తే తమరిలా సెలవివ్వరు అధ్యక్షా! నిజమే. బస్సు ఆలస్యంగా వచ్చింది. దీనికి కారణమెవరు? గౌరవనీయులైన బులేరావుగారు. బస్సు మధ్యాహ్నం పన్నెండింటికి కామారెడ్డికొచ్చింది. భోజనాల ఏర్పాటుకోసం బస్సు ఆపాం. 'ఇప్పుడే వస్తాన'ని చెప్పి వెళ్లి డ్రైవరు కల్లుపాకలో దూరి తాగుడు మొదలెట్టాడు. ఒంటిగంటకు మేం బయలుదేరవల్సుండె. డ్రైవరు అయిపులేడు. అతన్ని వెతకటం మొదలెట్టాం మేము. తోవలో బంధువుల ఇంటికి వెళ్లి వస్తున్న క్లీనరు కన్పించాడు. డ్రైవరెక్కడున్నాడో చెప్పాడతను. మేం కల్లుపాకకు వెళ్లేటప్పటికి వాడు పీకలదాకా తాగున్నాడు. వాణ్ణి బస్సు దగ్గరకు లాక్కొచ్చి, రెండు తగిలిస్తే తాగుడు మైకంలో వున్న విషయం చెప్పాడు. బస్సు ఆలస్యంగా తీసుకురావటానికి బులేరావుగారు వాడికి వంద రూపాయల లంచమిచ్చాట్ట. క్లీనర్‌కు డ్రైవింగ్ వచ్చు. వాడిని బతిమిలాడి, వాడికో వందరూపాయలు ముట్టచెప్పి బస్సు బయలుదేరదీసేటప్పటికి మూడు గంటలైంది. నగర శివార్లలో కాబోలు డ్రైవరుకు మత్తు తగ్గి అక్కడనుండి తను బస్సు నడిపాడు. ఆలస్యమవటానికి కారణం శ్రీ బులేరావు, వారి దుష్ట రాజకీయాలు'' అన్నాడు కాంగోరెడ్డి.

"ఇదబద్ధం. సక్రమమార్గంలో నెగ్గలేక నా మీద బురద చల్లుతున్నారాయన" అన్నాడు బులేరావు.

"నోర్మూసుకోవయ్యా! అందరి కళ్ల ముందు జరిగింది అబద్ధమనటానికి నీదసలు నోరేనా? సాయిరాం, సాయిరాం. ఈ మనిషెప్పుడు బాగుపడ్తాడో తండ్రీ!" అంది ఓల్గా.

బులేరావు మిత్రబృందం బులేరావువంక కోపంగా చూసింది.

"అధ్యక్షా! దుష్టరాజకీయాలను ప్రవేశపెట్టి 'జోధలోకివాసం' వాతావరణం కలుషితం చేస్తున్న బులేరావును సంఘప్రైమరీ మెంబర్‌షిప్‌నుండి తొలగించాలని కోర్తున్నాను''. నివేదించాడు కాంగోరెడ్డి.

"దేరీజ్ నథింగ్ ఫెయిర్ అండ్ ఫవుల్ ఇన్ పాలిటిక్స్. బులేరావు చేసిన పని చెడ్డదయినా, ఆయన్ని సంఘంనుండి బహిష్కరించాల్సిన పనిలేదు. పోనీ అలా చెయ్యాలనుకున్నా ఫోరం ఇది కాదు. బులేరావు మెజారిటీ నిర్ణయించటానికేర్పాటైన ప్రత్యేక సభ ఇది. అదిమాత్రమే ఇక్కడ చర్చించాలి'' అన్నాను నేను.

"నిష్పక్షపాతి అయిన పోనీబాబు మాట నేను సమర్థిస్తున్నాను'' అన్నాడు లెబా.




"అధ్యక్షా! కాంగోరెడ్డిగార్ని కూడా సంఘ ప్రాథమిక సభ్యత్వంనుండి తొలగించాలని కోర్తున్నాను. నిన్నమొన్నటిదాకా బులేరావును సమర్థించిన సభ్యులు కూడా ఆయనకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నారంటే అర్థమేమిటి? గౌరవనీయ సభ్యుల బుద్ధి, ఆలోచన నశించేవిధంగా సమ్మోహనకరమైన ప్రలోభాన్ని కల్పించటమో, బ్రెయిన్ వాష్ చెయ్యటమో జరిగింది. గౌరవనీయ సభ్యులు వెళ్లి వచ్చింది తీర్థయాత్రకు కాదు కాన్సంట్రేషను కాంపుకు. దీనంతటికీ కారణమెవరు? కాంగోరెడ్డిగారు. కనుక వార్ని సంఘ ప్రాథమిక సభ్యత్వాన్నుంచి తొలగించాలని నేను కోర్తున్నాను'' అన్నాడు సిపిఐ శర్మ.

"సాయిరాం. సాయిరాం. ఏవింటీ ఎదుర్రంకు. ఈయన మతుండే మాట్లాడుతున్నాడా?" అంది ఓల్గా.

"నీకే మతిపోయింది. నోర్మూసుక కూర్చో'' అంది మణి.

"సిపిఐ షర్మాజీ సదస్యోంకీ అపమానిత్ కర్‌రహేఁహై. వె అపనే బాత్ వాపిస్ కర్నాచాహియే. క్యాహం నహీఁ సోచ్‌సక్తే భలా క్యాహై, బురా క్యాహై?" అంది రాణి.

"బులేరావుగారి కాన్సంట్రేషన్ కాంపులో వుండి ఆయన బుర్ర పోయింది'' అన్నాడు పరేషాన్‌రావు.

"అయ్యో! నా ప్రతిపాదనేం చేశారు?" అడిగాడు కాంగోరెడ్డి.

"అయ్యో! మరి నా ప్రతిపాదన కూడా మీరు పరిశీలించాలి!" అన్నాడు సిపిఐ శర్మ.

"దేరీజ్ నో నీడ్ టు ఎక్స్ కమ్యూనికేట్ ఐదర్ బులేరావ్ ఆర్ కాంగోరెడ్డి. ఎటెనీరేట్ దిసీజ్ నాట్ ద ఫోరం ఫరిట్. శర్మాస్ ప్రపోజల్ ఈజ్ ఇన్సల్టింగ్ టు ద జనరల్ మెంబర్‌షిప్. యుకాంట్ మోనోపలైజ్ ద బ్రెయిన్ మాటర్. హెన్స్ ఐ ఎబ్‌జాల్వ్ కాంగోరెడ్డి ఆఫ్ద మిశ్చివస్ అల్లెగేషన్. దిసీజ్ మై రూలింగ్'' అన్నాడు అధ్యక్షుడు.

"ఏమైనా మీటింగిప్పుడు జరగరాదు. రెడ్డిగారు కాన్వాసింగ్ చేసుకోటానికి ఎక్కువ టైం దొరికింది. బులేరావుకలాంటి అవకాశం లేకపోయింది'' అన్నాడు సిపిఐ శర్మ.

"అవును. అలాంటి సమానావకాశం బులేరావుకివ్వకపోవటం అన్ డెమొక్రటిక్'' అన్నాడు లెబా.

"అధ్యక్షా! ఇంకా కాన్వాసింగ్‌కుఎవరికీ అవకాశమివ్వాల్సిన పనిలేదు. ఇవాళ బులేరావుగారు మెజారిటీ ప్రూవ్ చేసుకోవాలని మీరు వారంక్రితమే ప్రకటించారు. అది ఆయన ఉపయోగించాల్సివుండె. కనుక సభాకార్యక్రమాన్ని కొనసాగించవల్సింది'' అన్నాను నేను.

"పోనీబాబు! గోడమీది పిల్లి. ఆయన మాట పట్టించుకోవాల్సిన అవసరంలేదు'' అన్నారు లెబా.

"నో... నో. ఐ ఆల్రెడీ ఫిక్సడ్ టైం ఫర్ బులేరావ్ టు ప్రూవ్ హిజ్ మెజారిటీ. దేరీజ్ నో క్వశ్చెన్ ఆఫ్ పోస్ట్‌పోన్‌మెంట్ ఆన్దిస్ గ్రౌండ్'' అన్నాడు జోషువాగారు.

"అధ్యక్షా! సమావేశం పోస్ట్‌పోన్ చెయ్యటానికి ఇంకో బలమైన కారణం కూడా వుంది. చాలామంది సభ్యులు తిండితిప్పల్లేక, నిద్రలేక అలసిపోయివున్నారు. ఈ సమయంలో మీటింగు కొనసాగించటం వాళ్ళ సహనశక్తి పరీక్షించటమే. కనుక మీటింగ్ పోస్ట్‌పోన్ చెయ్యండి'' అన్నాడు రాచిప్పచెట్టి.

"మేమేమీ అలసిపోలేదు. నిద్రపోకపోలేదు. తిండికి మొహం వాచలేదు. సమావేశం ఇప్పుడే జరిగి విషయనిర్ధారణయితే అందరూ హాయిగా నిద్రపోవచ్చు. కనుక సమావేశాన్ని కొనసాగించండి'' అంది నాయకి.

రాచిప్పచెట్టి నమ్మలేనట్టుగా భార్యవంక చూశాడు.

"సమావేశం కొనసాగాల్సిందే'' అనరిచింది తీర్థప్రజ.

"ఆల్రైట్, సమావేశం కొనసాగుతుంది.

సీక్రెట్ బాలెట్ తీసుకుందాం...'' అన్నాడు జోషువాగారు.

"అధ్యక్షా! ముందుగా కూగాశాస్త్రీ, అండమ్మ సంతకాలు రెండు లిస్టుల్లోనూ ఎలా వచ్చాయో మీరు తేల్చాలి. కాంగోరెడ్డి వాళ్ళ సంతకాలు ఫోర్జరీ చేశాడని నా నమ్మకం" అన్నాడు బులేరావు చివరి ప్రయత్నంగా.

అంతలో కూగాశాస్త్రి లేచాడు. సిపిఐ శర్మ సైగ చేస్తున్నా వినకుండా, "అయ్యా అండమ్మగార్కీ నాకూ చెరి రెండు ఓట్లూ వున్నాయి. అందువల్ల ఇద్దరం వాళ్లిద్దరికీ చెరో వోటూ వేస్తూ సంతకాలు చేశాం. ఇద్దరిలో ఎవరూ ఫోర్జరీ చెయ్యలేదు. అవి మా సంతకాలే' అన్నాడు.

చివరి అభ్యంతరం కూడా వీగిపోవటంతో, ఓటింగ్ తప్పలేదు. "బులేరావును సపోర్ట్ చేసేవాళ్లు ఆయన పేరు రాసి ఓటుచేస్తారు. బలపర్చని వాళ్లు వట్టి తెల్లకాయితాలు ఓటు చేస్తారు. ఎవరు పేరు రాస్తున్నారో, రాయటంలేదో తెలియకుండా వుండేందుకు సీల్ చేసిన బాలెట్‌బాక్స్ పోనీబాబు ఇంట్లో పెట్టాను. ఒకొక్కళ్ళూ వచ్చి ఓటు చేయండి'' అని ఆదేశించాడు జోషువాగారు.

ఓట్ల లెక్కింపులో బులేరావు పేరున్న ఓట్లు ఆరు, ఏమీ రాయని ఓట్లు పదహారూ వున్నాయి. "బులేరావుకు అధిక సంఖ్యాకసభ్యుల మద్దతు లేదనీ, కాంగోరెడ్డికే మెజారిటీ సభ్యుల మద్దతువుందనీ ఓట్ల లెక్కింపు వల్ల తేల్తోంది. కనుక నేను కాంగోరెడ్డి 'కాకామం' కే గుర్తింపునిస్తున్నాను'' అని ప్రకటించాడు జోషువాగారు

"అధ్యక్షా! అదన్యాయం. ఈ ఓటింగువల్ల బులేరావుకు ఎక్కువమంది సభ్యుల మద్దతు లేదని మాత్రం తేల్తుంది. అంతేకాని బులేరావు పేర్లు లేని వోట్లన్నీ కాంగోరెడ్డిని బలపర్చినట్టు కాదు. కనుక కాంగోరెడ్డి 'కాకామ'న్ని మీరు గుర్తించాల్సిన పనిలేదు.

"అదేంది? ఏదో ఒక 'కాకామం'కు గుర్తింపు లేకుండా మన 'జోధలో కివాసం' ఎట్లా వుంటుంది'' అన్నాడు పరేషాన్‌రావు సిగరెట్ పొగ వదుల్తూ.

"అందుకు కొత్త ఎన్నికలు జరగాలి'' అన్నాడు లెబా, కళ్ళజోడు సవరించుకుంటూ.

"ఎన్నికలపోయాయి. ఇంక వాటి సంగతొద్దు''. అన్నారు హరబాబు.

"రైట్. సభ్యులందరూ మళ్ళీ ఓట్ చేస్తారు. ఈసారి కాంగోరెడ్డి పేరు రాస్తారు ఓట్ల మీద ఆయనను సపోర్ట్ పల్కేవాళ్లు. మద్దతు ఇవ్వనివాళ్లు వొట్టి కాయితాలే ఓట్ చేస్తారు'' అన్నాడు అధ్యక్షుడు.

"మేం దీనికి ఒప్పుకోం. ఈ సభ బులేరావుకు మద్దతు వుందా లేదా అని తెల్సుకోవటం కోసమే ఏర్పడింది. కాంగోరెడ్డి మద్దతు గూర్చి తెల్సుకోవాల్సిన అవసరంలేదు'' అన్నాడు లెబా.

"అదెట్లా కుదుర్తుందయ్యా. నేను ఏదో ఒక వర్గానికి గుర్తింపునివ్వాలి'' అన్నాడు జోషువాగారు.

"తమరి బోడి గుర్తింపు మాకేం అక్కర్లేదు'' అన్నాడు బులేరావు.

"మరి ఆ ఏడుపు ముందే ఏడవ్వచ్చుగా. నేనేం చేయాలో చేసేవాణ్ణి' అన్నారు జోషువాగారు.

"అధ్యక్షా! గౌరవనీయ సభ్యులపట్ల మీరు నిందాపూర్వకంగా మాట్లాడటం గర్హనీయం" అన్నాడు లెబా.

"నేనెవర్నీ నిందించలేదు''

"మా బులేరావును ఏడవమన్నారు మీరు'' అన్నాడు సిపిఐ శర్మ.

"వాడు 'బోడిగుర్తింప'నలా. అది నీ బుర్రలోకి పోలా? అయినా ఏడుపు మొహం వాడిని ఏడవమనక నవ్వమనాలా?" అడిగాడు జోషువాగారు.

"ఆయనదేం ఏడుపు మొహం కాదు, మీదే ఏడుపుమొహం" అంది మణి ఏడుపు గొంతుతో.






"గౌరవనీయులైన అధ్యక్షుల్ని నిందించటం ఎంతవరకు మర్యాద?" అంది భాను.

"ఆయన్నెవరు నిందించారు?" అడిగింది ఆన్నీ.

"మరి మణి అన్నదేమిటి?" అడిగింది నాయకి.

"తన బాధ తను వెళ్ళ బోసుకున్నది?"

"ఏం బాధమ్మా! భర్తకు పదవిపోయిందనా?" అంది కన్య.

"ఆయన ఇప్పటికీ 'కివాసం' కార్యదర్శే'' అంది మణి.

"సభ్యులు ఆ విషయం తేల్చేశారులే. నువ్వింక మాట్లాడకు'' అంది ఓల్గా.

"నువ్వు బులేరావు 'కాకామం'లో మహిళా ప్రతినిధివి. ఆయన 'కాకామం'కి వ్యతిరేకంగా మాట్లాడరాదు నువ్వు'' అన్నాడు శర్మ భార్యకు జ్ఞానబోధ చేయాలనే సత్సంకల్పంతో.

"అదేంమాట! నీ 'కాకామం'లో ఆయన కార్యదర్శి'' అంది ఓల్గా.

"సరే, అదేలే'

"కాని, నేను రాజకీయాలకు స్వస్తి చెప్పేశాను. 'కృష్ణా! రామా:' అనుకుంటూ ఆధ్యాత్మిక చింతనతో జీవితం గడపాలనుకుంటున్నాను''

"ఇదెప్పటినుండి?"

"ఎప్పటినుండో మనసులో వున్నదే. ఆ సాయిరాముడి దర్శనమైంతర్వాత మనసులో భావన బలపడింది. ఇంక నేను మహిళా ప్రతినిధిని కాను. ఏ వర్గానికీ చెందను. నాకు ఎవరికీ వత్తాసు పల్కాల్సిన అవసరంలేదు. ఆ సాయిరాముడే సాక్షి'' అంది ఓల్గా భక్తిపారవశ్యంతో కనులుమోడ్చి.

సిపిఐ శర్మకు బుర్రతిరిగిపోయింది.

జోషువాగారు టేబిల్‌మీద చేత్తో చరిచాడు, "ఇప్పుడు కాంగోరెడ్డి 'కాకామా'నికి మద్దతు వుందో లేదో తేల్చుకోవాలి. ఇందాకటి పద్ధతినే ఓటింగ్ చేయవల్సివుంటుంది'' అన్నాడాయన.

ఓట్ల లెక్కింపు తర్వాత కాంగోరెడ్డికి 12 ఓట్లు వచ్చాయి. మొత్తం సభ్యుల సంఖ్య ఇరవై అయినా ఓట్లు ఇరవైరెండు. అందులో ఆరు బులేరావు పక్షాన, పన్నెండు కాంగోరెడ్డి పక్షాన పోలయాయి. మిగిలిన నలుగురూ ఎవరికీ ఓటు చెయ్యలేదు. ఆ నల్గురెవరో తెలియలేదు. మేమిద్దరం మరి ఇద్దరు?

జోషువాగారు లేచాడు కుర్చీలోంచి, "మెజారిటీ సభ్యులు కాంగోరెడ్డి "కాకామం'పై విశ్వాసం చూపారు. అందువల్ల అతనీ 'కాకామం'కే గుర్తింపు లభిస్తుంది. కాంగోరెడ్డి సత్సంప్రదాయాలతో మీ సంఘాన్ని నడపాలనీ, అద్దెపెంపు విషయంలో త్వరగా నిర్ణయం తీసుకుంటాడనీ ఆశిస్తూ, నాకీ అవకాశం ఇచ్చిన మీకందరికీ కృతజ్ఞతలు చెప్తున్నాను. కార్యదర్శి కృతజ్ఞలతో ఈ సభ ముగుస్తుంది'' అని ప్రకటించాడు జోషువాగారు. కాంగోరెడ్డి కృతజ్ఞతలు చెప్పటంతో సభ ముగిసింది.

భోజనాలప్పుడు మా ఆవిడ టూరు విశేషాలు చెప్పసాగింది. "అబ్బ! ఎంత హాయిగా జరిగిందండీ ట్రిప్పు. మీరూ వస్తే బాగుండేది. ఆ కాంగోరెడ్డి మహాసమర్థుడు. మేం అణుమాత్రం ఇబ్బంది పడకుండా నిర్వహించాడు. ఓల్గాకి కాలు బెణికితే ఎంత సేవ చేశారనీ ఆ తండ్రీ, కూతురూ. జైన్‌కు మోషన్సు పట్టుకున్నాయి. ప్రాణంపోయినంత గోల పెట్టాడాయన. కాని కాంగోరెడ్డి దగ్గరుండి అన్నీ చూశాడు. ప్రదేశాలు చూపించాడు. అక్షనాథ్ ఆ చారిత్రాత్మక విశేషాలు ఎంత చక్కగా చెప్పాడనీ. కాంగోరెడ్డి బాగా తెల్సినవాడు, మహాదక్షత కలిగినవాడు..." అంటూ కాంగోరెడ్డి భజన మొదలెట్టింది. ఇంతకు ముందు సిపిఐ శర్మ వాళ్ల బ్రెయిన్ వాష్ చేశాడంటే నేను వ్యతిరేకించాను కాని, ఇప్పుడు ఆయన మాటల్లో సత్యం నాకు బోధపడ్డది.

"సరేలే... ఇదో పొలిటికల్ స్టంటు. అంత కష్టపడినందుకు వచ్చి ఫలితం చూపించారుగా?"

"మీరెప్పుడూ ఇంతేలెండి. ఇతర్లలో గొప్పతనం గుర్తించటం ఇష్టముండదు మీకు''

ఆ తర్వాతి ఆదివారం జరిగిన 'ససస'లో ఇంటి అద్దె పెంపు విషయంలో ఓ తీర్మానం తీసుకున్నాం. లెబా అన్నాడు, "జోషువా మనలో మనకి చీలికలు తెస్తున్నాడు. సమస్య లేనిచోట సమస్య సృష్టించాడాయన. బులేరావు అద్దె ఎందుకు పెంచాలి? అసలు మనమందరం అద్దె ఎందుకు పెంచాలి? కనుక నేను మీకు మనవి చేసేదేమంటే మనం ఎవరం బులేరావుతోసహా, అద్దె పెంచం, ఇల్లు ఖాళీచేయం. ఈ విషయం ఆయనకి స్పష్టంగా చెబ్దాం. మనం సంఘటితంగా ఆయన్ని ఎదుర్కుంటే మనం జయించగలం" అని.

ఆ ఆలోచన అందరికీ నచ్చింది. ఎవరి ఇంటరెస్టులకు భంగం వాటిల్లదు కనుక యాజమాన్యం ప్రతిచర్య గైకొంటుంది కనుక ఓ యాక్షన్ కమిటీని వేశాం. దాంట్లో సభ్యులుగా కాంగోరెడ్డీ, బులేరావు, సిపిఐ శర్మ, పరేషాన్‌రావు, హరబాబులను ఎన్నుకోవటం జరిగింది.

ఆ రోజు రాత్రే ఏక్షన్ కమిటీ సభ్యులు జోషువాగారికి ససస నిర్ణయం తెలియచేశారు. కిరాయి వాసులందరివద్దా మామూలు అద్దె వసూలుచేసి, ఈ భాగానికింత అని లెక్కచెప్పి ఆయనకిచ్చారు. ఆయన ఏం మాట్లాడకుండా పుచ్చుకున్నాడట. మర్నాటి నుండి జోషువాగారు ఏం చేస్తాడా అని ఎదురు చూస్తున్నాం. ఎక్కడ ఎలక్ట్రిసిటీ కనెక్షన్లు పీకుతాడో, మునిసిపాలిటీ పంపు కనెక్షన్లు తీస్తాడోనని భయం భయంగానే వుంది. గన్ పట్టుకుని కాల్చేస్తానని వస్తాడేమోనని కొంత మంది భయపడుతున్నారు. అయితే ఆయనేం చెయ్యకుండానే మూడు రోజులు ప్రశాంతంగా దొర్లిపొయ్యాయి.

గురువారం నాడు ఆయన ఇంటి మెట్ల




ముందు ఓ షామియానా వేయించాడు. షామియానాలో ఓ పరుపు పరిపించి, ఎత్తు దిండ్లు పెట్టించాడు. మిగతా భాగంలో చాపలు పరిపించాడు. షామియానాలో ఒకవేపు సాయిబాబా పటం తగిలించాడు. ఓ పెద్ద కుండలో ఓ మూల నీళ్లు పెట్టించాడు. ముందు భాగంలో నీట్‌గా రాయబడిన ప్లకార్డులు వేలాడుతున్నాయి. 'డౌన్‌విత్ ద టిరనీ ఆఫ్ టెనెంట్స్' అనీ, 'కిరాయివాసుల దౌర్జన్యం నశించాలి' అనీ వున్నాయవి. వీటన్నిటికీ పైన 'కోర్కెల సాధనకై ఆమరణ నిరాహార దీక్ష' అని రాసివుంది.

అరేంజ్‌మెంటంతా అయింతర్వాత పది గంటలకు జోషువాగారు రంగ ప్రవేశం చేశాడు, ఓ చేతిలో కొంకికర్ర, మరో చేతిలో సిగార్, పొగాకు డబ్బాతో.

"ఏమిటండీ ఇదంతా?" అనడిగాను ఆయన్ని.

"ఆమరణ నిరాహార దీక్షయ్యా! నేను ఏమీ చేయలేని ముసలివాడిననుకున్నారుకదూ? చూస్తాను, చచ్చయినా సాధిస్తాను. అద్దె పెంచరా? ఇల్లు ఖాళీ చెయ్యరా? చూస్తాను..." అని "డౌన్ విత్‌ద సోషలిస్ట్ ఇంపీరియలిజం ఆఫ్ ద ప్రొలెటేరియట్, టెనెంట్స్ డౌన్‌డౌన్, కిరాయి వాసుల దౌర్జన్యం నశించాలి'' అని నినాదాలిచ్చాడు.

"కాని ఇంతమందిని మీరు ఒకళ్లు ఎలా సాధిస్తారండీ'' అనడిగాను.

"మహాత్మాగాంధీ ఒక్కడుకాదా? రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాన్ని గడగడలాడించాడే ఆయన. అహింసా పద్ధతిలో సత్యాగ్రహం సాగించి మిమ్మల్ని న్యాయమార్గానికి మళ్లిస్తాను. ఐ ఎన్‌కౌంటర్ యువర్ బ్రూట్ ఫోర్స్ విత్‌ద ఫోర్స్ ఆఫ్ మై సోల్' అన్నాడాయన.

"ఈ వయసులో నిరాహార దీక్ష ప్రమాదమండీ'' అన్నాను నేను.

"ఇట్స్ నెవ్వర్ లేట్ టుడు ఎనీథింగ్. వయస్సొక అడ్డంకి కాదు. ఆత్మబలం, ఆత్మశక్తులతో పోరాడతాను. ఐ హేట్‌ద ఈవిల్ నాట్ ఏజెంట్. మీ కివాసుల మానసిక పాప ద్రోహ చింతనలపై నా దాడి. మీపైకాదు. మీ చెడు నశించి, మంచి వ్యక్తులవాలనే నా ప్రయత్నం. ఈ ఆశయ సాధనలో నేను నశించిపోతే పోనీ, నాలాంటివాళ్లు ఇంకా పుట్టుకొస్తారు. ఎప్పటికైనా మీరు ధర్మ మార్గంలోకి అడుగుపెడ్తారు. ఇది తప్పదు. ధర్మం జయిస్తుంది'' అన్నారాయన ఉద్రేకంగా.

మా సంభాషణ ఇలా సాగుతుండగా జోధలోకివాసులు ఒక్కొక్కరే రాసాగారు.

"అంతా బాగానే వుంది. ఈ సిగారు, పొగాకు డబ్బా ఇవెందుకు?

"గాలి పీల్చాలి కదయ్యా! వట్టిగాలి నాకు పడదు. సిగార్ పీల్చటం, నిమ్మకాయ రసం తాగటం ఇదే నా ఆహారం. మీరు దారికి వచ్చేదాకా ఆమరణ నిరాహార దీక్ష సాగిస్తాను''

"మేం దారికి రావటమంటే ఏం చెయ్యాలి?"

"అద్దె పెంచాలి. ఇల్లు ఖాళీ చెయ్యమన్నప్పుడు చెయ్యాలి. ఇది న్యాయం, ధర్మం. ధర్మం విడిచి ప్రవర్తించిన వాడెవడూ బాగుపడడు. 'ధర్మో రక్షతి రక్షితః'"

"ఇలా మీరు శాపనార్థాలు పెట్టటం బావుందా?"

"శాపనార్థాలు కాదు, మీరందరు ధర్మమార్గాన నడవాలని నా కోరిక. 'ఓగాడ్! ఫరిగివ్ దెం, దె డోంట్ నో వాట్ దె డూ' అన్నారు జోషువాగారు జీసస్ ఫక్కీలో చేతితో సిలువ వేసుకుంటూ.

"మరక్కడ క్రీస్తు బొమ్మో, గాంధీ బొమ్మోపెట్టక సాయిబాబా పటం తగిలించారెందుకు?"

'ఎంత అజ్ఞానివయ్యా' అన్నట్టు చూశాడు

జోషువాగారు.

"నాధ్యేయం ఇహ పరసాధన. ఇహసాధన కై గాంధీగారి అహింసా వ్రతాన్ని అవలంభిస్తున్నాను. ఆత్మహింసవల్ల ఇతరుల మనసుల్లోని దుర్మార్గాన్ని గుర్తుకు తెస్తున్నాను. ఒక విధంగా ఇది ఇహమేకాదు, పర సాధనకూడా. సాయిబాబా పటం ఎందుకు పెట్టానంటారా? జీసస్‌వేరు, సాయిబాబా వేరుకాదు నా ఉద్దేశంలో. ఆ ప్రభువులిద్దరూ సమస్త మానవాళి సంక్షేమాన్నీ ఆశించినవాళ్లు. అన్ని మతాల, కులాల సమన్వయమూర్తి సాయిబాబా! ఈ సాయి రాముని కృపలో ఈ జీవితం ఇలా గడిచిపోతే చాలు. ఇది పరసాధన. అర్థమైందా?" అన్నాడు జోషువాగారు.

ఏక్షన్ కమిటీ సభ్యుల్లో కొంచెం గాభరా మొదలైంది.

"ఎందుకండీ ఈ నిరాహారదీక్ష" అనడిగాడు పరేషాన్‌రావు.

"ఈ జీవితాన్ని ప్రజాసేవలో గడపాలని తీర్మానించుకున్నాను. అది మీరు కొనసాగని వ్వటం లేదు. ప్రతిగా ఆమరణ నిరాహార దీక్ష స్వీకరించాను''

"మరింకేం అంత ప్రజాసేవ చేయాలనుకున్నప్పుడు అద్దె పెంచమని అడగటమెందుకు?" అడిగాడు శర్మ.

"అక్కడే మీకు విషయావగాహన లేదు. అద్దె పెంచటం నాకోసం కాదు. ఆ రూపాయి, ఆ రూపాయి కూడబెట్టి ఇంకో నిరాశ్రితుడికి ఆశ్రయం కల్పించాలనీ, మీకెలాంటి ఇబ్బందులూ లేకుండా చేయాలనే నా ఆదర్శం, మీరర్థం చేసుకోక మూర్ఖపు పట్టుపట్టి కూర్చున్నారు. ఆ సాయినాధుడే మీ మనసు మారుస్తాడు. జ్ఞానోదయం కల్గిస్తాడు. 'నేను నిమిత్తమాత్రుణ్ణి. అంతావాడి దయ" అన్నాడు చేతులు ఆకాశంవైపు తిప్పి జోషువాగారు.

రాత్రికి నేను కాలేజీనుండి వచ్చేటప్పటికి షామియానాలోనుండి జోరుగా సాయిబాబా భక్తి కీర్తనలు వినపడ్తున్నాయి. జోధలో మహిళామణులందరూ అక్కడ చేరారు. షామియానాలో వంద కాండిలు పవరు బల్బు పెట్టారు. జోషువాగారు బొంగురు గొంతుతో పాడుతుంటే, మహిళామణులు తాళం వేస్తూ తామూ గొంతులు కలుపుతున్నారు. పిల్లలు కూడా చేరి పాటలు పాడ్తున్నారు.

"సాయి శరణం... సాయి శరణం' పాట విన్పిస్తోంది.

మా ఆవిడ ఆ భక్తి పారవశ్యంలో మునిగి ఇంటికొచ్చేటప్పటికి పదకొండు గంటలైంది.

"జోషువాగారి బుట్టలో బాగానే పడ్డారు మీరంతా'' అన్నాను నేను.

"ఇందులో బుట్టలో పడటమేముంది. సాయీ సమాజం ఏర్పాటు చేసుకున్నాం. హరినామ సంకీర్తన చేస్తున్నాం, ఇందులో తప్పేంవుంది?" అనడిగిందామె.

"ఇంత హఠాత్తుగా ఆయన సాయీభక్తుడయాడేమిటా అని నాకాశ్చర్యంగా వుంది''

"ఆ బాబా ఎప్పుడెవరికి ఎలా దర్శనమిచ్చి మనిషి జీవిత గమనాన్ని ఎలా మారుస్తాడో ఎవరికి తెల్సు?"

"సరే, ముందే సాయి సమాజం ఏర్పాటు చేసుకున్నారా? షామియనాలోకి వెళ్లింతర్వాత వచ్చిన ఆలోచనా ఇది?"

"జోషువాగారు సాయీ భజనకీర్తనలు పాడుతుంటే ముందు ఓల్గా వెళ్లింది. ఇహ ఒక్కొక్కళ్లమూ వెళ్లాం. ప్రతి గురువారం సాయీభజన చెయ్యాలని తీర్మానించుకున్నాం. అబ్బ! ఆన్నీ గొంతు ఎంత బావుంటుందనుకున్నారు. చక్కగా పాడింది. మైకేల్ కూడా పాడాడు. ఇప్పటికి మన జోధలోలో సరైన సమైక్యత ఏర్పడింది. ఒకరంటే ఒకరికి గౌరవం, అభమానం ఏర్పడ్డాయి'' అంది

"జోధలోలో ఆడాళ్లే కాదు, మొగాళ్లూ వున్నారు. వాళ్లల్లో ఐక్యత ఏర్పడలేదు. నువ్వనే గౌరవం, అభిమానం ఏకోశానా లేవు వాళ్లల్లో'




"ఎవరి సమయమొచ్చినప్పుడు వాళ్లు మారతారు. ఇప్పుడు జోషువాగారు· మార లా?"

"ఇంతకీ ఆయన నిరాహార దీక్ష సక్ర మంగా జరుపుతున్నాడా లేక దొంగతిండి ఏమన్నా తింటున్నాడా?"

"ఛీఛీ! నికార్సయిన మనిషాయన. కుంటి ఆలోచనలు తప్ప సక్రమంగా ఆలోచించే బుద్ధే లేదు మీకు!"

"అంత ఆధ్యాత్మిక చింతనలో పడ్డ మనిషి మరి సిగార్ ఎందుకు కాలుస్తున్నారో"

"దాంట్లో తప్పేముంది. మీరు సిగరెట్లు కాల్చటంలా?"

"నేను మామూలు మనిషిని. బలహీనత లున్నవాణ్ణి. నేనేం మహా భక్తుణ్ణని చెప్పుకోవ టంలేదు''

"భక్తులు కూడా మనుషులే. బాబా కూడా చిలుము పీల్చేవాడు. మీరింకేం మాట్లాడ కండి''

"జోషువాగారు పెద్ద ఎత్తే ఎత్తారు. ఆ నిరాహార దీక్షలోని అసలు మర్మం తెలీక, భక్తిలో పడి తల మునకలయి పోతున్నారు మీరు''

"మాకు తెలియందేం లేదు. ఆయన నిరా హార దీక్షపట్టి, ఆ షామియానా వేయించబట్టే కదా! మేమందరం అక్కడ సమావేశమవగ లిగాం. ఆc మర్చిపోయా, మన ఇంటివెనుక పునాదుల్లేచి వున్నాయి చూశారూ, అక్కడో హాలు కట్టిస్తానన్నారు జోషువాగారు. బాబా విగ్రహం ఒకటి ప్రతిష్ఠించుకుంటే అదే ఓ దేవాలయమైపోతుంది. గురువారం భజన సమావేశాలక్కడ జరుపుకోవచ్చు''

"వాగ్దానాలు కూడా చేసేస్తున్నాడన్నమాట అయితే''

"చాల్లే ఊర్కోండి, అక్కడ పెద్దమనిషి తిండీ తిప్పల్లేకుండా పడివుంటే మీకు మాట్లా డటానికి నోరెట్టా వచ్చిందంట?" అని కసిరింది మా ఆవిడ.

ఆధ్యాత్మిక దుమారం మొదలైంది. రెండోరోజుకు అది ఉధృతంకాసాగింది. పొద్దు న్నే వచ్చి కూగాశాస్త్రి 'భగవద్గీత' విన్పించా డు జోషువాగార్కి. మధ్యాహ్నం అంతా కూతురు మిద్దె దొరసాని 'బైబిలు' పారాయ ణంచేసింది. సాయంత్రం జైన్ 'ఖురాన్' పఠనం చేశాడు. జోషువాగారు సిగార్‌లో నుండి గుప్‌గుప్‌న పొగవదుల్తూ, నిమీలితనే త్రుడై త్రిమత పవిత్ర గ్రంథపారాయణాన్ని శ్రద్ధాళుడై విన్నాడు. మళ్ళీ రాత్రికి సాయీ భజనసాగింది.

ఏక్షన్ కమిటీ సభ్యులకు ఈ హఠాత్ పరిణామంవల్ల దిక్కుతోచలేదు. `మహిళామ ణులు సాయిభజన సాగిస్తుండగా ఐదుగురు సభ్యులు, లెబాతో సహా నాదగ్గరకొచ్చారు.

"అనుకోని పరిస్థితి వచ్చింది పోనీ బా బూ! మనమిప్పుడేం చేయాలో సలహాఇ వ్వు'' అన్నాడు కాంగోరెడ్డి.

"మూడు ఆల్టర్నేటివ్‌లు కన్పిస్తున్నాయి నాకు. మొదటిది- మన ఆడవాళ్ళను షామి యానాలోకి పోకుండా ఆపటం, రెండు ఏమ వుతుందో వేచిచూడటం, మూడు ఆయన డిమాండు చేసినట్టు అద్దె పెంచటం" అన్నా ను.

"మూడూ లాభంలేదయ్యా! స్త్రీలను షామి యానాకు దూరంగా వుంచటం మనతరంకా దు. వేచి చూడటమంటే నాకు భయంగా వుంది. ముసలాడు తిండి లేక నీరసించి టపాకట్టేస్తే ఆ ఉసురు మనక్కొడుతుంది. మూడోది అద్దె పెంచటమంటే యాజమాన్యా నికి లొంగిపోవటమే''అన్నాడుసి.పి.ఐ. శర్మ.

"ఇళ్ళద్దెలు చూస్తే జోషువాకి మనం ఇచ్చే కిరాయి చాలా తక్కువ. ఆ పాతికా పెంచినా కూడా, అంతకు బయట మనకెక్క డా ఇల్లు దొరకదు. పోనీ కనీసం, పది రూపాయలు పెంచుదాం" అన్నాను.

"ఇప్పుడదీ లాభంలేదు. ఇప్పుడు మనం

బేరానికి వెళ్ళామంటే కొమ్మెక్కి కూర్చుంటా డాయన" అన్నారు శర్మ.

"ఆయన్ని ప్రలోభ పెట్టటమొక్కటే మార్గంగా కన్పిస్తోంది నాకు. పార్టీ తీసుకుందామని చెప్పి, ఆయనకీ ఓ పెగ్ బ్రాందీ ఆఫర్ చేస్తే, మానవుడు మాట్లాడకుండా పుచ్చుకుంటాడని నా ఉద్దేశం" అన్నాడు బులేరావు.

"ఆయన పుచ్చుకోడు. ఆయన పుచ్చుకోదల్చినా, మన ఆడవాళ్ళు లిక్కర్ సీసాలతో మనల్ని అక్కడ ప్రవేశించనీయరు. ఒకవేళ అక్కడకెలాగో వెళ్ళినా మనకు ఇంట్లో పుట్టగతులుండవు'' అని స్పష్టం చేశాడు శర్మ

"నాకయితే అన్పిస్తున్నది ఏమీకాదని. చూద్దాం, ఎన్నిరోజులు నిరాహారదీక్ష వుంటాడో" అన్నారు లెబా. బాగా దిగిపోయాడు మనిషి. ఈ పరిణామాన్ని ఊహించలేదతను.

"అసలు విషయం మీరు గుర్తించటంలేదు. మన మహిళామణులు ఆయన్ని ఎక్కువరోజులు ఇబ్బందిపెట్టకుండా బయటపడేయిస్తారు. కాబట్టి పెద్ద ప్రమాదం జోషువాగారు కాదు. మన ఆడవాళ్ళు. 'ఆడవాళ్ళున్నారు జాగ్రత్త!'" అన్నాను.

"అయ్యా! నేనందుకే ఈ ఆడాళ్ళకు సంఘ సభ్యత్వమివ్వవద్దని నెత్తీ నోరూ కొట్టుకుని మొత్తుకున్నాను. మీరెవరూ నా మాట వినలేదు. చివరికీ కాడికొచ్చింది. ఇవాళ తెలుస్తోంది. నా మాటల్లోని సత్యం" అన్నాడు బులేరావు.

"నీ అభిప్రాయం తప్పు. మనం వాళ్ళకు సంఘసభ్యత్వం ఇవ్వకపోయినా ప్రస్తుత ప్రమాదం తప్పేది కాదు'' అన్నాను.

"ఇదంతా కాంగోరెడ్డి చేసిన నిర్వాకం. వాళ్ళని షిర్డీ తీసుకెళ్ళి చెడగొట్టాడు'' అన్నాడు బులేరావు.

"చెప్పకయ్యా, మీ ఆవిడ సిర్డీకొచ్చి చెడిపోలేదుగా, ముందు ఆవిణ్ణి షామియానాకు వెళ్ళకుండా ఆపి, నువ్వేమయినా అను, నేను పడతాను. అనవసరపు మాటలనొద్దు'' అన్నాడు కాంగోరెడ్డి.

"ఇంకో ఆల్టర్నేటివ్. మనం భాగాలవాళ్ళం వున్నాం కదా! బులేరావుకు పెంచిన అద్దె యాభై రూపాయలు మనం పంచుకుంటే తలకు ఐదు రూపాయలు కూడా పడవు. అందరూ బులేరావుకిస్తే ఆయన తన భాగానికి మాత్రం అద్దె పెంచానని చెప్పి, జోషువాగారికి అద్దె చెల్లిస్తారు. ఇది తక్కువ మొత్తంలో పోతుంది. మన అండర్‌స్టాండింగ్ యాజమాన్యానికి తెలియాల్సిన అవసరం లేదు'' అన్నాను.

"అలా వీల్లేదు. నేను ఒక్కణ్ణే అద్దె పెంచాను అంటే నేను లోకువైపోతానాయనకు'' అన్నాడు బులేరావు.

"పైగా బులేరావు ఒక్కడే అద్దె పెంచితే ప్రయోజనమేందీ? అప్పుడు రిపేర్లేమీ చెయ్యనన్నాడుగా జోషువాగారు'' అన్నాడు లెబా.

"ఇంకోమార్గముంది, అదెంతవరకు ఆచరించగలమో తెలీదుగానీ'' అన్నాను.

"ఏమిటది?" అడిగారు అందరూ ఉత్కంఠతతో.

"ఆయనకు ప్రతిగా మనం కూడా ఇంకో టెంట్‌వేసి, ఎవరైనా ఆమరణనిరాహారదీక్ష పడ్తే అప్పుడు మహిళాసభ్యులమీద ఆయన స్పెల్ కొంతవరకు తగ్గించగలం. వాళ్ళు మనవైపు తిరగొచ్చు'' అన్నాను.

"స్ప్లెండిడ్! అందుకేనయ్యా చక్కటి ఆలోచనలు చెప్తావనే నీదగ్గరకు రావటం" అన్నారు శర్మ.

"ఎవరు పడ్తారు నిరాహారదీక్ష? కాంగోరెడ్డే దీనికి సమర్థుడు. పైగా నిరాహారదీక్షల కాంగ్రెసువారసత్వం వుంది ఆయనకు. 'జోధలోకి వాసం' కార్యాదర్శిగా కూడా ఆయనపై ఈ గురుతర బాధ్యతవుంది'' అన్నాడు బులేరావు.

"ఈ నిరాహారదీక్షలు నావల్లకావు. సమస్య నీవల్ల వచ్చింది, కనుక నువ్వే మొదలె





ట్టు, ఉచితంగా వుంటుంది'' అన్నాడు కాంగోరెడ్డి.

"నావల్ల కాదు. ఒక్కరోజు తిండిలేకపోతే విలవిల్లాడిపోతాను. మీరేమంటారు శర్మగారూ?"

"నేనీ నిరాహారదీక్షలకు వ్యతిరేకిని. దీన్ని నేనొప్పుకోను''

"మరి స్ప్లెండిడ్ ఐడియా అన్నావు కదయ్యా. అప్పుడే జారిపోయావు. పోనీ లెబా పడ్తాడులే'

"నా సలహా వేచి చూడమని. అహింసా సిద్ధాంతానికి నేను వ్యతిరేకిని. వీటిల్లో నాకు నమ్మకంలేదు''

హరబాబు, పరేషాన్‌రావులు అంతకు ముందే కాళ్ళు బారజాపారు, తమవల్ల కాదని.

"మీరే నిరాహారదీక్ష పట్టాలి. మన తెలుగువారి ప్రతిష్ట కాపాడాలి'' అన్నాడు బులేరావు నాతో.

"నేనసలు మనం చేపట్టిన కార్యక్రమం అన్యాయమని భావిస్తున్నాను. బయటి అద్దెలతో పోలిస్తే మనం ఇచ్చేదెంత. ఎప్పుడో అయిదేళ్ళకో, ఆరేళ్ళకోగాని జోషువాగారు మనల్ని అద్దె పెంచమని అడగడు కదా! ఆయన అద్దె పెంచమని అడగటంలో కూడా సబబు వుంది. రిపేర్లకీ వాటికీ ఖర్చు ఆయన చేతినుండి పెట్టుకోవాలా? అనవసరంగా మూర్ఖపు పట్టు పట్టి కూర్చున్నాం. ఇందువల్ల మనం సాధించేదేం లేదు. కనుక నేను నిరాహారదీక్ష పట్టాల్సిన పనిలేదు'' అన్నాను.

"నువ్వు యాజమాన్యం కాపుకాసే తాబేదారువు. మొదట్నించీ చూస్తున్నాను. జోషువాకు వత్తాసు పల్కటంతప్ప సంఘ సంక్షేమాన్ని గురించి ఆలోచనేంలేదు నీకు'' అన్నాడు బులేరావు.

"పోనీ ఓ పనిచేస్తే, రిలేనిరాహారదీక్షలు పడ్తాం" అన్నాడు హరబాబు.

"బావుందయ్యా ఐడియా, మొదటిరోజు మనం ఏక్షన్ కమిటీ సభ్యులం కూర్చుందాం" అన్నాడు రెడ్డి.

"దీనివల్ల ప్రయోజనమేంలేదు, అపహాస్యం పాలుకావటంతప్ప'' అన్నాను.

"భారతంలోని శకునిలాగ అందరి ఉత్సాహాన్నీ నీరు కార్చకు. నిరాశావాదంతో మనమేమీ సాధించలేము'' అన్నాడు బులేరావు.

"రెండో బాచిలో మీరు కూర్చోవాలి'' అన్నాడు సిపిఐ శర్మ.

"చెప్పాగా, ఈ కార్యక్రమంతో నేనంగీకరించటంలేదని. అందువల్ల నా సహకారమేమీ ఆశించకండి మీరు'' అన్నాను.

"అసలు మిమ్మల్ని కన్‌సల్ట్ చేయటం మాదే బుద్ధితక్కువ. పదండిపోదాం, ఈయనతో మాట్లాడి ప్రయోజనంలేదు'' అన్నాడు కాంగోరెడ్డి.

మర్నాటికి జోషువాగారి టెంట్ కెదురుగా మరో షామియానా వెల్సింది. కావాల్సిన సామానంతా సమకూర్చటం జరిగింది. లోపల 'జోధలో కివాసం' అనీ, దానికింద 'రిలే హంగర్ స్ట్రైయిక్ కాంప్' అనీ బానర్లున్నాయి. పదిగంటలకు సంఘసభ్యులను సమావేశపర్చి కాంగోరెడ్డి ప్రారంభోపన్యాసం చేయటంతో కాంప్ ప్రారంభమైంది. అండమ్మ వచ్చి దీక్షాధారులకు కుంకుమబొట్టు పెట్టింది, రాచిప్పచెట్టి ఐదుగురికీ మెళ్ళో పూలమాలలు వేశాడు. కాలక్షేపానికి మైకులో పాటలు వేయసాగారు. ఎదుటి టెంట్ నుండి జోషువాగారు నీరసంగా వాళ్ళవంక చూస్తూ సిగార్ పొగ గుప్పుగుప్పున వదుల్తున్నాడు.

పిల్లలంతా పోగయారు టెంట్‌చుట్టూ. పిల్లల్ని చూడగానే ఆవేశమొచ్చింది సిపిఐ శర్మకు. ఆయన 'కివాసులపై యాజమాన్యం జులుం' అని నినదించగానే, పిల్లలందరూ 'నశించాలి' అని అరిచారు. జోషువాగారు, అనంగానే, 'డౌన్‌డౌన్' అనర్చారు. అటువైపు టెంట్‌లోనుండి కూడా నినాదాలు మొదలయ్యాయి. మైకేల్, మిద్దెదొరసానీ 'కిరాయి

వాసుల జులుం నశించాలి. 'టెనెంట్స్ డౌన్ డౌన్' అనీ అరిచారు.

"అరిచీ, అరిచీ గొంతు నెప్పిపుట్టిందిరా, పద చాయ్ తాగొద్దాం" అన్నాడు మైకేల్ ఇటువైపు టెంటులోవున్న అక్షనాధ్‌తో.

"సరే పద" అన్నాడు అక్షనాధ్ టెంట్‌లో నుండి బయటకొస్తూ.

"యాజమాన్యంతో మనం చేతులు కలప కూడదురా'' అన్నాడు శర్మ కొడుకు నుద్దేశించి.

"నేనా! అయినా, ఇందులో చేతులు కలపటమేముంది! చాయ్ తాగొచ్చి మళ్ళీ నినాదాలిస్తాం, అటువాడూ, ఇటు నేను. మరీ నీరసంగా వుంది'' అన్నాడు అక్షనాధ్ తండ్రితో.

ఇద్దరూ కల్సివెళ్తూంటే, ఏం చేయలేక చూస్తూండిపోయింది సిపిఐ శర్మ బృందం.

నిష్పక్షపాతంగా త్రిమతాచార్యులు తమ తీరిక సమయాల్లో వచ్చి, వీరి ఆత్మశాంతికి త్రిమత పవిత్ర గ్రంధ పారాయణం చేశారు. ఈ టెంట్‌లో 'బైబిలు' పారాయణం కన్య చేపట్టింది. మధ్యాహ్నం రెండు గంటలయేసరికి బులేరావు, హరబాబు, పరేషాన్‌రావులు వేలాడబడి పోయారు. కూగాశాస్త్రి వచ్చి భగవద్గీత చదువుతూంటే, ఆపవయ్యా నీగోల, అసలే నీరసంతో ఛస్తూంటే'' అన్నారు హరబాబు.

"మేమిక్కడ ఆమరణనిరాహారదీక్ష పట్టలేదు. కావాలంటే ఆ ఎదుటి కాంపులోకెళ్ళి చదువు'' అన్నాడు పరేషాన్‌రావు.

"మంచిది. అసలు నేనిక్కడికి రావాలని అనుకోలేదు. జోషువాగారే మీ ఆత్మశాంతికై కాస్తంత గీతాపారాయణం చేసి రమ్మంటే వచ్చాను'' అన్నాడు కూగాశాస్త్రి.

"ఆయన మన శత్రువు, నువ్వాకాంపులోకి వెళ్ళొద్దు'' అన్నారు సిపిఐ శర్మ.

"చచ్చేమనిషికి శత్రువేంటండీ. ఈలోకంలోనే మనకు శతృత్వాలు, మిత్రత్వాలు. పోయినాక తద్దినాలు పెట్టటం తప్ప మనకా మనిషి కన్పడతాడా? మనం మాత్రం ఉట్టిగట్టి ఊళ్ళేలుతామా? ఎప్పుడో పోయేవాళ్ళమే మనమూను. అక్కడకు వెళ్ళొద్దన్నా నేమానను. ఏదో నా వంతు సేవచేయకుండా వుండలేను.'' అని 'భగవద్గీత' చంకపెట్టుకుని జోషువాగారి టెంట్‌లోకెళ్ళిపోయాడు కూగాశాస్త్రి.

"వాడి దుంపతెగ, మనమందరం పోయినట్లు ఏందా అవాకులు, చెవాకులు'' అన్నాడు బులేరావు.

"అసలు విషయం గమనించటంలేదయ్యా మీరు. మగసభ్యులు కూడా ఆ కాంప్‌లో కూర్చుంటే ఇహ ఉద్యమం సక్సెస్ అయినట్టే. ముందా జైన్‌ని పిల్చి ఆ టెంట్‌లోకి వెళ్ళొద్దని కట్టడిచెయ్యండి'' అన్నాడు సిపిఐ శర్మ.

నేను రాత్రి కాలేజీనుండి ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి, సంఘ సభ్యుల టెంట్‌లో జనం ఉత్సాహంగా వున్నారు. యాజమాన్యంవారి టెంట్ నిశ్శబ్దంగా వుంది. ఆడమళయాళమంతా అక్కడే వుంది. జోషువాగారు నీరసమొచ్చి పడిపోయాడు, పల్స్ బీట్ పడిపోయింది, మైకేల్ సెలైన్ డ్రిప్ పెట్టాడు. ఒక బాటిలు పూర్తవ్వస్తున్నది. అందరూ ఆయన వంక చూస్తూ కూర్చున్నారు ఆత్రుతగా. కొంతసేపటికి ఆయన కళ్ళు తెరిచాడు. అందరివంకా చూసి చిరునవ్వు నవ్వాడు.

"జోషువాగారూ! మీరీ ఆమరణనిరాహారదీక్ష విరమించాలి. ఆలసిస్తే ఇంకేం ప్రమాదం ముంచుకొస్తుందో' అంది ఓల్గా.

"నువ్వేం భయపడకమ్మాయి! శివుని ఆజ్ఞలేందే చీమైనా కుట్టదు. ఈ వెధవ దేహంమీద మోహం నశించింది నాకు. రేపొద్దున అందరం పోయేవాళ్ళమే. ఆశయసాధన మధ్యలో విడిచి ఆపైవాడి దగ్గరకెళ్తే వాడికేం జవాబు చెప్పుకోవాలి? నేనీదీక్ష మధ్యలో విడవడం జరగదు'' అన్నారాయన.




మైకేల్ రెండో బాటిలు మార్చాడు. మిద్దెదొరసాని ఏడుస్తూ కూర్చుంది. ఆయన 'ఆ సూది తీసెయ్య'మన్నాడు మైకేల్‌తో. "పోనీ ఆ రెండో బాటిలు సెలైనైనా ఎక్కనివ్వండి. మీరింకేం చెప్పొద్దు'' అంది ఓల్గా.

"సరేనమ్మాయి! మీరింతమంది నామీద ప్రేమతోవచ్చి, రాత్రింబవళ్లు ఇక్కడే కూర్చుంటున్నారు. మీమాట నేనెందుకు కాదనాలి. ఆ సాయినాధుడి ఆన, మీరింక వెళ్ళండి'' అన్నాడు జోషువాగారు.

మర్నాడు ఆదివారం. సంఘం టెంట్‌లో రెండో బాచీలో రాచిప్పచెట్టి, జైన్, లెబా, కూగాశాస్త్రి, అండమ్మ కూర్చున్నారు. సోమవారం మూడో బాచిలో ఎవరు కూర్చోవాలా అని సంఘ కార్యకర్తలు తర్జనభర్జనలు పడ్తున్నారు. ఆడసభ్యులెవరూ రిలే హంగర్ స్ట్రయికు లో పాల్గొనేట్టులేదు. మళ్ళీ పక్షక కమిటీ సభ్యులే కూర్చోవాల్సివచ్చేటట్లుంది. ఇంకోరోజు తిండికి మాడటం ఎవరికీ ఇష్టంలేదు. అయినా తప్పేటట్లుగా లేదు పరిస్థితి.

ఆదివారం భోజనాలు కాంగానే, మహిళా సమాజం మా ఇంట్లో అత్యవసర సమావేశం జరిపింది. ఓ గంటసేపు చర్చలు జరిపిన తర్వాత, 'బడితె విరగ్గూడదు, పాము చావకూడదు' అన్న పరిష్కార మార్గానికొచ్చారు. జోషువాగారడిగినట్టుకాక, పదిహేను రూపాయలు మాత్రం అద్దె పెంచితే, అటు ఆయన తన పంతం నెగ్గిందనుకుంటాడు. మగవాళ్ళూ లొంగిపోలేదని తృప్తి పడతారనే నిర్ణయానికొచ్చి, ముందుగా మిద్దె దొరసానిని పిలిపించి ఆమెతో రాయబారాలు జరిపారు.

మిద్దె దొరసాని తండ్రిని సంప్రదించి వచ్చి చెప్పింది, "నాన్న ఒప్పుకున్నాడు. అయితే ఇప్పుడే అందరూ పెంచిన డబ్బు ఇవ్వాలట. ఇకనుండి ప్రతినెలా పెంచిన లెక్కప్రకారమే అద్దె చెల్లిస్తామని సాయిబాబా మీద ఒట్టుపెట్టుకోవాలట. ఇల్లు ఖాళీ చెయ్యమన్నప్పుడు ఖాళీ చెయ్యాల్ట'' అంటూ జోషువాగారి షర్తులు వివరించిందామె.

మహిళాలోకం తలూపింది. అందరూ తమతమ ఇళ్ళకు వెళ్ళి, డబ్బు తెచ్చారు. ఈ విషయంలో వాళ్ళు భర్తలను సంప్రదించలేదు. తెలిసీ, ఏదోవిధంగా ఈ రొంపిలోనుండి బయటపడాలని ఆలోచనతో వున్న మగసభ్యులు, మరేం అభ్యంతరం చెప్పలేదు. ఓల్గా ఆధ్వర్యంలో ఒక్కొక్కరూ వచ్చి జోషువాగారికి కట్నం చదివించారు.

"నేనంత ఇచ్చుకోలేను. నాది చిన్నభాగం కాబట్టి ఐదురూపాయలు పెంచండి నా అద్దె'' అని మొరపెట్టుకున్నాడు కూగా శాస్త్రి.

"సరే, అండమ్మ ఆడది. సంగీతం పాఠాలు చెప్పుకుంటూ సంపాదిస్తోంది. ఆమె అద్దె పెంచనక్కర్లేదులే' అన్నారు జోషువాగారు ఉదారంగా.

అద్దె బకాయిలు చెల్లించటం పూర్తవటంతో ఓల్గా సతి నిమ్మకాయ నీళ్ళగ్లాసు అందించింది జోషువాగారికి. ఆయన కృతజ్ఞతలు చెప్పి దీక్ష విరమించాడు. ఇహ మహిళాలోకం, రెండో కాంపులో కూడా ప్రవేశించి అక్కడి దీక్షాధారులకీ నిమ్మకాయరసమిచ్చి దీక్ష విరమింప చేసింది.

"ఇది మహిళావిజయం. అమ్మలకు జై!" అని నినదించింది రోజీ. పిల్లలందరూ 'జై,జై అన్నారు.

జోషువాగారు మహిళామణులకిచ్చిన వాగ్దానాన్ని మర్చిపోలేదు. వెనక పునాదులమీద గచ్చుచేయించి, నాలుగువైపులా దూలాలు పాతించి, రేకులతో ఓ షెడ్డువేయించాడు. ఓ మూల ఎత్తుగా వేదిక కట్టించాడు. దానిమీద ప్రస్తుతానికి సాయిబాబా పటం పెట్టారు. తర్వాత విగ్రహంప్రతిష్ఠింపచేస్తానన్నాడుకానీ, అది ఆయన జీవితకాలంలో నెరవేరలేదు. అయితే, అద్దె పెంచితే కిరాయివాసుల సమస్యలన్నీ పరిష్కరిస్తానన్న మాట మాత్రం ఆయన పూర్తిగా మర్చిపోయాడు.

★ ★ ★

కాంగోరెడ్డి రామచిలుక పెళ్ళి చేయిస్తానని టూర్‌కి వెళ్ళినప్పుడు చేసిన వాగ్దానాలలో ఒకటి. ఓరోజు నేనూ, అతనూ త్రివిక్రమాచార్యుల ఇంటికెళ్ళాం. వారిద్దరికీ ఇంతకు ముందే పరిచయం. పంగనామాలు ధరించి పరమవైష్ణవ దేశికోత్తముడిలా వున్నారాయన. విషయం కదిపాం. కట్నం తేల్చందే పిల్లని చూట్టానికి కూడా ఒప్పుకోలేదు ఆయన. పిల్లవాడికి పిల్ల, పిల్లకు పిల్లవాడూ నచ్చితే అప్పుడు కట్నం సంగతి మాట్లాడదామని ఆయనకు నచ్చచెప్పేటప్పటికి మా తాతలు దిగొచ్చారు. పిల్లను చూడటానికి మా ఇంట్లో ఏర్పాట్లు చేశాం. రామచిలుక వాళ్ళకు నచ్చింది. ఆడపిల్లకు పిల్లవాడు నచ్చటమనే దరిద్రపు సంప్రదాయం మన సమాజంలో లేదు కనుక, ఆమెకు వరదాచార్యులు నచ్చాడో లేదో ఎవరూ అడగలేదు. త్రివిక్రమాచార్యులు కట్నం బేరంలో త్రివిక్రమావతారమే తాల్చాడు. కాంగోరెడ్డి కట్నం పదిహేనువేలు, లాంఛనాలక్రింద రెండూ వేలూ ఇస్తానన్నారు. ఆయన పాతిక వేలడిగారు.

"ముష్టి పదిహేనువేలా. ఇదేం దరిద్రపు సంబంధమయ్యా! ఈ బేరాలు నాకు నచ్చవు'' అన్నారాయన.

"అదేం మాట త్రివిక్రమాచార్యులూ! నీ కొడుక్కు ఎవరు మాత్రం అంతకంటే ఎక్కువిస్తారు. చదివింది హెచ్.ఎస్.సి., చేసేది గుమాస్తాగిరీ. పోనీ ఏమన్నా ఆఫీసరా?" అన్నాడు కాంగోరెడ్డి.

ఇద్దరూ మీది 'బోడిసంబంధం 'అంటే' మీది బోడి సంబంధం' అనుకున్నారు.

"నేనోమాట చెప్తున్నా వినండి పిల్లవాడికి పిల్లా, పిల్లకు పిల్లవాడూ నచ్చి, సంప్రదాయం మిగతావీ నచ్చింతర్వాత కట్నం దగ్గర చెడగొట్టుకోవటం మంచిది కాదు. మీది 'బోడి సంబంధ మ'ని రెడ్డిగారూ, మీది 'ముష్టి సంబంధ 'మని మీరనుకోటం బాగా లేదు'' అన్నాను.

"సరేనండీ, పెద్దమనిషి చెప్తున్నాడు. కట్నం లాంఛనాలూ అన్నీ కలిపి ఇరవై చేసుకోండి. అంతకంటే ధర పలకదు మీవాడికి మార్కెట్లో' అన్నాడు కాంగోరెడ్డి.

"కట్నం ఇరవై, లాంఛనాలు ఐదూ చేసుకో' అన్నారాయన ఇంకా కిందకు దిగకుండా.

"మళ్ళీ అదేమాట మాట్లాడతున్నారు! లాంఛనాలు వీలు చూసుకుని ఇవ్వండి''

"ఇరవై ఖాయం. పైసంగతి నేను చెప్పలేను''

"నేనేం ఇప్పుడే ఇవ్వమన్నానా, వీలు చూసుకు ఇవ్వమంటూంటే..."

"మళ్ళీ దాందగ్గర పేచీలు రాకూడదు''

"అదేం మనిషివయ్యా రెడ్డీ! మనకెప్పటి నుండో పరిచయం. నేను పేచీపెట్టే మనిషినా?"

"నాకు తెలియదుటండీ, వ్యవహారం దగ్గర మొహమాట ముండకూడదని చెప్పాగానీ''

కట్నం వప్పేసుకుని బయట కొచ్చింతర్వాత అన్నాను కాంగోరెడ్డితో, "అండమ్మ దగ్గర 3-4 వేలకంటే డబ్బులేదని చెప్తోంది. పెళ్ళి ఖర్చులకే ఇది సరిపోదే, ఇంతకట్నం వప్పుకున్నావు, ఎలాగయ్యా'' అన్నాను నేను.

"మనం పదకొండు భాగాల వాళ్ళంవున్నాం, ఆమె కాకుండా, తలా రెండువేలు వేసుకున్నా తేలిగ్గా 22 వేలు, ఆమె దగ్గరున్నది కల్పితే 25 -26 వేలవుతుంది. చూద్దాం... ఇంకా ఏమన్నా పైన పడితే మనమే వేసుకుందాం" అన్నాడు కాంగోరెడ్డి.

అయితే చందాల వేటలో పడ్డ తర్వాత గాని, మాకు తెల్సిరాలేదు. ఎవరూ రెండువేలివ్వటానికి ముందుకు రాలేదు. అపోజిషన్ పార్టీవారు వచ్చి అడుగుతున్నందుకు బులేరావు చెయ్యి వెళ్ళబెట్టాడు, కూగాశాస్త్రి 'ఆ పూటకన్నం లేద'న్నట్టు మాట్లాడాడు. ఇహ సిపిఐశర్మ వెయ్యి, లెబా ఐదొందలు, రాచిప్ప




చెట్టి రెండొందలు, జైన్ రెండొందలు, పరేషా న్‌రావు వెయ్యి, హరబాబు ఐదొందలు ఇస్తా మని వాగ్దానాలు చేశారు. కాంగోరెడ్డి, నేనూ చెరిరెండు వేలూ వేసుకుంటే మొత్తం రు. 7400 అవుతుంది. "ఏం చేద్దామండీ'' అన్నా రు కాంగోరెడ్డి దిగాలు ముఖంపెట్టి.

"జోషువాగార్ని కూడా అడుగుదాం. ఆయన ఎంత ఇస్తాడో తేల్చుకుని బయట వీధిలో పడ్దాం" అన్నాను.

"ఆయనేమిస్తాడండీ- మనం అద్దె పెంచ లేదని నిరాహారదీక్ష పట్టిన మనిషి!"

"మన ప్రయత్నం మనంచేద్దాం. ఆయన రెండొందలిచ్చినా ఆ మేరకు బయట అడ గటం తప్పుతుంది కదా!"

మా 'జోధ'లో సభ్యులు ఒకసారి 'నువ్వ' అనీ, మరోసారి 'మీరు' అనీ సంబోధించు కుంటారేమా అని మీరు ఆశ్చర్యపడిపోకండి. అవసరాన్నిపట్టి 'మీరు', అవసరం లేనప్పు డు 'నీవు' అయిపోవడం మనం సమాజంలో చూస్తున్నదేకదా! అందుకు 'జోధ'లో కూడా మినహాయింపు కాదు.

నేనూ, కాంగోరెడ్డి వెళ్ళేటప్పటికి, పడు కుని వున్న జోషువాగారు మమ్మల్ని చూసి లేచి వచ్చాడు. "రండి, రండి కార్యదర్శిగా రూ... పనిమీద వచ్చినట్టున్నారు'' అని ఆహ్వానించాడాయన.

మేం సోఫాలో కూర్చున్నాం. "ఏం కార్య దర్శినిలెండి! చచ్చిన పాముని చంపొద్దు. మేమంతా కాదన్నా మీపంతం నెగ్గించుకు న్నారుగా'' అన్నాడు కాంగోరెడ్డి.

"అవన్నీ రాజకీయాలోయ్. మీరు పావులు సరిగా నడపలేదు, ఓడిపోయారు. అంతే. మీ స్ట్రాటజీ సరిగా లేదోయ్. అందుకే మీ పార్టీ రాష్ట్రంలో అధికారం నిలబెట్టుకోలేకపో యింది'' అన్నారాయన.

"పావులు నడపటం కాదు. మీరు ధర్మ యుద్ధం చెయ్యలేదు. అందుకే ఓడిపోయాం"

"ఇంత చచ్చుమాట మాట్లాడకు. ఐడోంట్ ఎక్స్‌పెక్ట్ ఇట్ ఫ్రంయు. రాజకీయాల్లో ధర్మ యుద్ధమేమిటయ్యా. మీరు మాత్రం ఇక్కడ కుదరక ఇట్లావున్నారు కానీ, ఇతర రాష్ట్రాల్లో ధర్మయుద్ధమే చేస్తున్నారా?"

ఇంకా మాటలకు అంతుండదని నేను మేం వచ్చిన విషయం వివరించాను.

"గుమస్తా ముండాకొడుక్కి ఇరవై వేలా? మరీ దౌర్భాగ్యంగా తయారవుతోందే దేశం" అన్నారాయన.

"ఏం చేస్తామండీ పరిస్థితి అలా వుంది. కరప్షన్ అనేది గ్లోబల్‌ఫినామినా అయిపో యింది. యాంటీ డౌరీ లా పాస్ చేశాం. జనంలో చైతన్యం రావాలి. డబ్బున్న మీబో టివాళ్లు కట్నాలనివ్వటానికి ఎగబడితే, కట్న పిశాచి నశిస్తుందా?" అన్నాడు కాంగోరెడ్డి.

"ఆ మాట నేనొప్పుకోను. డబ్బున్న నా బోటి వాళ్ళు కూడా కట్నమివ్వకపోతే పెళ్ళి దర్జా, టీవి ఎలా వస్తాయయ్యా! కానీ డబ్బు లేని వాళ్ళని పీడించటం దుర్మార్గం. సరే కట్నం, చందా ఎవరెవరెంతిస్తున్నారు?" లె క్క చెప్పాం. ఆయన అందర్నీ తిట్టిపోశాడు. "ఇప్పుడే వస్తాను'' అంటూ లోపలికి వెళ్ళా డు.

"ఎంతిస్తాడంటావు?" అనడిగారు కాంగోరె డ్డి.

"వెయ్యిరూపాయలైనా ఇవ్వడా?"

"నాకు నమ్మకం లేదు పోనీబాబూ! వెధ వది పదిహేను రూపాయల అద్దెకి నిరాహార దీక్ష పట్టాడు మనిషి''

"ఏమో అంత పిసినారి కాదు జోషువాగా రు''

"మీకాయన అంటే ఇష్టం కాబట్టి అలా అనుకుంటున్నారు''

ఇంతలో ఆయన చెక్‌బుక్ పట్టుకొచ్చారు. "ఇదుగో, నేను సంపాదించినదంతా కట్టుకు పోలేను కదా! ఓ ఆడబిడ్డ పెళ్ళయినా అవు తుంది. కట్నం డబ్బు మొత్తం నేనిస్తాను.

పెళ్ళి ఖర్చులు మీరు పెట్టుకోండి'' అని ఇరవై వేలకు కాంగోరెడ్డి పేర్న చెక్కురాసిచ్చాడు జోషువాగారు.

కాంగోరెడ్డి అప్రతిభుడై చూస్తున్నాడు ఆయనవంక. 'ఏంటయ్యా అట్టా చూస్తావు! నేను డబ్బు దగ్గర గడ్డి తింటానని నీ ఉద్దేశం. డబ్బొచ్చేచోట రాబట్టాలి. ఇచ్చేచోట ఇవ్వాలి. లేకపోతే ప్రపంచం ఎలా నడుస్తుంది. ఆ మర్చిపోయాను. ఈ పెళ్ళిలోమాత్రం నువ్వేం కమీషనుకు చూడక శుభ్రంగా పెళ్ళి చెయ్యి'' అన్నాడాయన.

"అమ్మమ్మ, అంత మాటనకండి. దీంట్లో కూడా కమీషను తీసుకుని నే నరకానికి పోవాలి?" అన్నాడు రెడ్డి.

"మీకు కృతజ్ఞతలుమాత్రం చెప్పి, మిమ్మల్నవమానించలేను జోషువాగారూ! ఎలా నా మనసులో మాట చెప్పాలో నా కర్థంకావటంలేదు'' అన్నాను.

"ఎందుకయ్యా కృతజ్ఞతలు. ఆ పిల్లకీ, మా విన్నీకీ తేడా ఏమిటి? అసలు నేనే పూనుకుని ఈ పనిచేయాల్సింది. విన్నీకి కానీ, ఈ పిల్ల సంగతి చూద్దామనుకున్నాను. మీరే చూశారు. మంచిదయింది''

"నేను ఈ సమస్య ఎలా పరిష్కరించాలా అని కొట్టుమిట్టాడుతున్నాను. ఒక కుటుంబంగా బతుకుతున్న 'జోధలో సభ్యులంతా చెయ్యి వెళ్ళబెట్టిరి. ఇంతచేసి, కట్నం డబ్బెలా అనుకుంటున్న తరుణంలో మీరు సాయంచేశారు. రాజకీయం మాటలనుకోకండి. నిజంగా వెయ్యి దండాలు మీకు'' అన్నారు కాంగోరెడ్డి.

"జోధలో సభ్యులకు వాళ్ళ బాధ్యతలు వాళ్ళకున్నయ్యి కదా! వాళ్ళు మాత్రమేమిస్తారు. బాధ్యతలు లేని నాబోటి వాడికయితే, ఫరవాలేదుగానీ, సరే, రామచిలుక వివాహార్థమై ఇరవై వేల రూపాయల డబ్బు ముట్టినట్టు నాకు రసీదివ్వు. నీమీద నమ్మకం లేకకాదు. వ్యవహారంలో మొహమాటం వుండకూడదని. క్రింద త్రివిక్రమాచార్యుల అడ్రసూ, మిగతా వివరాలూరాయి. నేను ఆయన్ని గూర్చి విచారించి, ఆ కుటుంబం సంగతి కనుక్కుంటాను. అంతదాకా కట్నం డబ్బు వాళ్ళకీయక'' అన్నారు జోషువాగారు.

కిందకు దిగివచ్చింతర్వాత, "నేను రేపు లోనుకు అప్లయిచేస్తాను. రెండు, మూడు రోజుల్లో నా చందా పంపిస్తాను'' అన్నాను కాంగోరెడ్డితో.

"మీరు వెయ్యి పంపండి, సరిపోతుంది'' అన్నాడు కాంగోరెడ్డి.

రెండురోజుల్లో నాకు లోను శాంక్షనైంది. వెయ్యి రూపాయలు కాంగోరెడ్డికిచ్చాను.

ఆ తరువాత రెండురోజులకు జరిగిన సంఘటన ఇది. సెలవవటంవల్ల నేను కాలేజీకి పోలేదు. జోషువాగారు రమ్మంటున్నారంటే పైకి వెళ్ళాను. అప్పటికే అక్కడ కాంగోరెడ్డి, సిపిఐశర్మ, జైన్, బులేరావులు కూర్చునివున్నారు. వాగ్వివాదం తీవ్రంగా జరుగుతోంది. జోషువాగారు మండిపడుతున్నారు. నేను వెళ్ళంగానే "ఏంటయ్యా ఇది! వాట్స్ హేపెనింగ్ ఇన్ 'జోధలో ఐహావ్ బీన్ సరౌండెడ్ బై జాకాల్స్, స్కౌండ్రల్స్ అండ్ రోగ్స్... గ్రోతూ దిస్'' అంటూ ఓ కాయితం నా చేతిలో పెట్టారాయన.

అది ఓ ఆకాశరామన్న ఉత్తరం. అందులో ఇలా వుంది. "జోషువాగార్కి, మీ 'జోదలో లో జరుగుతున్న అకృత్యాలు అన్నీ ఇన్నీ కావు. మీ లోగిలి సీనియర్ కివాసులు, ఇల్లు ఖాళీ అయినపుడల్లా పదిపదిహేను వేల వరకూ, మీ పేరు చెప్పి 'పగిడీ' తీసుకుని, మీకు సిఫారసు చేసి ఇల్లు అద్దెకు ఇప్పిస్తున్నారు. ఇప్పటికి పదిహేను సంవత్సరాలనుండి, ఈ దోపిడీ కొనసాగుతూవుంది. మీరు అమాయకులు. విషయం మీకు తెలీదు. దీనివల్ల మీకు ఎంత చెడ్డ పేరు వస్తోందో మీరు గుర్తించటంలేదు. మిగతా చోటకంటే, మీరు ఇల్లు తక్కువకద్దె కివ్వటంతో, అద్దెకొచ్చేవా

ళ్ళు కూడా తృప్తి పడుతున్నారు. ఇప్పటికయి నా ఈ దుర్మార్గం ఆపటం మంచిది.

ఇట్లు, మీ శ్రేయోభిలాషి''

ఉత్తరం తెలుగులో నీట్‌గా టైప్‌చేసివుంది. కింద సంతకంలేదు. నే ఉత్తరం చదవగానే.

"వాట్స్ యు పర్ ఎక్స్‌ప్లనేషన్?" అని గట్టిగా గదమాయించి నట్లడిగాడు జోషువాగారు.

"నేనిచ్చే ఎక్స్‌ప్లనేషనేముందండీ. నేను సీనియర్ కివాసినికాదు. సీనియర్ల నడగండి'' అన్నాను.

"అడిగానయ్యా! ఈ కాంగోరెడ్డి, సిపిఐశర్మ, జైన్లు 'మాకేంతెలియదు, ఇదంతా ఉట్టవుడియంగా వచ్చిపడిన నింద అంటున్నారు. ఐడోంట్ బిలీవిట్. ఐబిలీవ్ నన్నాపుయ్యా. హౌ డేర్‌యు టు డిమాండ్ అండ్ కలెక్ట్ పగడి ఆన్ మై బిహాఫ్, అండ్ బిహైండ్ మై బాక్...! స్కౌండ్రల్స్, రోగ్స్, కన్నింగ్ ఫాక్సెస్... అండ్ యు పుట్ మి ఇన్‌డార్క్..." అని ఆవేశంగా అరుస్తున్నాడాయన.

"సీనియర్ కివాసులన్నాడు ఆ శ్రేయోభిలాషి. వాళ్ళ నడగండి. అందర్నీ కలిపి తిట్టటమెందుకూ'' అన్నారు బులేరావు.

"ఏమిటయ్యా అడిగేది? అక్కడికి మేమేదో దొంగలమైనట్లు మాట్లాడుతున్నావు. నిన్నూ రికమెండ్ చేసే ఈ లోగిల్లోకి తీసుకొచ్చాను. నువ్వే మాత్రం 'పగిడి' ఇచ్చావేం!" అనడిగాడు శర్మ.

"అంత నిక్కచ్చిగా నిలదీయటం ఎవరికీ మంచిదికాదు'' అన్నాడు బులేరావు.

"అంటే ఏమిటి నీ ఉద్దేశం. అసలు ఈ ఆకాశరామన్న ఉత్తరం బనాయించింది నువ్వే''

"తప్పుడు కూతలు కూయకు, ఆ ఉత్తరం సంగతి నాకు తెలవదు''

"ఇట్లాంటి పన్లు చేసేది నువ్వే, అద్దెకు ఇల్లు చూపించి, జోషువాగారికి సిఫారుసుచేసి ఇల్లు ఇప్పిస్తే చివరకు నువ్వు చేసే పని ఇదా?

"ఇప్పించావు లేవయ్యా బోడిల్లు. పెద్ద నిస్వార్థంగా సేవచేసినట్లు మాట్లాడుతున్నావే'

ఇంతలో కూగాశాస్త్రి వచ్చాడు. జోషువాగారు ఇంటికి 'పగిడీ' ఇచ్చావా అని అడిగినప్పుడు మొత్తుకున్నాడు అతను. "అయ్యబాబో ఇస్తినికదండీ. గోలెట్టి 'నాదగ్గర లేదు బాబో' అని మొత్తుకున్నా మూడువేలు పుచ్చుకుని గాని నాకిల్లిచ్చారు కాదు. మళ్ళీ ఇవ్వాలంటే నావల్ల కాదు మహాప్రభో' అన్నాడతను కాంగోరెడ్డి వంక చూస్తూ.

కాంగోరెడ్డి ఉరిమినట్టు చూశాడతనివంక.

"ఎవరికిచ్చావయ్యా? నాకిచ్చావా? కాంగోరెడ్డికిచ్చావా?" అనడిగారు జోషువాగారు.

"ఎవరికిస్తే ఏమిటిలెండి. ఇచ్చినమాట వాస్తవం. రెడ్డిగారికిచ్చిన గుర్తులేదు''

"అలా డొంక తిరుగుడు మాటలు మాట్లాడొద్దు. ఎవరికిచ్చావో స్పష్టంగా చెప్పు. సిపిఐ శర్మకిచ్చావా? జైన్‌కిచ్చావా?"

"సిపిఐశర్మగారికివ్వలేదండీ, ఈలోగిల్లో కిరాయికి రాకముందు జైన్‌గారితో పరిచయం లేదండీ''

"మరి పోనీబాబు, బులేరావు?"

"ఏమోనండీ వాళ్ళిద్దర్లో ఎవరో ఒకరికి ఇచ్చి వుండవచ్చు''

"నువ్వు లోగిల్లోకి వచ్చేటప్పటికి వాళ్ళిద్దరూ ఈ లోగిల్లో లేరుకదయ్యా. వాళ్లకెట్లా ఇచ్చావు?"

"అయ్యబాబో జోషువాగారూ! నన్ను చంపకండి. ఏదో తద్దినాలు పెట్టిస్తూ బతికేస్తున్న చచ్చుపీనుగు ముండావాణ్ణి. నన్నీ రాజకీయాల్లోకి దించకండి మహా ప్రభో! మీకూ, మీ పెద్దలకోదణ్ణం" అని గబగబా మెట్లవైపు దూసుకుపోయాడు కూగాశాస్త్రి.

జోషువాగారు గుర్రుగా కాంగోరెడ్డి వంక చూసి అన్నాడు. "కూగాశాస్త్రి దగ్గర మూడు

వేలు పుచ్చుకున్నావన్నమాట"

"అన్యాయపు అభాండాలు వేయకండి. కూగాశాస్త్రి నాకిచ్చాననేం చెప్పలేదు''

"చూస్తాచూస్తా... ఒరే రమ్మూ లెబాని పిల్చుకురా'' అని "పోనీ బాబూ! నువ్వెంత పగిడీ ఇచ్చావు?"

"నేనెవరికీ ఏమీ ఇవ్వలేదండీ. మీ కొలీగ్ కొడుకు విల్సన్ మా కాలేజీలో పనిచేస్తాడు. అతని రికమెండేషన్‌లో మీరు నాకు ఇల్లు అద్దెకిచ్చారు. గుర్తుకు తెచ్చుకోండి'' అన్నాను.

"అవును వాడు జోసెఫ్ కొడుక్కదూ! మర్చేపోయాను. నీ సంగతిసరే. బులేరావూ! నీ సంగతేంది?

'మా మిత్రపక్ష వాళ్ల లావాలేవీలు మీరడగ్గాడదు''

"అంటే సిపిఐశర్మ కిచ్చావన్నమాట. అవును వాడి సిఫారసు మీదేగా నువ్వు లోగిల్లో తగలడింది. ఎంతిచ్చావేం?"

"నేను ఆయనకేం ఇవ్వలేదండీ''

"మరెవరికిచ్చావు?"

"ఎవరికేవిటిలెండి... కాంగ్రెసు వాళ్లంత లంచగొండులు దేశంలో ఎవరున్నారు?"

"అంటే కాంగోరెడ్డికిచ్చావా?"

"ఆ పేరు నాచేత చెప్పించకండి''

"నోర్ముయ్యి! నువ్విక్కడికి తగలడిందాకా నీ మొహమే నాకు తెలీదు. నువ్వు నాకు పగిడీ ఇచ్చావా? కివాసం కార్యదర్శిగా ఓడిపోయి, ఇలా రాజకీయంగా నన్ను సాధిద్దామనుకుంటున్నావా?" అన్నాడు కాంగోరెడ్డి.

లెబా వచ్చాడు. అతడు పగిడీ రూపంలో ఏమీ ఇవ్వలేదట. ఏదో పార్టీ ఫండుకింద కొద్ది డబ్బు సిపిఐ శర్మకిచ్చాను. ఎంతిచ్చానో కూడా గుర్తులేదు'' అన్నాడతను.

"పార్టీఫండని చెప్పి నా ఇంటికి పగిడి తీసుకుంటావా శర్మా! నిన్ను షూట్ చేసినా పాపంలేదు''

"పార్టీ ఫండని నేనందరిదగ్గరా వసూలు చేస్తాను. అలాగే లెబా దగ్గర తీసుకున్నాను. మీరూ రెండు, మూడుసార్లిచ్చారు. గుర్తుకు తెచ్చుకోండి'' అన్నాడు సిపిఐ శర్మ.

"ఐదో, పదో ఇచ్చాను. దాంతో పోలుస్తావేం, పార్టీఫండని చెప్పి వేలకువేలు అతనిదగ్గర వసూలుచేసి''

"నేనేం పగిడీ తీసుకోలేదని లెబా చెప్తూంటే విన్పించుకోరేం!" అన్నాడు సిపిఐ శర్మ.

"అసలేమయిందండీ? విషయమేందీ?" అనడిగాడు లెబా.

"పుండాకోరు మనుషులు మీరంతా! చూడీ ఉత్తరం. నా కొంపమీద పగిడీలు వసూలు చేస్తారా మీరు?"

లెబా ఉత్తరం చదివాడు. "మంచి తెలుగు ఉత్తరం. ఏమయ్యా బులేరావు! ఏంది దీని సంగతి?" అడిగాడు లెబా.

"అదేంది, నన్నడుగుతావు. అక్కడికి ఆ ఉత్తరం నేనే రాసినట్టు''

"ఏంలేదు. తెలుగు టైపు చేయటం కూడా వచ్చుకదా నీకని అడిగాను''

"తెలుగు టైపు చేయటం వస్తే అది నేను రాసినట్టా?"

"ఏమో జనంలో కొత్త తెగుళ్లు పుడ్తున్నాయి. అందుకనే అడిగాడు లెబా'' అన్నాడు శర్మ.

"ఆ తెగుళ్లు ఎప్పటినుండి ఉన్నాయో, ఆ ఉత్తరమే చెప్తోంది. నేను వేరే చెప్పాల్సిన పనిలేదు''

"మనలో మనకెన్నున్నా ఇది మంచిపని కాదయ్యా'' అన్నాడు లెబా.

"అదుగో మళ్లీ అదే మాటంటావు. నాకు తెలీదు మొర్రో అంటే విన్పించుకోవేందంట?"

ఇంతలో పరేషాన్‌రావు, హరబాబులు




వచ్చారు. "జైన్‌కి ఇంటి పగిడీకింద ఎంతి ఛ్చావయ్యా పరేషాన్!" అనడిగాడు జోషువా గారు.

"పదిహేను వేలు''

"అరె, తూ క్యాబక్తాహై భాయీ! పగిడీ దియే ముఝే! వో తో కర్జ్ థా'' అన్నాడు జైన్.

"అది నిజమేనండీ, అప్పుకిందే పుచ్చుకున్నాడాయన పదిహేను వేలు''

"మరి అప్పు తీర్చేశాడా?"

"ఇస్తాం, ఇయ్యాల కాకపోతే రేపిస్తాం. ఆయనిచ్చిండు, నే తీస్కుంటి. యె హమారీ ఆపస్‌కీ బాత్ హై. ఇస్‌సే జోధలోకు కుఛ్ తాల్లుఖ్ నహీం" అన్నాడు జైన్.

"అవునండీ! అప్పు లావాదేవీలు మామధ్య. దీంట్లో ఇంకెవరి ప్రసక్తీ లేదు'' అన్నాడు పరేషాన్‌రావు.

"తోడు దొంగలు మీరు... ఇట్లా తప్పించుకు పోలేరయ్యా మీరు. హరబాబూ! నువ్వు కాంగోరెడ్డి సిఫారసుతోకదా లోగిల్లో ప్రవేశించింది. అతనికెంత పగిడీ ఇచ్చావు''

"పగిడీ అని ఏం ఇవ్వలేదండీ. ఉద్యోగ ప్రయత్నం నిమిత్తం పదివేలిచ్చాను''

"జోధలోలోకొచ్చిం తర్వాతేకదా నీకు సర్కారు ఉద్యోగమొచ్చింది. అంటే పగిడీ కిందా, ఉద్యోగమిప్పించినందుకూ పదిహేను వేలు వసూలు చేశాడన్నమాట రెడ్డి నీదగ్గర"

"లేనిపోని మాటలు కల్పించకండి. వాళ్ళకీ వీళ్ళకీ లంచంపోసి అతనికా ఉద్యోగం సంపాయించి పెట్టాను. ఆ పదివేలల్లో ఒక్క పైస నేను తింటే ఒట్టు. హరబాబూ! నువ్వు పగిడీకిందేమైనా నాకిచ్చావా?"

"లేదండీ. ఆమాట ఎవరైనా అంటే వాళ్ల నోరు పడిపోవాలండీ. అందరికీ న్యాయం చేసినందుకా మీకీ చెడుపేరు!"

"విన్నారుకదా హరబాబు చెప్పేది. నేను పగిడీకింద ఎవరిదగ్గరైనా పైసా పుచ్చుకుంటే మీతోడు''

"ఈ పత్తిత్తు కబుర్లు నాకు చెప్పొద్దు. మీరు ముగ్గురూ ఇంటిమీద అక్రమంగా డబ్బు సంపాదించారు. ఆ మాట ఎవరు కాదన్నా నేనొప్పుకోను''

"పాపం, వాళ్లనే వేలెత్తి చూపటమెందుకండీ. కొత్త కివాసులు కూడా ఏం తక్కువ తినలేదు'' అన్నాడు పరేషాన్.

"ఎప్పటినుండో పాతుకుపోయిన వాళ్లుండగా కొత్తోళ్లనాళ్లు రానిస్తారా? జోషువాగారికి ఇల్లివ్వమని నేనెవరికీ సిఫారసు చెయ్యలేదు. నేను వచ్చింతర్వాత కొత్తగా వచ్చిన కివాసులెవరూ లేరు. నాకు ముందు వచ్చిన రాచిప్పచెట్టో, హరబాబో లేక నువ్వో, పోనీ బాబో పాతవాళ్లతో చేయికలిపి వుండొచ్చు'' అన్నాడు బులేరావు భుజాలు తడుముకుంటూ.

"పాతవాళ్ల దుర్మార్గాన్ని మీకు తెలియపర్చి, వాళ్లను జోధలోనుండి వెళ్లగొట్టిస్తామని బ్లాక్‌మెయిల్ చేసివుండొచ్చుగా కొత్తవాళ్లు. ఆలోచించండి జోషువాగారూ! మీకే తెలుస్తుంది'' అన్నాడు పరేషాన్‌రావు.

"పరేషాన్‌రావు అన్నమాట కూడా పరిశీలించి చూడాల్సిందే'' అన్నాడు హరబాబు.

"ఏందయ్యా పరిశీలించేది? నేనే కొత్తవాణ్ణి! నేను పాతవాళ్లను బ్లాక్‌మెయిల్ చేశానా?" అన్నాడు బులేరావు.

"పాతవాళ్ల శీలాన్ని శంకిస్తే కొత్తవాళ్లు కూడా పవిత్రులు కారని చెప్పటం మా విధి'' అన్నాడు పరేషాన్‌రావు.

"ఏం కాంగోరెడ్డీ! తెలుగు ఒట్టు పెట్టుకు చెప్పు - నేను నిన్ను బ్లాక్‌మెయిల్ చేశానా?" అడిగాడు బులేరావు.

"నువ్వు నన్ను బ్లాక్‌బెయిల్ చేసేదేంది? నేనేమన్నా తప్పుడు పన్లు చేస్తేకదా నువ్వు నన్ను బ్లాక్‌మెయిల్ చెయ్యటానికి?"

"నువ్వు చెప్పు సిపిఐ శర్మా. నేను నిన్ను బ్లాక్‌మెయిల్ చేశానా?"

"నువ్వెప్పుడూ బ్లాక్‌మెయిల్ చెయ్యలేదు''

"జైన్ నువ్వేమంటావు?"

"ఛూ ఛూ... ఐసీబాత్ మత్‌కర్''

"చూశావా పరేషాన్‌రావూ! ఇతర్లని శంకించడం తప్ప నీకేం మరి పనిలేదా?" అన్నాడు బులేరావు.

"నువ్వుండవయ్యా! కొత్తవాళ్లు, పాతవాళ్లని బ్లాక్‌మెయిల్ చేసి ఎంత పుచ్చుకుని వుంటారంటావు'' అనడిగాడు జోషువాగారు పరేషాన్‌రావును.

"ఏమో చాటుమాటు వ్యవహారం సంగతి మనకేం తెలుస్తుంది? ఓ పదిహేను, ఇరవై వేలయినా చేతులు మారకపోయి వుంటాయా అని నా అంచనా''

పైన ఏం తమాషా జరుగుతోందో చూట్టాని కొచ్చిన రాచిప్పచెట్టినడిగాడు జోషువాగారు, "కాంగోరెడ్డీ, సిపిఐ శర్మల సిఫారసుమీదేకదయ్యా నువ్వు లోగిల్లోకొచ్చింది. వాళ్లకెంత పగిడీ ఇచ్చావు?" అని.

"అసలీ చర్య అంతా ఎందుకండీ?"

"ఎందుకా? ఇదుగో, ఈ ఆకాశరామన్న ఉత్తరం బులేరావు బనాయించినందుకు'' అని జోషువాగారి చేతిలోని కాయితం వంక చూపిస్తూ అన్నాడు కాంగోరెడ్డి.

"మళ్లీ మళ్లీ చెప్తున్నాను. మళ్లీ ఎవడైనా ఆ ఉత్తరం నేను రాశానని అంటే వాడి నాలిక చీలుస్తాను. దుర్మార్గపు లంచగొండి మొహాలంతా జోధలోలో తయారయారు'' అన్నాడు బులేరావు కోపంగా.

"రారా దమ్ముంటే. నా నాలిక చీల్చు. ఒకసారి కాదు వందసార్లు, లక్షసార్లంటాను ఆ ఉత్తరం నువ్వే బనాయించావు. సత్యం చెప్పటానికి జంకే మనిషిని కాదు నేను'' అన్నాడు కాంగోరెడ్డి కోపంగా ముందుకొస్తూ.

"తప్పుడు కొడకా! నీ తంత్రాలు, లంచగొండితనం నాకు ఆపాదిస్తావా'' అంటూ కాంగోరెడ్డి చొక్కా పట్టుకున్నాడు బులేరావు.

"నువ్వే తప్పుడు గాడ్దికొడుకువి. నీ తెలుగు కుతంత్రాల గురించి ఇక్కడ తెలవనివాళ్లెవరూ లేరు. నువ్వు లంచాలు తిని కూడా పనిచెయ్యవని మీ ఆఫీసులో ఏ ప్యూన్నడిగినా చెప్తాడు'' అంటూ బులేరావు చెయ్యి విదిలించికొట్టాడు రెడ్డి.

"మధ్యలో మీరిద్దరూ ఎందుకు కొట్టుకుచస్తారయ్యా ఆగండి..." అని ఇద్దర్నీ విడదీయబోయాడు సిపిఐ శర్మ. అయితే కాంగోరెడ్డి శర్మను తోయటంతో అతను జైన్‌మీద పడ్డాడు.

"మారో సాలేకు. యెసబ్ బులేరావ్‌కే వజహ్‌సే హువా! హరాంఖోర్, బద్మాష్, లుచ్చా, లఫంగా..." అని తిట్లకు లంకించుకున్నాడు జైన్.

"నువ్వేం తక్కువ తిన్నావా. ఆయన్నొకణ్ణే బద్మాషంటున్నావు'' అన్నాడు పరేషాన్‌రావు.

"అరె చల్‌బే సాలే, తుభీ షరీఖ్‌హై ఉస్‌మేం" అన్నాడు కిందపడిన జైన్ లేస్తూ.

"సాలే ఎవడ్రా? పైసలు తిందికాక, పైగా పత్తిత్తు కబుర్లు!" అంటూ లేస్తూన్న జైన్‌ని కిందకు తోశాడు పరేషాన్‌రావు.

కాంగోరెడ్డి పరేషాన్‌రావును పక్కకు తోసి జైన్‌ని లేప ప్రయత్నించాడు. బులేరావు కుర్చీని కాలితో తంతే, అది కాంగోరెడ్డికి తగిలి, కుర్చీ కాలు విరిగి, మొనగీరుకుని, కాంగోరెడ్డి కాలినుండి రక్తం కారసాగింది.

"స్టాపిట్... స్టాపిట్... యు బీస్ట్స్, బ్రూట్స్, రెచెడ్ రాస్కెల్స్..." అంటూ జోషువాగారు తిట్టిన తిట్లు ఆవేశపు దయ్యం ఆవహించిన పెద్ద మనుషులను విచలితులను చేయలేదు.

హరబాబు వెనగ్గా వెళ్లి బులేరావు జుట్టు పట్టుకు లాగాడు. కింద కూలబడ్డ జైన్ బులేరావు కాలు దొరకబుచ్చుకుని లాగటంతో నేలమీద పడ్డాడు బులేరావు. కాంగోరెడ్డి కింద






పడి దొరికిన బులేరావును ఆ చెంపా ఈ చెంపా వాయిస్తున్నాడు. లెబా రెడ్డి రెక్క పట్టుకు లాగాడు. దాంతో రెడ్డి లెబామీద విరుచుకుపడ్డాడు. ఇద్దర్నీ ఆప ప్రయత్నించిన రాచిప్పచెట్టిని ఓ తాపు తన్నాడు హరబాబు.

"స్టాపిట్... ఐసే స్టాపిట్... యూరౌడీస్... స్టాప్..." అని విపరీతమైన ఆవేశంతో అరుస్తున్న జోషువాగారు గుండెపట్టుకు కూలబడిపొయ్యారు. "వె... వె... వ్వె'' అని ఏదో చెప్ప ప్రయత్నించాడు కానీ ఆయనవల్ల కాలేదు. ముఖమంతా ఒకటే చెమటలు పట్టేస్తున్నాయి. ఆయనకు స్పృహ తప్పింది.

"ఆపండి మీ గోల... జోషువాగారికి హార్ట్ ఎటాక్ వచ్చినట్లుంది'' అని అరిచాను.

దాంతో సమరోత్సాహంతో కదం తొక్కుతున్న వీరులంతా తమాయించి జోషువాగారి వంక చూశారు.

ఇహ పనులు చకచకా జరిగిపోయాయి. పరేషాన్‌రావు, హరబాబు వెళ్లి టాక్సీ తీసుకొచ్చారు. కాంగోరెడ్డి జోషువాగారి చొక్కా బటన్లు ఊడదీసి మసాజ్ చేశారు. టాక్సీ రావడంతో, కాంగోరెడ్డీ బులేరావు ఆయన తలవైపు పట్టుకోగా, జైన్, సిపిఐ శర్మ కాళ్ల వైపు, పరేషాన్‌రావు, హరబాబు మధ్య పట్టుకుని ఆయన్ని టాక్సీలోకెక్కించారు. నేనూ, మిద్దె దొరసానీ, లెబా, రాచిప్పచెట్టీ అనుసరించాం.

జోషువాగార్ని నిమ్స్‌లో చేర్పించి, రాత్రి పదగంటలదాకా వుండి అందరూ వెళ్లిపోయారు. నేనూ, మిద్దె దొరసానీ మిగిలిపోయాం. నేనూ అక్కడ వుండి చేసేదేం లేదుగాని, మిద్దె దొరసానికి తోడుగా వుండిపోయాను. రాత్రి పదకొండు గంటలకు కాబోలు విషయం చెప్పి అక్కడకొచ్చాడు మైకేల్, అక్షనాథ్‌తోపాటు.

★ ★ ★

జోషువాగారికి మాసివ్ హార్ట్ అటాక్ వచ్చింది. ఆయన్ని ఐదురోజులు ఆస్పత్రిలో వుంచుకుని డిశ్చార్జ్ చేశారు. అనవసరంగా ఆవేశపడరాదనీ, సిగార్లు, ద్రావకం మానె

య్యాలనీ హెచ్చరికలు చేశారు డాక్టర్లు. మరో సారి ఎటాక్ వస్తే కోలుకోటమూ కష్టమే అనీ అన్నారు వాళ్లు. అయినా ఆయన ఆ హెచ్చరి కల్ని ఖాతరు చెయ్యలేదు.

జోషువాగారు ఆసుపత్రినుండి తిరిగొచ్చిన తర్వాత చేసిన మొదటిపని కాంగోరెడ్డి, జైన్, సిపిఐ శర్మ, బులేరావులను ఇల్లు ఖాళీచేయ మని అల్టిమేటం ఇవ్వటం. వాళ్లను పిల్చి, నా ఎదురుగా చెడామడా తిట్టి ఇల్లు ఖాళీ చేయ మని చెప్పటంతో వాళ్లకు ఇదంతా నేను చేయించినట్లు కనబడింది. నాతో మాట్లా డటం మానుకున్నారు. నేను కన్పిస్తే పక్కకు తప్పుకుపోతున్నారు. తమమధ్య వున్న శతృ త్వాన్ని తాత్కాలికంగా మర్చిపోయి నన్ను సాధించాలని ప్రయత్నం చేస్తున్నారు. హరబా బు, రాచిప్పచెట్టీ చివరకు కూగాశాస్త్రి కూడా నాతో మాట్లాడటం మానుకున్నారు.

"వాళ్ళ దుంపల్తెగ! ఏంత తిన్నారో డబ్బు, నా పేరు చెప్పి, ఈ పది పదిహేనేళ్లలో! వ్యభిచారంకంటే మహా ఘోరమైన నేరమ య్యా ఇది. వేశ్య తన శరీర లావణ్యాన్ని చూపి మోహపరుస్తుంది ఇతర్లను. వాళ్లు నా ఇంటిని చూపి కాష్ చేసుకుంటున్నారు. కాంగోరెడ్డి, సిపిఐ శర్మ, జైన్లు డబ్బు తిన్నా రు. బులేరావు వాళ్లని బ్లాక్‌మెయిల్ చేసి డబ్బు తిన్నాడు'' అన్నాడు జోషువాగారు నాతో.

జోషువాగారు ఇంక ఆలస్యం చెయ్యకుండా వెంటనే కూతురి నిశ్చితార్థం చేశాడు. ఆ సందర్భంలో జోధలో కివాసుల్నందర్నీ పిల్చారాయన. దీన్ని అవకాశంగా తీసుకుని కాంగోరెడ్డి, బులేరావు, సిపిఐ శర్మ, జైన్లు జోషువాగార్ని ఉబ్బేయ ప్రయత్నించారు. రామచిలుక పెళ్లికి కట్నం డబ్బంతా ఇచ్చిన ఆయన ఔదార్యాన్ని అందరూ పొగిడారు. అప్పుడు తెల్సింది క్రిస్టొఫర్ తండ్రి ప్రభుదాసుకి జోషువా చేసిన పిచ్చిపని. తన డబ్బే ఇరవైవేలు నష్టపోయినట్టుగా బాధ పడిపొయ్యాడాయన.

జోషువాగారి కొడుకులు నిశ్చితార్థానికి రాలేదు. పెళ్ళికి వస్తామని రాశారు.

'జోధలో కివాసం' సభ్యులు చెవులు కొరుక్కోవటం మెండై, జోషువాగార్ని ఏం చేయలేక, నన్ను సాధించే ప్రయత్నంలో జోషువా గారి అల్టిమేటం చర్చించాలన్న నెపంతో 'జోధలో కివాసం' అత్యవసర సమావేశాన్ని ఆ ఆదివారం నాలుగ్గంటలకు ఏర్పాటు చేయటం జరిగింది.

కార్యదర్శి కాంగోరెడ్డి ప్రారంభోపన్యాసం చేశాడు. "ఇప్పుడు మన కివాసం ఐక్యత భగ్నమయ్యే సంఘటన జరిగింది. మనలో ఉత్సాహంగా సంఘసంక్షేమం కోసం అనవరతమూ పాటుపడే బులేరావు, సిపిఐ శర్మ, జైన్‌గార్లకూ, నాకూ మన లోగిలి యజమాని జోషువాగారు ఇల్లు ఖాళీ చెయ్యమని నోటీసిచ్చారు. కారణం మీకు తెల్సు. గౌరవనీయ సభ్యులపై బనాయించిన అన్యాయపు ఆలోచనలు. వాటిల్లో ఎంత సత్యముందో మీకు తెల్సు. నిజాయితీపరులైన సభ్యులను తలెత్తుకోకుండా చేయాలి, అవమానించాలి, 'జోధలో నుండి వెళ్ళగొట్టాలి అని ఎంతగా రహస్య సమాలోచనలు జరుగుతున్నాయో నేను చెప్పాల్సిన పనిలేదు. ఈ విషమ సమస్యను మనం ఎలా ఎదుర్కొనాలో చర్చించమని వినమ్రుడనై గౌరవనీయసభ్యులను అర్థిస్తున్నాను'' అని కూర్చున్నాడతను.

"అసలు ఈ సమస్య తలెత్తటానికి మూల కారణం- జోషువాగారి తప్పుడు ఆరోపణ, మూలం ఆకాశరామన్న ఉత్తరం- అది బనాయించింది జోషువాగారో, మనలో ఒకరో అయివుండాలి. మరొక వ్యక్తికాదని నా ఉద్దేశం. ముందా విషయాన్ని తేల్చాలి'' అన్నాడు లెబా.

"జోషువాగారు ఈ ఉత్తరాల్ని బనాయించారనటానికి ఆధారాలు లేవు. అలా తనే ఉత్తరాన్ని సృష్టించి ఆయన ఏంలాభం పొందాలనుకుంటున్నాడు. సీనియర్ కివాసులపై ఆయన




కెంతో గౌరవం. వాళ్ళ సిఫారసుతోనే ఆయన మిగతావాళ్లకు ఇళ్లు అద్దెకిచ్చారు. ఒకసారి ఇల్లు అద్దెకిచ్చిన తర్వాత ఆయన అద్దె పెంచిన సంఘటనలు చాలా తక్కువ. ఖాళీ చేయించటం కూడా అరుదే. సీనియర్ కివాసుల్ని లోగిలినుండి పంపించెయ్యాలని ఆయన ఉద్దేశం కాదు. అందువల్ల ఆకాశరామన్న ఉత్తరం ఆయన బనాయించింది కాదని నా అభిప్రాయం" అన్నాను నేను.

ఒక్కక్షణం ఎవరూ మాట్లాడలేదు. సీనియర్ సభ్యులు ఒకళ్ళ మొహాలు ఒకళ్లు చూసుకున్నారు. "పోనీబాబు ఎప్పుడూ యాజమాని తొత్తే. ఆయన మాటలు పట్టించుకోరాదు'' అన్నారు బులేరావు.

ఎస్, హి ఈజె ట్రైటర్. మన మాటల్ని యాజమాన్యానికి చేరవేసే స్పై అతను'' అన్నాడు సిపిఐ శర్మ.

"ఎలాంటి ఆధారాలూ లేకుండా ఒక గౌరవనీయ సభ్యుడిపై అన్యాయపు ఆరోపణలు చేయటం ఎంతవరకు సబబు?" అన్నారు పరేషాన్‌రావు.

"ఇంకా ఏం ఆధారాలు కావాలి? యాజమాన్యానికి వత్తాసు పల్కటం చాలదా?" అన్నాడు బులేరావు.

"వత్తాసు పల్కటమేముంది. ఉత్తరం ఎవరు బనాయించారన్న విషయంలో ఆయన అభిప్రాయం ఆయన చెప్పాడు. ఆ మాత్రానికే ఆయన యాజమాన్యపు తొత్తయిపోయాడా?" అన్నాడు పరేషాన్‌రావు.

"నువ్వు తొత్తు కిందపడి తొత్తువు'' అన్నాడు బులేరావు.

"అవును నువ్వు మాత్రం పత్తిత్తువు. అసలా ఉత్తరం బనాయించింది నువ్వే'' అన్నాడు పరేషాన్‌రావు.

"అయ్యా! మనలో మనం ఇలా కొట్టుకున్నందువల్ల ప్రయోజనమేం లేదు. ఒక అంశం తర్వాత మరో అంశం చర్చించాలి మనం. ముందుగా ఆ ఆకాశరామన్న ఎవడో తేల్చాలి మనం" అన్నాడు కాంగోరెడ్డి.

"కాంగోరెడ్డి, సిపిఐ శర్మ, జైన్లు రాయటానికి అవకాశం లేదు. వాళ్లు తమపై నేరారోపణ చేసుకోరుకదా. తమ భర్తలకు వ్యతిరేకంగా వారి భార్యలూ రాసివుండరు. ఇహ మిగిలింది నేను, బులేరావు, రాచిప్పచెట్టి, కూగాశాస్త్రి, అండమ్మ, పరేషాన్‌రావు, హరబాబు, పోనీబాబు- వారివారి కుటుంబసభ్యులు. ఎలిమినేషన్ ప్రాసెస్‌లో ఎవరికి అట్టా రాయటానికి ఎక్కువ అవకాశాలున్నాయో చర్చిస్తే మనం సరైన నిర్ణయానికి రావచ్చు'' అన్నాడు లెబా.

"ఈ కుటుంబాల్లో పిల్లలెవరైనా రాసివుండొచ్చుగా?" అన్నాడు పరేషాన్‌రావు.

"వాళ్లకీ రాజకీయాల్లో ఆసక్తిలేదు. వాళ్ళెవరూ రాసివుండరు. పైగా ఉత్తరంలో ఆరోపించినటువంటి నేరం వాళ్ల మనసుకు తట్టే అవకాశం లేదు. అందువల్ల పిల్లల్ని వదిలేయండి'' అన్నాడు లెబా.

"కూగాశాస్త్రికి ఆయన తద్దినాలు, అప్పుల గొడవేగానీ, ఆయనటువంటి పనిచేస్తాడని నేననుకోను. అలాగే అండమ్మ. ఆమెకీ జోధలో కివాసులతో, ముఖ్యంగా ఆమెకెంత సాయం చేస్తున్నా కాంగోరెడ్డిగారితో శతృత్వం తెచ్చుకోటంవల్ల ఒరిగేదేం లేదు. కనుక ఆ రెండు పేర్లూ లిస్టులోనుండి తొలగించెయ్యండి?" అన్నాడు చెట్టి.

"హరబాబుతో నాకెంతకాలంనుండో పరిచయం. మంచి మిత్రుడు. ఆయన ఈ పని చేస్తాడని నేను కలలో కూడా నమ్మను'' అన్నాడు కాంగోరెడ్డి.

"అలాగే లెబాతో నాకెంతకాలంనుండో పరిచయం. ఆయన అవుట్‌స్పోకెన్‌మాన్. పైకొకటి చెప్పి, వెనక గోతులు తవ్వే రకం కారు ఆయన" అన్నాడు సిపిఐ శర్మ.

"రాచిప్పచెట్టిగారు కూడా, ఆయన రాజకీయ అభిప్రాయాలెలా వున్నా, ఆయనకూ ఈ ఆకాశరామన్న ఉత్తరంతో ఎలాంటి సంబంధ

మూ వుందని నేనంగీకరించను'' అన్నాడు కాంగోరెడ్డి.

"బులేరావుగారు మాత్రం- జోషువాగారి దుర్మార్గానికి ప్రతిసారీ బలయ్యే మనిషి ఆయ నేకదా! ఆయన ఈ పని చేసివుండడు'' అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు సిపిఐశర్మ.

"మా స్త్రీలు ఎవరూ చేసివుండరు ఇట్టాంటి పాడుపని'' అంది ఓల్గా.

ఇంకెవరూ ఏమీ మాట్లాడకపోతే అన్నాడు పరేషాన్‌రావు "బావుంది డెవిల్స్ ఎబ్‌జాల్వ్ డెవిల్స్. ఇహ మిగిలింది నేనూ, పోనీబాబేగా. మా ఇద్దర్లో ఎవరు ఆ వుత్తరం రాశారో చెప్పండి'' అని.

ఎవరూ మాట్లాడలేదు ఓ క్షణం.

"మీలో మీరే తేల్చుకుని చెప్పండి ఎవరు రాశారో..." అన్నాడు బులేరావు.

"హమారీ ఇస్త్రీయోంకీ నుమాయిందా హైరానీ లిటియా! వో అవుర్ ఉస్కే మర్ద్ ఐసే కర్తూత్ నహీంకర్తే' అంది బేగం.

"ఐతే పోనీబాబు రాశాడంటారా?" అనడిగాడు పరేషాన్‌రావు.

ఎవరూ ఏం మాట్లాడలేదు.

"నేను రాయలేదు'' అన్నాను నేను. నేనీ సంజాయిషీ చెప్పుకోవాల్సి వచ్చేసరికి నా కేస్ వీక్ అయిపోయింది.

"మేం నమ్మం" అన్నాడు కాంగోరెడ్డి.

"కివాసం ఐక్యత భగ్నం చెయ్యటానికి ఆయన మొదటినుండీ చేసిన ప్రయత్నాలే ఈ ఉత్తరం ఆయన రాశాడనటానికి ప్రబల నిదర్శనం. జోషువా ఆమరణ నిరాహారదీక్షలో వున్నప్పుడు ఆయన ఏమన్నాడో మీకు గుర్తుందా? మనం యజమాన్యానికి వ్యతిరేకంగా సాగించిన ఉద్యమం అన్యాయమని తీర్పు ఇచ్చాడుకదూ ఈ పెద్దమనిషి. చివరకు రిలేనిరాహారదీక్షలో కూడా పాలు పంచుకోవటానికి అంగీకరించలేదు. అంటే ఘనలో వుంటూ, మనకు వ్యతిరేకంగా, జోషువాకు బంటుగా పనిచేశాడీయన. మనం జోధలోలో వుంటం ఇద్దరికీ ఇష్టంలేక, కుట్రపన్ని అసత్యారోపణలు చేశారు. ఇలాంటి సంఘద్రోహి పోనీబాబును సంఘం నుండి బహిష్కరించవల్సిందిగా నేను కోరుతున్నాను'' అన్నాడు బులేరావు.

"అవునండీ బహిష్కరిస్తారు. ఎందుకు బహిష్కరించరు? మా అవసరం తీరింది. మీకు కష్టం వచ్చినప్పుడల్లా ఆయన సహాయం కావాలి, సలహా కావాలి. ఇప్పటిదాకా కాట్లకుక్కల్లావున్న మీరు, ఆయన చేసిన సాయం అంతా మర్చిపోయి, ఒకటై, మమ్మల్ని వెలివేయాలని చూస్తున్నారు. మీరు మమ్మల్ని బహిష్కరించేదేమిటి? ఇలాంటి కుక్కలు, గాడిదలు జమైన ఈ జంతు సంఘాన్ని మేమే బహిష్కరిస్తున్నాం. పదండి. ఇంకిక్కడెందుకూ'' అంది భాను కోపంగా, నన్ను రమ్మని సైగచేస్తూ.

"ఏవమ్మోవ్! కాస్త నోరు సంబాళించుకు మాట్లాడు. ఇక్కడ కుక్కలు, గాడిదలూ ఎవరూ లేరు. పైగా మీరు చేసిన సాయమేంది? ఏదో పేద్ద చేసినట్టు చెప్తున్నావు'' అన్నాడు బులేరావు.

"నేననేదదే... నువ్వు తప్పుడు కూతలు కూసేముందు నోరు సంబాళించుకో. ఆం సాయం అంటున్నావు. చేసింది, చెప్పుకోకూడదు కానీ, నీలాంటి గాడిదలకు సరిగ్గా విడమర్చి చెప్తేగానీ అర్థంకాదు, జోధలో పై కాంగోరెడ్డి జండా పీకేసి, నీ దిక్కుమాలిన జండా పెట్టకోమని మావారు చెప్పారా? జోధలోకివాసుల ఐక్యత నాశనం కావటానికి మొదటి కారణం నువ్వు. జోషువాగారు మీ ఇద్దరిజండాలు పీకేయటంతో నీబోడి తెలుగు పరువుపోయింది. పరువుపోయింది జోషువాతో సంధి చేయించు అంటూ ఆయన కాళ్లు పట్టుకుంది ఎవరు? నువ్వు. నిన్ను వెంటేసుకొచ్చి, నీ తరపున ఆయన్ని ప్రార్థించిన లెబా

 

ఇవ్వాళ మాట్లాడడు. ఆయన నోరు పడిపో యింది. నోటికి రాజకీయపు కుట్లు పడ్డాయి. మా తరపున మాట్లాడినందువల్ల ఆయన రాజకీయావసరాలు తీరవు. నీ చంకనెక్కితే, ఒకసీటో, అరసీటో ముష్టివాడికి పారేసినట్టు పారేస్తావు..."

"ఇదుగో భానూ! నోటికెంతవస్తే అంతవా క్కు. ఆయన ముష్టివారా...!" అంది ఆన్నీ.

"దీనికేం పోయేకాలమొచ్చిందో, కాళ్లు పట్టుకోటానికి అంతోటి పెద్దమనిషి తప్ప ఎవరూ దొరకలేదు కాబోలు. అయినా మాకు ఇంకోళ్లకాళ్లు పట్టుకోవాల్సిన ఖర్మేం..." అని వాపోయింది మణి.

"ముయ్యండి నోళ్లు. నేను చెప్పేదంతా వినాల్సిందే. నా కడుపుడికిపోతోంది. ఏరు దాటి తెప్పతగలేసే రకాలు మీరు. ఏకసభ్య కమీషనంట, సమస్య ఆయన పరిష్కరించా లట! ఈ లోగిలేమన్నా ఆయన సొంతమా? జోషువాగారు ఆయన జేబులోని మనిషా? ఆయన ప్రయత్నం ఆయనచేశారు. సంధి కుదర్చ ప్రయత్నించారు. అది మీకు గు ర్తుండదు. కివాసులందరూ అద్దె పెంచటానికి ఇష్టపడుతున్నారని జోషువాగారితో అబద్ధపు కూతలు కూసిన బులేరావు మంచివాడు. ఆయన్ని వెలివేయాలని అనుకోలేదేం ఆ రోజు.."

"అందుకేగా ఆ కాకామంపై అవిశ్వాసం ప్రకటించి కొత్త కాకామం ఎన్నుకున్నది" అన్నాడురెడ్డి.

"తమరు కార్యదర్శి పదవి అలంకరించటా నికి అది అవకాశంగా వాడుకున్నారుకానీ, ఆయన తప్పుడు పన్లు చేశాడని కాదు. అవునండీ కాంగోరెడ్డి మహా ధర్మాత్ముడు. రామచిలుక పెళ్లికి ఎంతో కృషి చేస్తున్నాడు. దీంట్లో మేం చేసిందేం లేదు! చందా కూడా వెయ్యలేదు! మన కివాసులు ఎంతమంది చందాలు వేశారండీ. కట్నం మొత్తం డబ్బు ఇచ్చిన జోషువాగార్ని ఒక్కడూ అనుకోడేం. ఈ పెళ్లి అయితే అంతా సవ్యంగా జరిగితే కాంగోరెడ్డి ఎంత కమీషనుకొట్టేస్తాడో మీకేమ యినా తెల్సా"

"అధ్యక్షా! ఇది ఆధారంలేని నేరారోపణ. మీరు చూస్తూ కూర్చోరాదు" అన్నాడు కాంగోరెడ్డి.

"లెట్‌హర్ వాష్ అవర్ డర్టీ లిలిన్ ఇన్ పబ్లిక్ ఎట్లీస్ట్ వన్స్. లెటజ్‌నో ఇనవర్ ట్రూ కలర్స్. అధ్యక్షులు ఇందులో కలగజేసుకోవా ల్సిందే లేదని నా అభిప్రాయం" అన్నాడు పరేషాన్‌రావు.

పరేషాన్‌రావు డబ్బు తిని జైన్ నరాల్లో ప్రవహిస్తున్న రక్తం అతని నోరు కట్టేసింది.

"అవునండీ అన్నీ ఆధారంలేనివే, ఏవీ రుజువు కావు. కాంగోరెడ్డి పదవి ప్రమాదంలో పడ్తే సభ్యులనాకట్టుకోటానికి టూర్ ప్రోగ్రాం! పైగా ఇదంతా సభ్యులకోరిక మీద రెడ్డిగారు చేతి చిలుమువదిలించుకుని ఏర్పాటు చేసిన ట్టు ప్రకటన, ప్రచారం! టూర్‌కెళ్లిన బస్సు టైంకి తిరిగి రాకుండా డ్రైవర్‌కి లంచం పెట్టిన బులేరావుగారు పరమపవిత్రుడు. ఆ నిస్వార్థసేవా తత్పరుడి శీలాన్ని శంకించటం మనదే నేరం. వారేం చేసినా అది కివాసుల మేలుకోసమే. రోజీ, అక్షనాథ్ లు ప్రేమలో పడితే సంప్రదింపులకు మేమే కావాలి. సిపిఐశర్మగారికి స్ప్లెండిడ్ సలహా లు కావాలి. ఇవాళ ఆయన మాట్లాడడు. జోషువాగారు ఇల్లు ఖాళీ చేయమన్నారు. స్వార్థం కోసం ఒకే స్థితిలో వున్న వాళ్లతో చేతులు కలపటం, ఆపద తొలగించుకోవాలని ప్రయత్నించటం సహజం. కానీ ఇతరులపై నీలాపనిందలు వేయాల్సిన అవసరంలేదు. కానీ రాజకీయం ఆయన్ని మాట్లాడనివ్వదు. అధ్యక్షపీఠం వహించిన జైన్‌గారు అంత కంటే మాట్లాడడు. పాపం, పీఠం దిగింతర్వాత ఎవరూ చూడకుండా వచ్చి యెలోగ్ ఐసాహీ హై పోనీబాబూ! సబ్ అహెసాన్ ఫిరామోష్‌హై' అని మొసలి కన్నీ ళ్లు కారుస్తాడు"

"ఏ బానూ! సంభల్కే బాత్‌కర్!" అంది బేగం.

"హూం ఉన్కాహీ జికర్ కర్‌రహీహూం బేగం సాహిబా! ఔచిత్యం అనే మాట మన సంఘంలో ఎంతమందికి తెల్సు? జోషువాగారికి వ్యతిరేకంగా మా వారే ఆమరణ నిరాహారదీక్ష పట్టాలా? పాపం కాంగోరెడ్డి గారికి వల్లకాదు! బులేరావుగారు తిండిలేకపోతే విలవిల్లాడుతాడు ఆయన! సిపిఐశర్మ, లెబాగార్లు నిరాహారదీక్షకు వ్యతిరేకులు. తెలుగు ప్రతిష్ట కాపాట్టానికి ఆయన తప్ప ఎవరూ దొరకలేదు. ఆయన తనవల్ల కాదంటే అది కివాసం ఐక్యతను భగ్నం చేసే ప్రయత్నమట. కుట్ర, యాజమాన్యానికి బంటుతనం చేయటం, ట్రీజన్! ఎందుకండీ ఈ రంగు పూసిన మాటలు. రాజకీయ పారిభాషిక పదజాలం ఎవడికి తెలీదు? మీకందరికీ మేం సంఘంలో వుండటం ఇష్టంలేదు. ఆ మాట స్పష్టంగా చెప్పొచ్చుకదా! మేం దీన్ని పట్టుకునివేలాడుతామనీ, మీరు తప్ప మాకు గత్యంతరం లేదనీ ప్రాధేయపడటంలేదుగా'' అంది భాను చేతులు తిప్పుతూ.

"అవునమ్మా! మమ్మల్ని ప్రాధేయపడాల్సిన అవసరం మీకేంటీ! మీకు కొండంత అండ మిద్దెమీదవుంది. మా బోటివాళ్లు మీ దృష్టిలో ఆన్తారా?" అనన్నాడు సిపిఐశర్మ.

"అవునండీ ప్రాధేయపడాల్సిన హక్కు కూడా మీదే, మేం కాదనటం లేదు. అవసరం వస్తే కాళ్లూ పట్టుకోగలరు, అవసరం తీరితే జుట్టూ పట్టుకోగలరు. మీకున్నటువంటి అద్వితీయ ప్రతిభా సంపత్తులు, ఆ మేధస్సు, రాజకీయ పరిజ్ఞానం ఇంకోరికి రమ్మన్నావస్తాయా. మీకు మీరేసాటి''

దాంతో నోరుకట్టుబడిపోయింది సిపిఐశర్మకు.

అనవసరపు తలనొప్పి తెచ్చుకున్నట్టైంది లెబాకి. "అధ్యక్షా! మనం ఇక ఏం తేలని ఈ ఆకాశరామన్న సంగతి వదిలేసి అసలు విషయం చర్చించటం మంచిది'' అన్నాడతను.

"ఆ విషయంలో పెద్దగా చర్చించేదేం లేదు. యజమాని ఖాళీ చెయ్యమన్నాడు. మనం ఖాళీ చెయ్యం. అందరం ఒకటిగా నిలబడ్దాం. ఆయనేం చేస్తాడో చూద్దాం" అన్నాడు కాంగోరెడ్డి.

"సమస్య నువ్వనుకున్నంత సులువుకాదు. క్రితంసారి ఇలాగే అనుకున్నాం. కానీ విజయం ఆయనకే లభించింది'' అన్నాడు లెబా.

"అసలు ఈ విషయం మనం అందరి ఎదుట చర్చించటం ఎంతవరకు మంచిదంటారు? జోషువాగారి తొత్తులు ఆయనకీ విషయం చేరవేయరని నమ్మకమేంది'' అన్నాడు బులేరావు.

నాకిహ సహనం చచ్చిపోయింది. "జోషువాగారికి మాటలు చేరవేసేది నేనూ, నా భార్యా అనేగా నీ ఉద్దేశం, మంచిది. ఇంతగా అనుమానించి, అవమానించే సంఘంలో వుండటం మాకూ ఇష్టంలేదు. ఈ క్షణంనుండి మేం ఈ 'జోధలో కివాసం' సభ్యులం కాదు. మీరే ఏలుకోండి'' అని బయలుదేరాను భానుతో.

'ససస' మా ఇంటి ముందే జరుగుతోంది. ఏడిచ్చస్తారని తలుపు తీసుకుని ఇడియట్ బాక్స్ తెరిచాం. మేం వెళ్ళిన తరువాత కథ పరేషాన్‌రావు చెప్పారు నాకు.

పరేషాన్‌రావు మమ్మల్ని బహిష్కరించటం అన్యాయమని వాదించాడట. సంఘంలో చీలికలు తెస్తున్న బులేరావునే బహిష్కరించాలని ప్రతిపాదించాడట. అధిక సంఖ్యాబలంతో అతని నోరు నొక్కేశారట. ఇళ్ళు ఖాళీ చెయ్యకపోతే జోషువాగారెలాంటి చర్యలు గైకొంటాడనే విషయంలో తర్జన భర్జనలయ్యాయట.

"హార్ట్ అటాక్స్ నుండి కోలుకొంటున్న జోషువాగారు ఆమరణ నిరాహారదీక్ష





వహించటమన్నది కల్ల! కనుక ఆయనకిక గత్యంతరంలేదు. మనం చెప్పినట్లు నడుచుకోవాల్సిందే. కోర్టుకేసులంటే మీకు తెలియన్దేముంది. సంవత్సరాలు నడుస్తాయి. ఒక వేళ, అప్పుడు మనోళ్ళు ఇళ్ళు ఖాళీ చెయ్యాలని కోర్టు తీర్పిస్తే అప్పుడు చూసుకుంటా'' అన్నాడట లెబా.

సభ్యులందరూ చప్పట్లతో తమ అంగీకారం తెల్పారట.

"ఇంకో విషయం. పోనీబాబు మన ఐక్యతను భగ్నం చేయప్రయత్నించాడు. జోషువాకు గూఢచారిలా పనిచేశాడు. 'ఇదేమ'న్న బులేరావుగారిని తిట్టాడు. పైగా అహంకారంతో తనే సంఘాన్ని బహిష్కరిస్తున్నట్టు ప్రకటించి వెళ్ళిపోయాడు. ఆయన ప్రాధేయపడినా తిరిగి ఆయన్నీ, ఆయన భార్యనీ సంఘంలోకి చేర్చుకోరాదు. ఆ కుటుంబాన్ని సోషల్ బాయ్ కాట్ చేస్తే కూడా మంచిదని నా అభిప్రాయం". అన్నాడట కాంగోరెడ్డి.



'జోధలో కివాసం' నుండి బహిష్కరించటమేగాక, సామాజికంగా కూడా వెలివేయటంతో కివాసులెవరూ మాతో మాట్లాడటంలేదు. వాళ్ళ పిల్లల్ని మా పిల్లలతో మాట్లాడనీయటంలేదు, ఆడుకోనీయటంలేదు. ఇది భానూకు సహించరానిదైంది.

"మనమీ ఇల్లు ఖాళీచేసి, వేరే ఇంటికి పోదాం" అందోరోజు ఆమె, "మన్ని వెలివేస్తేశారు. పిల్లల్ని కూడా వెలివేశారు. వాళ్ళదుంపతెగ, ఎవరింటికైనా పిల్లలు వెళ్తే కసిరి పంపేస్తున్నారు. నేనిది సహించలేను. కిరాయికి వేరే ఇల్లు చూడండి, వెళ్ళిపోదాం" అంది.

"కానీ మనమీ ఇల్లు వదలి వెళ్ళిపోతే వాళ్ళ మాటలకు బలం చేకూర్చినట్లవుతుంది. వాళ్ళ పాచిక బలానికి మనం తల వంచినట్లవుతుంది. పోనీ కొన్నాళ్ళు మీ పుట్టింటికి వెళ్ళివుండరాదు! పిల్లలకు ఇప్పుడు సెలవులేగా. ఈలోగా అంతా సర్దుమణుగుతుంది'' అన్నాను.

"'అంటే మీరుమాత్రం ఈ రాజకీయపు పాటిదిబ్బను వదలిరానంటారు. ఆ సిగ్గులేని ముఖాలు మాట్లాడాలనుకున్నా నాకు మాట్లాడాలని లేదు''

"మరీ అంత మొండితనం పనికిరాదు. పట్టువిడుపులుండాలి. మనుషులు పొరపాట్లు చేస్తారు. తెలిసి వాళ్ళే సర్దుకుపోతారు''

"ఇదుగో ఈ బుద్ధే, ఈ చాతగానితనమే వాళ్ళనన్ని మాటలననిచ్చింది''

"నువ్వు కూడా అలా మాట్లాడితే బతుకు దుర్భరమవుతుంది నాకు''

"అది కాదండీ నేననేది- అంత మంచితనం పనికిరాదు''

"మనమేం అంత మంచివాళ్ళం కాదు. వాళ్ళూ అంత దుర్మార్గులు కాదు. సగటు మనుషులం అందరం. స్వప్రయోజనాలకు పోయి జనం అలా తిరిగిపోతుంటారు. మనకంత అవసరంలేదు కనుక మనమిలావున్నాం"

"వాళ్ళు మెడబట్టుకు .గెంటిందాకా మీరింతే..''

"వాళ్ళెవరు మనల్ని మెడబట్టుకు గెంటటానికి. ఇది జోషువాగారి లోగిలి. వాళ్ళది కాదు''

"అంటుజాడ్యం వున్నవాళ్ళంలా అంద

రూ మన్నుండి తొలగి పోతుంటే మనకే వుండబుద్ధి కాదు''

"సరే, నువ్వంత గట్టి నిర్ణయం తీసుకున్న తర్వాత నేం చెప్పేదేంలేదు. వేరే ఇల్లు చూస్తాను.

"అదీ... ఇన్నేళ్ళ సంసారంలో బుద్ధున్న మాటొక్కటి మాట్లాడారు''

"థాంక్యూ వెరీమచ్ ఫర్ద కాంప్లిమెంట్.

"నాబొంద, మీకు బుద్ధుందనగానే నిజమే ననుకుని, బుద్ధిలేని మాటలు మాట్లాడటం మొదలెట్టారు. లేకపోతే నాకు థాంక్యూ ఏమి టండీ? మనం ఇద్దరం ఒక్కటి కాదూ!"

"భార్యాభర్తలవటంవల్ల ఒక్కటా, లేక అభిప్రాయాలు ఒక్కటవటంవల్ల ఒక్కటా?"

"నాకేం అభిప్రాయాలులేవు బాబూ! హాయిగా బతకాలి, బతకనివ్వాలి అని తప్ప. మీరు హాయిగా, స్వేచ్ఛగా బతకనిస్తారు కనుక మనిద్దరం ఒకటి''

"దట్స్ గుడ్. దట్స్ వాట్ఐ ఎక్స్‌పెక్ట్ ఫ్రం యు''

"మరీ అంత అహం పనికిరాదు. సే దట్స్ వాట్ ఉయ్ ఎక్స్‌పెక్ట్ ఫ్రం ఈ చదర్'

ఇంటావిడ అంత ఘాటుగా చెప్పింతర్వాత అద్దె ఇళ్ళ వేటప్రారంభించాను. రెండు, మూడు చోట్ల ఖాళీలున్నా, వసతులు సరిగ్గా లేకపోవటమో, అద్దె నేను భరించలే నంతగా వుండటమో జరిగింది. ఏమయినా నా నిర్ణయం ముందుగా జోషువాగారికి తెల్పాలనుకున్నాను. ఆ అవకాశం నేను ఎదురుచూడకుండానే వచ్చింది. ఆయనే నన్ను పిలిపించాడు.

"ఏమయ్యా! నిన్ను కివాసం నుండి బహిష్కరించార్ట, సామాజికంగా కూడా వెలివేశార్ట. అంతే కదా! అంతకే బెంబేలుపడి కన్పించటం మానేశావు, ఇదేం బాగలేదయ్యా'' అనన్నారు ఆయన నేను వెళ్ళగానే.

"బెంబేలు పడటం కాదుగానీండి. పిల్లల్తో కూడా వైరం పూనితే కష్టమే కదండీ''

"నువ్వక్కడే పొరబడుతున్నావు. పిల్లల మనసుల్లో ఈ రాజకీయాలుండవు. పెద్దవాళ్ళు కోపగిస్తారేమోనని భయపడి రెండురోజులు నీ పిల్లల్తో మాట్లాడరేమో. శాశ్వతంగా మానేస్తారంటావా? మహా అయితే ఒక్క వారంరోజులు కంటే అదుపులో పెట్టలేరీ పెద్దలు పిల్లల్ని. చూస్తూవుండు, నా మాటల్లో నిజమెంతో నీకే తెలుస్తుంది''

"ఏమోనండీ అందరికీ అంత కష్టంగా వున్నప్పుడు, మాకూ ఇక్కడ వుండ మనస్కరించటంలేదు. వేరే ఇల్లు అద్దెకు దొరుకుతుందేమోనని చూస్తున్నాను''

"సరే మంచిది. రెండు భాగాలు చూడు''

"రెండెందుకండీ?"

"ఒకటి నీకు, రెండోది నాకు''

"మీకేం ఖర్మండీ, స్వంత ఇల్లు పెట్టుకుని, అద్దె ఇంట్లో వుండటానికి?"

"నీకేం ఖర్మయ్యా. అద్దె ఇచ్చినా సొంత ఇల్లులాగా ఇంట్లో వుండటానికి?"

"ఇది మరీ బావుంది!"

"అలా అన్నావు, అది కరెక్ట్ మాట. ఇప్పుడు విషయం మంచి రసకందాయంలో పడ్డది''

"అదేమిటలా అంటారు? వాళ్ళు కింద కత్తులు నూరుతున్నారు మీపైకి''

"పిచ్చిసన్నాసులు. పిల్లకాకులకేం తెల్సు ఉండేలుదెబ్బ! చూస్తుండు, వాళ్ళనెలా పల్టీ కొట్టిస్తానో. మనవాళ్ళు మాత్రం ఈ రిటైర్డ్ జీవితంలో మంచి ఎంటర్‌టైన్‌మెంటు కల్గిస్తున్నారోయ్''

"మీకు వినోదంగానే వుంటుంది లెండి నన్ను వెలివెయ్యటం"

"ఛఛ వాళ్ళెవరు నిన్ను వెలివెయ్యటానికి. ఐయాం హియర్ టు టర్న్ టేబిల్స్ అగెనెస్ట్ దెం. వెధవది చిన్నప్పటినుండి ఈ మనస్థితి లేదుకాని, లేకపోతే జీవితాన్ని హాయిగా








ఎంజాయ్ చేసేవాణ్ణి''

"ఇప్పటికి మాత్రమేం, బాగానే ఎంజాయ్ చేస్తున్నారుగా''

"నీకో రహస్యం చెప్పనా? వాళ్ళందరికీ అద్దెకిచ్చింది ఎందుకనుకున్నావు? డబ్బు పోగేసుకోటానికనుకుంటున్నావా? కాదు. కంపెనీకోసం, సుఖపట్టంకోసం. మనవాళ్ళు మంచి జీవగర్ర, చావగలిగిన మనుషులు. దె రియాక్ట్ ఏజ్ ఐ ఎక్స్‌పెక్ట్ దెం టుడు''

నాకనుమాన మొచ్చింది,"ఇంతకీ ఆ ఆకాశరామన్న తమరే నా మహానుభావా?" అనడిగాను.

"ఛ, మరీ అంత తక్కువ స్థాయికి పోతే అందులో ఆనందంలేదయ్యా! ఉత్తరం మాత్రం నేను రాయలేదు. బులేరావు రాశాడు. అందులో సందేహం లేదు''

"అంటే, వాళ్ళు 'పగిడీ' తీసుకుని మీ ఇల్లు అద్దెకిచ్చినా మీకేం అభ్యంతరం లేనట్టుంది!"

"నిజం చెప్పాలంటే లేదు. అలా అని, వాళ్ళు నా ఇంటికి 'పగిడీ' తీసుకోవాలని కాదు. ఏదో కక్కుర్తి పడ్డారు. విషయం బయటపడ్డప్పటినుండీ వేస్తున్న పిచ్చిగంతులు చూస్తున్నావు కదా! వాడికి సరైన వాటారా లేదు. వాళ్ళు బయటపడి పరువుపోయిందే అని, పోయిన పరువును కాపాడుకోటం కోసం నిన్ను బలిపెట్టారు. అక్కడే చిన్న పొరపాటయిందయ్యా! బులేరావును శాక్రిఫైస్ చేస్తారనుకున్నా కానీ, దుమారం నీవైపు తిరుగుతుందనుకోలేదు''

"మరేం చెయ్యదల్చుకున్నారు? నేను వేరే ఇల్లు తీసుకుంటాగానీ, మీరు మాత్రం ఆమరణ నిరాహారదీక్షల్లాంటివి పట్టకండి''

"ఓసారి వేసిన ఎత్తు మరోసారి వేయటం మన జన్మలో లేదు. ఈసారి రైవల్ 'కివాసం' లేవదీస్తా. మన బులేరావు దానికి సెక్రెటరీ. చూస్తుండు, తెరవెనుక నాటకం ఎలా నడుపుతానో. మనవాళ్లల్లో దుర్మార్గులెవరూ లేరు. మామూలు మనుషులు- డబ్బు కక్కుర్తితో నాటకమాడే మనుషులు. ఈ రాజకీయాలన్నీ స్వప్రయోజనానికి వేసుకున్న వేషాలే. అసలు పొలిటికల్ కన్విక్షన్, కమిట్‌మెంట్ వున్నవాడె

వడూ లేడు''

"అందరూ అలాంటి వాళ్ళు కాదులెండి. ఆర్థిక సంబంధాలే మనుష్యుల బాహ్యప్రవర్త నను నిర్ణయిస్తాయ్యంటే! మీరు కాదంటారు. మరిదంతా ఏమిటి?"

"అది నిజమేననిపిస్తోంది. ఏమో చెప్పలేను. సరే, నువ్వొక మాటివ్వాలి''

"ఏవిటది?"

"నేను బతికున్నంతకాలం నువ్వు ఇల్లు ఖాళీచెయ్యొద్దు. అద్దె కట్టటం కష్టమైతే మానెయ్యి. నా చేతిలో చెయ్యివేసి చెప్పు. మనసుకు దగ్గరకొచ్చిన వాళ్ళను కూడా దూరంచేసుకుని, అక్కడకు వెళ్తే ఆ పైవాడు, 'ఒరే జోషువా! నువ్వు కివాసులందరితో ఆటలాడుకున్నావు. వాళ్ళ మనసులు కష్టపెట్టావు. నీకిష్టమైన పెద్దమనిషిని కూడా నీ నాటకాల్తో ఇంట్లోనుండి గెంటేశావు. నువ్వెంత క్రూరాత్ముడివిరా గాడ్దీ' అని తిడ్తే నేనేం జవాబు చెప్పుకోవాలి?" ఆయన కళ్ళల్లో నీళ్ళు నిల్చాయి. అంత స్నేహ పిచ్చలుడైన మనిషికి నేనేం సమాధానమివ్వలేకపోయాను.

"సరేలెండి. నేను ఇల్లు ఖాళీచెయ్యను. అద్దె మాత్రం మీరు తీసుకోవల్సిందే''

"అదీ అలా అన్నావు. ఇప్పుడీ హృదయం కుదుటపడ్డది. నిజానికి మీరెవరూ నా ఇల్లు ఖాళీ చెయ్యటం నాకిష్టంలేదు. మరీ చూస్తూ కూర్చుంటే బావుండదని వాళ్ళకు నోటీసులిచ్చాను. ఇప్పుడు చూడిహ, మన ప్రబుద్ధులు ఒకళ్ళనొకళ్ళెలా వెలివేసుకుంటారో'

"ఇలా మనుషులతో ఆడుకోటమేమన్నా బావుందా?"

"నేనూ వాళ్ళతో ఆడుకోటం లేదయ్యా! వాళ్ళ బుద్ధులే వాళ్ళతో ఆడుకుంటున్నాయి''

ఇంతలో మైకేల్, క్రిస్టోఫర్లు మెట్లెక్కి పైకొచ్చారు. "అత్తా! ఎక్కడున్నావు. వాన్ సెటిల్ చేసుకొచ్చాం"

మైకేల్ మాటలు విని మిద్దెదొరసాని లోపలనుండి వచ్చింది. "ఎంతకు మాట్లాడారు?" అనడిగిందామె.

"రెండొందలు'' అన్నాడు క్రిస్టోఫర్.

"సరే, నే వెళ్ళి అందరితో చెప్తాను'' అని ఆమె మెట్లు దిగి బయటకెళ్ళింది.

నేనేమిటా అని చూస్తుంటే జోషువాగారు చెప్పారు "అదేనయ్యా! పిల్లల్ని వెలివేయటం మాకూ కష్టంగానే వుంది. అమ్మాయి లోగిలి పిల్లల్ని తీసుకుని పార్క్‌కు పిక్నిక్ తీసుకెళ్తోంది. మన మెట్టా తగలడ్డా పిల్లల్ని సక్రమంగా పెంచాలికదా! మైకేల్, అమ్మాయి, క్రిస్టాఫర్, రోషన్, అక్షనాథ్, రోజీలు ప్లానేశారు. అదీ కథ. 'యోగక్షేమం వహామ్యహం' అన్నాడు చూడు కృష్ణపరమాత్మ- ఎల్లెసీ వాళ్ళు కాదులే- అలా నేనిక్కడుండగా నిన్నెక్కడికీ పోనిచ్చేదిలేదు'' అన్నాడు ఆయన, సిగార్ గుప్పుగుప్పుమనిపించి.

ఇంత సహృదయతముందు, నా అల్పత్వం నాకు గోచరించి, నన్నేం మాట్లాడనీయలేదు.

మా పిల్లలు వస్తారని తెలియని 'జోధలో కివాసులు తమ పిల్లల్ని మిద్దెదొరసానితో పిక్నిక్‌కి పంపారు. అంతే, ఇహ ఆ తర్వాత తమ పిల్లలు, మా పిల్లలతో కలవకుండా ఆపటం వాళ్ళతరం కాలేదు. భానుకు కొంత దిగులు తీరింది.

ఆ తరువాత చెప్పాడు జోషువాగారు తను బులేరావునెలా టాకిల్ చేశాడో.

★ ★ ★

రామచిలుక వివాహం 22వ తారీఖు రాత్రి 7.30 గంటలకు లగ్నం. కాంగోరెడ్డి సాధ్యమైనంత వరకూ ఖర్చులు తగ్గించి, తన కష్టానికి కమీషను గిట్టకపోయినా, తను చందావేసుకున్న వెయ్యి రూపాయలైనా మిగలాలని ప్రయత్నం చేస్తున్నట్టనిపించింది నాకు.

పెళ్ళిరోజు తెల్లవారుఝామున ఐదు గంటలకు చీకట్లోనే అండమ్మ మా ఇంటికొచ్చింది. ఎవరూ చూడకుండా జాగర్తపడ్తూ "అమ్మాయి భానూ! నువ్వూ, మీ ఆయనా,




పిల్లలూ అమ్మాయి పెళ్ళికి రావాల్సింది. నీకు తెల్సిన సంగతేకదా! అందరికీ తెలిసేట ట్లు మిమ్మల్ని పిలవటానికి వీల్లేదు'' అని ఆహ్వానించింది.

"అయ్యో! అదేంటి పిన్నిగారూ! మీరు పనిగట్టుకురావాలా? మీరు వచ్చి చెప్పకపో యినా మేం రామచిలుక పెళ్ళికి రాకుండా ఎలా వుంటాం..." అంది భాను.

మేం పెళ్ళికి వెళ్ళాం. మాతో ఎవరూ మాట్లాడలేదు. జోషువాగారు, మిద్దెదొరసాని, మైకేల్ కూర్చున్నచోటికి వెళ్ళి మేమూ కూర్చున్నాం. త్రివిక్రమాచార్యులు కాంగోరె డ్డిని పిల్చి ఏదో అడిగాడు. వేదిక బయటకు వచ్చి ఇద్దరూ ఘర్షణపడ్డారు. ఆ మాటలు మాకు విన్పించలేదు. కాసేపున్న తర్వాత కాంగోరెడ్డి వచ్చి జోషువాగార్ని రమ్మని పిల్చాడు. ఆయన లేవబోతూంటే "ఆయన్ని కూడా పిలవండి'' అని నావైపు చూపించి చెప్పాడు. అత్యవసర పరిస్థితి ఏర్పడకపోతే కాంగోరెడ్డి నన్ను పిలవడు. మేం ముగ్గురం, త్రివిక్రమాచార్యులు మేడ మెట్లెక్కి జోషువా గారింటికెళ్ళాం.

"ఏంటయ్యా? ఏమైంది?" అని అడిగాడు జోషువాగారు సోఫాలో కూర్చుంటూ.

"మేం కట్నం ఎంతకు మాట్లాడుకు న్నామో ఆయన్ని చెప్పమనండి'' అన్నారు రెడ్డి నావంక చూపుతూ.

"ఏం? ఇరవై వేలు!" అన్నాను నేను.

"చూశారుగా, మాటలకొచ్చింది మేమిద్దర మే. అప్పుడు మీరు కూడా ఒప్పుకున్నారు, ఇరవైవేలకు. ముందే మీకు కట్నం డబ్బు ఇరవై వేలూ ఇచ్చాను. ఇప్పుడు కట్నం పాతిక, మిగతా ఐదువేలూ తెమ్మంటే నేనె క్కడనుండి తేవాలి?" అన్నాడు కాంగోరెడ్డి త్రివిక్రమాచార్యులతో.

"అబద్ధాలాడకు. మనం మాట్లాడుకుంది పాతికవేలకు. మీరప్పుడు ఇరవై వేలిస్తే, మిగ తా ఐదూ పెళ్ళి సమయంలో ఇస్తారనుకున్నా ను. అప్పుడే కక్కమనలేదే. వీలుచూసుకుని ఇమ్మన్నాను. ముహూర్తం టైమవుతున్నది. మిగతా డబ్బివ్వకుండా గుట్టుచప్పుడుగా కూర్చున్నారు. ఇదేం పెద్దమనిషి తరహాన య్యా?"

"లేదండీ, కట్నం ఇరవైవేలే. మీరు పాతిక అడిగినా మావల్ల కాదంటిమికదా!" అన్నాను నేను.

"అంటే నేనబద్ధం చెప్తున్నానా? అసత్యం పలకటం మా ఇంటా వంటాలేదు. ఇదుగో గాయిత్రి సాక్షిగా చెప్తున్నాను. మీరు పాతిక వేలు ఇస్తానన్నారు'' అన్నాడు జంధ్యం కుడి చేతి వేళ్ళ మధ్య పట్టుకుని త్రివిక్రమాచార్యు లు.

"ఒట్లు నేనూ పెట్టుకుంటాను. దానికేం. మేం ఒప్పుకుంది ఇరవైవేలకే'' అన్నాడు కాంగోరెడ్డి.

"అంటే నేను తప్పుడు ప్రమాణాలు చేస్తు న్నానంటావా? ఛాఛా. ఇట్లాంటి దరిద్రపు సంబంధమని తెలీక ఒప్పుకున్నాను. 'నానా గోత్రేభ్య!' అని కులం లేదు, మతం లేదు. అందరు భ్రష్టవెధవల్ని చేర్చి, అనాచారంగా సాగే ఈ కొంపలో పెళ్ళి నాకిష్టంలేదు. ఈ పెళ్ళి జరుగదు'' అన్నాడు త్రివిక్రమాచార్యు లు రంకెవేస్తూ.

జోషువాగారు లేచి, లాగి పెట్టి చెంపదెబ్బ ఒక్కటిచ్చాడు త్రివిక్రమాచార్యులకు.

"గాడిదకొడకా! అందరం నానా మతాలవా ళ్ళం, కులాలవాళ్ళం ఏకమై ఆడపిల్ల పెళ్ళిచే స్తుంటే అనాచారమైందా? నీ బోడి ఆచార మేంది? కట్నం తక్కువైందని పెళ్ళి ఆపు చేస్తావా? నువ్వు సక్రమంగా కాళ్ళూ చేతులతో ఈ ఇంట్లోనుండి బయటపడాలంటే ఈ పెళ్ళి ఆపకు..." అన్నాడు జోషువాగారు రౌద్రంగా.

"ఈ కిరస్తానీ లంజకొడుకెవ్వడయ్యా! ఓరి త్రాష్టపు వెధవా నన్ను కొడ్తావా? నా కాళ్ళు విరిచేస్తావా? చూడు, అసలు ఈ పెళ్ళి

ఎట్లా అవుతుందో. నేను త్రివిక్రమాచార్యుల ను, మా నాయన కడుపున పుట్టివుంటే ఈ పెళ్ళి కాదు'' అని విసురుగాలేచి వెళ్ళబోయా డాయన.

జోషువాగారు ఆయన్ని సోఫాలో కూలబ డేట్టు ఓ తోపుతోసి, గది తలుపు బోల్ట్ పెట్టాడు.

"ఓర్నాయనో! ఈ తప్పుడు ముండాకొడు కులు ముగ్గురూ కల్సి నన్ను చంపేస్తున్నా ర్రోయ్... నారాయణ, వాసుదేవ, పుండరీకాక్ష, జనార్దన రక్షమాం, పాహిమాం. అడియేక దాసోం. ఇహ నాచేతిలో ఏం లేదు. యముల వాళ్ళు వచ్చారు. ఆ గజేంద్రుణ్ణి రక్షించినట్టు నన్ను రక్షించు తండ్రీ! పరాత్పరా... రామా నుజ... ఇక నీవే నాకు దిక్కు..." అని అప్పటిదాకా తెచ్చిపెట్టుకున్న గాంభీర్య మంతా నీరుకారిపోగా వాపోయాడు ఆచార్యు లు''

"ఓర్నీయమ్మ కడుపుడక. గోలచెయ్యకు. నీకు ప్రాణభయమేంలేదు. కాంగోరెడ్డీ! నువ్వు కిందకెళ్ళి మనం లేని లోపం లేకుండా పెళ్ళి జరిపించమని కూగాశాస్త్రికి చెప్పిరా. ఆ... ఈయన భార్యతో కూడా చెప్పు. మొగుడు కన్పించలేదని అరిచి, గోలచెయ్యగలదు. పోనీబాబూ! ఆ అల్మారాలో షివాస్ రీగల్ వుంది. నాలుగ్లాసుల్లో పోసి ఐసు వేసి పట్రా!" అని ఇద్దరికీ హుకుం జారీచేశారు జోషువాగా రు.

నేను సరంజామా తయారుచేసేటప్పటికి కాంగోరెడ్డి కూడా తిరిగి వచ్చి, గది బోల్ట్ పెట్టాడు.

"ఊ... కానివ్వండి... పుచ్చుకుంటూ మా ట్లాడుకుందాం" అన్నాడు జోషువాగారు ఆచా ర్యులగారితో.

"అమ్మమ్మ... మద్యమా... తప్పు!" అన్నాడు త్రివిక్రమాచార్యులు ముక్కు మూ సుకుంటూ.

"ఈ పతివ్రత వేషాలెయ్యకు పుచ్చుకో. నువ్వు తాగుతావని నాకు తెల్సు''

"ఏం తెల్సు...? పవిత్ర వైష్ణవ కుటుంబంలో పుట్టి మద్యపానసేవనమా?"

ఓరినీ వైష్ణవం తగలడా! నీ తమ్ముడు గోపాలాచార్యులు కదూ...?"

"అవును, మీకు తెల్సా...?"

"నాకన్నీ తెల్సయ్యా! ఊ కానీ పుచ్చు కో..."

మారుమాట్లాడకుండా గ్లాసెత్తి ఓ గుక్క పుచ్చుకుని "కృష్ణార్పణం" అన్నాడు త్రివిక్ర మాచార్యులు.

"అవునూ, కట్నం ఎంతకు మాట్లాడుకు న్నావు''

"పాతికవేలకు. ఇరవైవేలు ముందుగానూ, ఐదువేలు వీలుచూసుకునీ ఇమ్మన్నాను''

"మేం ఇరవైవేలే ఇస్తామన్నాం. అప్పుడు పేచీ పెట్టననీ అన్నారు మీరు. ఇంక మేమి చ్చేదేం లేదు'' అన్నారు రెడ్డి.

"ఇవ్వాళ బలవంతంగా నన్నిక్కడ కట్టిప డేసి, పెళ్లి జరిపించినా తర్వాత ఆ పిల్ల కాపురమెట్లా చేస్తుందో నేను చూస్తాను. దిక్కు మాలిన సంబంధం దొరికింది'' అన్నారు త్రివిక్రమాచార్యులు ప్రాణభయంపోయి బలం పుంజుకుంటూ.

"దిక్కుమాలినవాళ్ళకు దిక్కుమాలిన సంబంధమే దొరుకుతుంది'' అన్నాడు జోషు వాగారు.

"మాది దిక్కుమాలిన సంబంధమా... సలక్షణంగా తండ్రీ కొడుకులం సంపాయిస్తు న్నాం"

"ఇద్దరనక నీ కొడుకు సంపాయిస్తున్నా డు. నువ్వు సంపాయించింది చీట్లపేకకు తగలేస్తున్నావు''

"మీకెవరు చెప్పారు?"

"పిల్ల పెళ్ళి వీళ్లిద్దరూ కుదిర్చారంటే, నేనేమీ పరామర్శించకుండా ఒప్పుకున్నాను టయ్యా? మీ తమ్ముడు గోపాలాచార్యులు-





కోర్టుపక్షి. నాకెప్పటినుండో పరిచయంలే. నువ్వు దమ్మిడీకొంపకు తేవు. నీ కొడుకు సంపాదనతోనే ఇల్లు గడవాలి. మిగతా లోపాల సంగతెందుకుగానీ, నీ సంగతి తెల్సి నీ కొడుక్కెవడు పిల్లనిస్తాడయ్యా? పోన్లే తండ్రిముండాకొడుకెలాంటి వాడయితేనేం. పిల్లవాడు బుద్ధిమంతుడని వాళ్ళూ వీళ్లూ చెప్పగా నేను సరేనని ఒప్పుకున్నాను'' అన్నారు జోషువాగారు సిగారు గుప్పు గుప్పుమని పిస్తూ.

"నేను పేకాడుతాను, తాగుతాను, నా ఇష్టం. మీకనవసరం. నాకివ్వాల్సిన ఐదువేలూ ఇవ్వండి''

"ఇవ్వం" అన్నాడు జోషువాగారు.

"మళ్ళీ అడుగుతున్నాను. ఆలోచించుకోండి''

"ఇవ్వం. ఇవ్వమంటే ఇవ్వం"

"సరే చూస్తా. ఆ పిల్ల కాపురమెట్టా చేస్తుందో'

"ఎట్టా ఏంటి? సలక్షణంగా చేస్తుంది. నువ్వు చెయ్యటంలా నీ రెండో పెళ్ళాంతో..."

"అయ్యా! మహాప్రభో! దాసోహం... ఇంక మీరేం మాట్లాడొద్దు. నా పరువు తీయవద్దు. మీకు పదివేల దణ్ణాలు'' అని కాళ్ళ బేరానికొచ్చాడు త్రివిక్రమాచార్యులు.

"నీకు ఖదువేలూ అక్కర్లేదుగా?"

"అఖర్లేదు మహాప్రభో, అఖర్లేదు. బుద్ధి తక్కువై అడిగాను''

"కోడల్ని సరిగా కాపురం చెయ్యనిస్తావా?"

"నెత్తిన పెట్టుకుచూస్తాను. బుద్ధి పొరపాటై అన్నాను. చెంపలు వాయించుకుంటున్నాను మహాప్రభో' అని చెంపలు టకటకా వాయించుకున్నాడు త్రివిక్రమాచార్యులు.

"నానాకులాలు, మతాలు, అనాచారం అని ఏడవ్వుగా?"

"ఇంక నోరు తెరిస్తే ఒట్టు. చచ్చిన పామును చంపొద్దు మహానుభావా?"

"ఇంకో విషయం. ఈ సంగతులన్నీ నీ తమ్ముడు చెప్పాడని వాడిమీద పడి ఏడవకు. వాడు బుద్ధిమంతుడు కనుక నేను తరచి తరచి అడిగినా నీ గురించేం చెప్పలేదు, ఎంతసేపూ పిల్లవాడు 'బుద్ధిమంతుడ' నటం తప్ప. ఈ సంగతులన్నీ నేనక్కడక్కడా విచారించి తెల్సుకున్నాను''

త్రివిక్రమాచార్యులేం మాట్లాడలేదు. రామచిలుక వివాహం ఎలాంటి అడ్డంకుల్లేకుండా అయిపోయింది.



రామచిలుక పెళ్ళి అయిన రెండురోజులకు మళ్ళీ జోషువాగారికి మైల్డ్ హార్ట్అటాక్ వచ్చింది. మళ్ళీ రెండురోజులు నర్సింగ్ హోంలో వుండివచ్చాడాయన. మళ్ళీ మందులు, డాక్టర్ల సలహాలు- డూస్ అండ్ డోంట్స్. జోషువాగారి తంతు మామూలే. అయితే ఈసారి ఆసుపత్రినుండి బయటకొచ్చింర్వాత ఆయన ఇంక ఆలస్యం చెయ్యలేదు. కూగాశాస్త్రిని కూచోబెట్టి, దొరికినంతలో మంచి ముహూర్తం పెట్టించి ప్రభుదాసుతో కలిసి వెళ్ళి వాళ్ల చర్చి పాస్టర్‌తో మాట్లాడి ఆ లగ్నానికి పెళ్ళి జరిపించటానికి ఒప్పించాడు. కూతురి బాప్టిజం సర్టిఫికేట్ కూడా తీసుకెళ్ళి ఇచ్చాడు. వారి వారి చర్చిల్లో మూడుసార్లు 'బ్యాండ్' ప్రకటనలు కూడా అయ్యాయి. ఫలానారోజు ఫలనా అబ్బాయి అమ్మాయిలకు పెళ్ళి జరిపించ పెద్దలు నిశ్చయించారుగాన, ఎవరికైనా ఆక్షేపణలుంటే తెలియపర్చవల్సిందని ప్రకటించటాన్నే 'బ్యాండ్' అంటారు.

కొడుకులిద్దరికీ ఉత్తరాలు రాశాడు జోషువాగారు. వాళ్ళు పెళ్ళి వారంరోజులుండనగా ముందుగానే వచ్చారు. పెద్ద కొడుకు ఫ్రెడ్ జోషువాకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. పెద్ద కొడుకు మైకేల్ తాతగారి దగ్గర వుండి మెడిసన్ చదువుతున్నాడు. రెండో సంతానం

లిజా-ఎలిజబెత్ రెండేళ్ళనుండి బొంబాయిలో ఓ ప్రైవేటు ఫర్మ్‌లో స్టెనోగా పనిచేస్తోంది. చిన్న కొడుకు టెంత్‌క్లాసు చదువుతున్నాడు. ఫ్రెడ్ జోషువా వయస్సు 53-54 ఏళ్లుంటాయి. తండ్రి లాగానే కొంచెం దొందు ఒళ్లు. పెద్ద టెక్స్‌టైల్ ఫాక్టరీలో ప్రింటింగ్ మాష్టరుగా పనిచేస్తున్నాడు. ఏ విషయాన్ని పట్టించుకోడు. అయితే ఆయన భార్య మిరియం జోషువా మాత్రం తనకు తెలియకుండా ఏ విషయాన్నీ జారిపోనివ్వదు. తన విపరీతమైన ఆసక్తితో భర్తను తరుచూ వేధిస్తూవుంటుంది.

రెండో కొడుకు- పాల్ జోషువా; వయస్సు 47-48 వుంటుంది. ఆయన ఎలక్ట్రానిక్స్ ఇంజనీరు. 'భెల్'లో పనిచేస్తున్నాడు. మనిషి సన్నగా వుంటాడు. మాట పరుషంగా వుంటుంది. ఆయన భార్య కాథరిన్ నలభయ్యోపడిలో పడింది. మనిషి నెమ్మది. వాళ్ళకిద్దరు కూతుళ్లు. పెద్ద కూతురు లిల్లీ పదిహేనేళ్లది. రెండో కూతురు సోఫీకి పదేళ్లు. వాళ్ళిద్దరూ ఇంకా స్కూల్లో చదువుతున్నారు.

జోషువాగారి తర్వాత 'జోధలో' యజమానులు ఫ్రెడ్, పాల్‌లు ఇద్దరూ. వారి రాక మా 'జోధలో'లో విపరీతమైన సంచలనాన్ని తీసుకువచ్చింది.

జోషువాగారు బులేరావుతో ఒప్పందానికొచ్చింతర్వాత, అతను లెబా, సిపిఐ శర్మ, రాచిప్పచెట్టిలతో రహస్య సమాలోచనలు సాగిస్తున్నాడు. ఎవరో ఒకరి ఇంట్లో వుండి వాళ్ళు మంతనాలాడటం నాకు కన్పిస్తూనే వుంది. అవేం తెల్సుకునే అవకాశం నాకు లేదు. ముందాలోచనలు చేసి, ఎవరితో మాటలు కలుపుకుంటే లాభదాయకంగా వుంటుందో యోచించే పాల్ జోషువాతో దోస్తీ ఎక్కువ చేశారు బులేరావు. అతన్ని తన ఇంటికి పిల్చి ఆతిథ్యమిచ్చి తెగమాట్లాడేస్తున్నారు.

తన్ను పిలవకుండా వాళ్లు నల్గురూ మంతనాలు సాగించటం, రహస్య సమాలోచనలు చేయటం, బులేరావు పాల్ జోషూవాను తన ఇంటికి అతిథ్యానికి పిలవటం చూసిన కాంగోరెడ్డికి గాబరా పుట్టింది. తను నిశ్శబ్దంగా వుంటే రాజకీయంగా నాశనమవుతానని ఉద్దేశంతో ఫ్రెడ్ జోషువాతో స్నేహం పెంచుకోవటం మొదలెట్టారు. జైన్, హరబాబులు అతని ప్రయత్నాల్లో ఇతోధిక సాయం చెయ్యసాగారు. కన్య, బేగం, కాళీలు మిరియం జోషూవాకు 'కాకా' పట్టసాగారు.

నేనారోజు సాయంత్రం మిద్దెమీద జోషువాగారితో మాట్లాడుతున్నాను. అంతలో కొడుకులిద్దరూ భార్యలతో బయటనుండి వచ్చారక్కడికి. జోషువాగారు నన్ను వాళ్ళకు పరిచయం చేశాడు.

"ఓహో! మీరేనా పోనీగారు. ఇల్లెప్పుడు ఖాళీ చేస్తున్నారు?" అనడిగాడు పాల్.

"ఎందుకూ ఆయన ఇల్లు ఖాళీ చేయటం?" అడిగాడు జోషువాగారు విస్తుపోతూ.

"జోధలోలో తగవులు పెడ్తున్నందుకు"

"అలా అని ఎవరు చెప్పారు నీకు?"

"ఎవరు చెప్తే ఏంలే నాన్నా! అది నిజం కాదా?"

"నిజాలు అంత సులువుగా తెలియవురా అబ్బాయి!"

"ఎందుకు తెలీవు? పాపం, ఆ పెద్దమనిషి మొత్తుకున్నారు, ఈయనిక్కడుండటం వల్ల కివాసుల జీవితం దుర్భరమైపోతోందని"

"ఎవడా పెద్దమనిషి?"

"బులేరావు! అతనొక్కడే కాదు, ఆ సిపిఐ శర్మ, అతని పేరేంటీ. లె... లెబా అతనూ అన్నాడు"

"ఇంకేం చెప్పారు?"

"చాలా చెప్పారు. ఈయనకుతోడు ఈ కాంగోరెడ్డి, జైన్లుట. మీ ఉదారస్వభావాన్ని అలుసుగా తీసుకుని వాళ్ళు ముగ్గురూ కల్సి





నాటకమాడుతున్నారట. మా బెంగుళూరులో లా ఇక్కడ 'పగిడీ' ఎక్కువుందా? వీళ్లు ముగ్గురూ మనింటికి 'పగిడీ'లు తీసుకుంటున్నారటకదా! పొద్దున్న ఆ కాంగోరెడ్డీ, జైన్లు కన్పిస్తే చెప్పాను- ఇల్లు ఖాళీ చెయ్యమని'' అన్నారు పాల్.

తన ఇంట్లో అద్దెకుండే మనుషులను, పురుగుల్లా చూసే మనస్తత్వం అతనిది. అందువల్లే నా ఎదుటనే నా గురించి దాచుకోకుండా మాట్లాడేశాడతను.

"మరి ఆ బులేరావు, సిపిఐ శర్మ, లెబా, రాచిప్పచెట్టి- అతనూ, తక్కువవాళ్ళా? వాళ్ళకూ ఖాళీ చెయ్యమని చెప్పలేకపోయావూ?" అనడిగింది మరిదిని మిరియం జోషువా.

"ఎందుకమ్మా! వాళ్ళని ఖాళీ చేయమనటం?" అడిగాడు పాల్.

"మరి వాళ్లూ తీసుకున్నారట 'పగిడీ'లు''

"ఎవరు చెప్పారు?"

"ఎవరో ఒకళ్లు చెప్పార్లే. నేనూ ఎంక్వైరీ చేస్తున్నాను. మామగార్ని అలుసుగా తీసుకుని ఎవరెవరేం చేస్తున్నారో?"

"నీ ఇన్వెస్టిగేషన్ ఫలితమేమిటోయ్'' అనడిగాను ఫ్రెడ్ జోషువాను.

"ముఖ్యంగా ఆ బులేరావు, లెబా, సిపిఐశర్మలు దుర్మార్గులంట. 'ఇంకా నాల్గురోజులు పోతే ఈ లోగిల్నే అమ్మేస్తారు అక్కా! జాగ్రత్త పడు' అని చెప్పింది ఆ అమ్మాయి కన్య. ఆ కాంగోరెడ్డి భార్య కాళి పెద్ద ముత్తయిదువ. చాలా కలుపుగోలు మనిషి. బేగం సరేసరి. అంత మంచి మనుషులెవరూ లేరననుకో. ఉన్నవాళ్ళల్లో కాంగోరెడ్డీ, జైన్లే సీనియర్లంటకదా! ఈ కొత్తవాళ్ళందరూ వచ్చి 'జోధలో లో శాంతి లేకుండా చేస్తున్నారట"

"మరి పోనీబాబు సంగతి చెప్పలేదా?" అనడిగాడు జోషువాగారు.

ఆమె నావంక చూసి తలెగరేసి చెప్పింది. "చెప్పకేం, చెప్పారు. అదేదో కథలో పిల్లీ పిల్లీ రొట్టె కోసం తగూలాడుకుంటే, ఆ రొట్టెముక్క కాస్తా మాయంచేసిన కోతిలాంటి మనిషంట" అని.

"మరి నువ్వు ఎవళ్ళనెవళ్లని ఖాళీ చేయమని చెప్పావు?"

"చెప్పలేదు. ఆ బులేరావు, లెబా, సిపిఐశర్మ, రాచిప్పచెట్టిల్ని ఖాళీ చెయ్యమని చెప్దామనుకుంటున్నాను'' అందామె.

"మంచిపని చేశావు. ఇంకా చెప్పలేదుకదా'' అన్నాడు జోషువాగారు.

"అదేంది వదినా! వాళ్లు ఖాళీ చెయ్యాల్సిన పనిలేదు'' అన్నాడు పాల్.

"ఎందుకు లేదూ, బోల్డంత వుంది. మనకు తెలీకుండా మనింటిమీద 'పగిడీ'లు తీసుకుంటున్న వీళ్లని లేపేసి, మనమే 'పగిడీ'లు తీసుకుని కొత్తవాళ్ళ కద్దెకివ్వవచ్చు'' అందామె చురుగ్గా ఆలోచిస్తూ.

"కాని అసలు నేరస్తుల్ని వదిలేసి నిర్దోషుల్ని శిక్షించటమవుతుంది. ఈ పోనీబాబును, కాంగోరెడ్డి, జైన్లను ఖాళీచేయించి, వాళ్ళ పోర్షన్లకు 'పగిడీ'మీద అద్దెకివ్వొచ్చు'' అన్నాడతను.

"నీకు తెలియదు. నీవు మాట్లాడకూర్కో''

"నీకు తెలియదు వదినమ్మా! కావాలంటే ఆ హరబాబును కూడా లేపెయ్యచ్చు''

"అదేందయ్యా! ఆ హరబాబు, కన్య మనాళ్లు. పాపం వాళ్లేం చేశారు. మనాళ్లు కాబట్టే ఇక్కడ జరిగే విషయాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పారు. ఇంకోళ్ళయితే మనకీ విషయాలు తెలిసేవే కావు''

"మరి ఆ రోగ్స్‌తో చేతులు కలుపుతున్నందుకు అతన్నీ పంపించెయ్యాల్సిందే''

"అతనేం వాళ్లతో చేతులు కలపలేదు. ఆ కాంగోరెడ్డీ, జైన్లూ రోగ్సూకాదు. మనాళ్లు ఎలాంటోళ్లయినా వాళ్లనెలాఖాళీచేయిస్తాం? మనా, పరా చూసుకోవద్దా?"

"నీకు తెలీదు, వూర్కో వదినమ్మా!"

"నీకేం తెలీదు, నువ్వు మాట్లాడకయ్యా పాలూ!"

"ఆడాళ్లు ఈ వ్యవహారాలు పట్టించుకో కుండా వుంటం మంచిది''

"అదేంమాట. ఏమిటండీ చూస్తూ ఊర్కొన్నారు? ఇంటికి పెద్ద కోడల్ని. నేను ఇంటి వ్యవహారాలు పట్టించుకోకూడదంట! మాట్లాడరేం"

"అదేందిరా... మీ వదినమ్మ తన అభిప్రాయం చెప్పింది. దాంట్లో తప్పేంది'' అన్నాడు ఫ్రెడ్.

"సరే మీరే చూసుకోండి, నేనసలు పట్టించుకోను. ఎవరెట్లా ఛస్తే నాకేం"

"అక్కడికి మాకే పట్టి చచ్చింది కాబోలు. మేమే బావుకుంటున్నాము ఇదంతా!" అని మెటికలు విరిచింది మిరియం జోషువా.

"మీరిద్దరూ ముయ్యండి నోళ్లు. ఈ లోగిలి నా స్వార్జితంతో కట్టింది. నేను చచ్చిందాకా ఈ లోగిలి విషయాల్లో మీరు తలదూర్చరాదు. ఆ తర్వాత మీరేం ఏడ్చుకుంటారో ఏడ్చుకోండి. అప్పటిదాకా ఈ లోగిల్లో ఎవరు వుండాలో, ఎవరు పోవాలో నిర్ణయించేది నేను. ఇక్కడ మీరు వర్ణించినంత మహా దుర్మార్గులెవరూ లేరు. వాళ్లూ వాళ్లూ చెప్పిన మాటలుబట్టి పోనీబాబు ఎదురుగుండానే ఆయన్ని నేనే అనని మాటలు మీరన్నారు. ఆయన మనింట్లో ఊర్కే వుండటంలేదు. అద్దె చెల్లించి వుండమంటున్నాను. ఆయన్ని అనవసరంగా మాటలు అన్నందుకు మీరెలాగో క్షమాపణలు చెప్పరు. మీ తరపున ఆయన్ని క్షమించమని కోరుకుంటున్నాను. ఇంకెప్పుడూ ఇలా అమర్యాదకరంగా మాట్లాడొద్దు. గుర్తుంచుకోండి'' అన్నాడు జోషువాగారు.

"హుం మాకేం పట్టింది. మీరే చూసుకోండి. వద్దండీ పిల్లవాడి చదువుపోతుంది, రావద్దనే అన్నాను. ఆయనే చెల్లెలి పెళ్లి వెళ్లక తప్పదు అని తీసుకు వచ్చారు. వచ్చినందుకు మా బాగా అయింది'' అని ఈసడించుకుంటూ లోపలకు వెళ్లింది మిరియం జోషువా.

"ఇప్పుడే చెప్తున్నాను నాన్నా? వీళ్లని నెత్తినెట్టుకోక, తర్వాత నీ ఇష్టం. నువ్వే ఇబ్బంది పడ్తావు'' అని వెళ్లిపోయారు రెండో కొడుకు పాల్ జోషువా లోపలకు.

అలా అయింది జోషువాగారి కొడుకు, కోడళ్లతో నా మొదటి పరిచయం.

పెళ్లిరోజు రానే వచ్చింది. ముహూర్తం ఉదయం పదిగంటలకు. జోధలోకివాసుల మంతా వెళ్లాం పెళ్లికి. మేం వెళ్లేటప్పటికే మగపెళ్లివారు వచ్చేశారు. పెళ్లి సూటులో వున్నారు క్రిస్టోఫర్.

వదిన లిద్దరూ ఆడబిడ్డకు ముస్తాబు చేశారు. తెల్లటి గౌనులోఓ దేవదూతలా మెరిసిపోతోంది మిద్దెదొరసాని. తలమీద రెత్, దాని మీద పొడుగాటి మేలిముసుగు. పాల్ జోషువా కూతుళ్లు లిల్లీ, సోఫీ తెల్లటి ఫ్రాకు లేసుకుని వీల్ రెండు పక్కలా పట్టుకున్నారు. వాళ్లని ఫ్లవర్ గాల్స్ అంటారు. పెళ్లికూతురు ముందు, ఆమె వెనుక మేమందరం నడుస్తూ వెళ్లాం చర్చిలోకి.

ఆరోజే సారెపెట్టి జోషువాగారు మిద్దె దొరసానిని కాపురానికి పంపాడు. ఆమెతోపాటు ఆయన చిన్నకోడలు కాథరిన్, కన్య తోడు వెళ్లారు. మూడు రోజుల తర్వాత, నవదంపతులు హనీమూన్‌కు కాశ్మీర్ ప్రయాణం కట్టారు. వాళ్లటు వెళ్లంగానే ఇహ జోషువాగారి సుపుత్రులు సెలవులేదంటూ భార్యాబిడ్డలతో తమ ఊళ్లకు వెళ్లిపోయారు.

★ ★ ★

క్రిస్టోఫర్‌కు స్టేట్స్ వెళ్లే అవకాశం వచ్చింది. వీసా కూడా వచ్చింది. భార్యతో కూడా అతను స్టేట్స్ వెళ్లిపోవటానికి ఏర్పాట్లు చేసుకుంటున్నాడు.

"మన కూగాశాస్త్రి అప్పుడే చెప్పాడు.







వీళ్లిద్దరి శుభగ్రహ సంయోగం వల్ల ఫారెన్ వెళ్లే ఛాన్సు వస్తుందని. అదివ్వాళ నిజమైంది. మై బిలీఫ్ ఈజ్ విండికేటెడ్' అన్నాడు జోషువాగారు.

మైకేల్‌కు సెంట్ థెరిస్సాలో టెంపరరీ పోస్టింగ్ వచ్చింది. అతనక్కడ జాయినయాడు.

ఆ మరుసటి ఆదివారం జోధలోకివాసం ససస ఏర్పాటయింది. బులేరావు ఎనిమిది మంది సభ్యుల సంతకాలతో సభ జరపమని రిటెన్ రిక్విజిషన్ ఇచ్చాడట. ఆ సభలో పెద్దగొడవైంది. "జోషువాగారు ఇల్లు ఖాళీ చెయ్యమని మళ్లీ తాఖీదు ఇచ్చాడు నాకు, సిపిఐశర్మకు. ఇవిగో ఆయన ఇచ్చిన నోటీసులు, సభ్యులు పరిశీలించవల్సింది'' అని అంతకుముందే జోషువాగారి సంతకం సంపాదించిన రెండు కాయితాలు అధ్యక్షుడి టేబుల్‌మీద పెట్టి ఆపైన ఇలా అన్నాడు. "ఇలాంటి తాకీదులు కాంగోరెడ్డి, జైన్లకు అందలేదు. అంటే అర్థమేమిటో నేను విడమర్చి చెప్పాల్సిన పనిలేదు. కాంగోరెడ్డి, జైన్లు జోషువాగారితో ఏదో ఒప్పందానికొచ్చారు. సంఘపు సామూహిక ఆసక్తులను దృష్టిలో వుంచుకోకుండా, సంఘాన్ని తమ పదవులు, ఇంటరెస్టులు కాపాడుకోటానికి వినియోగించటం గర్హనీయం, విచారకరం. కనుక ఇలాంటి కాకామం పై మనకు విశ్వాసంలేదు. ఈ కాకామం పై అవిశ్వాసం ప్రకటించవల్సిందని మీ కందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను'' అని.

దీంతో పెద్ద గోలైంది. వాగ్వివాదాలయాయి. చివరకు ఓటింగ్ తీసుకోవాల్సి వచ్చింది, బులేరావు ప్రతిపాదనమీద. సీక్రెట్ పోలింగ్ జరిగింది. తీర్మానాన్ని ఆమోదిస్తూ 10 ఓట్లూ, వ్యతిరేకంగా 9 ఓట్లూ వచ్చాయి. ఇలాంటి సమయంలో అధ్యక్షుడికి వోటు వేసే హక్కుందనీ, తన ఓటు కాంగోరెడ్డిదే అనీ వాదించారు అధ్యక్షుడైన జైన్. బులేరావు వర్గం దానికి అంగీకరించలేదు. ఆ వర్గం వారంతా వాకౌట్ చేసి వేరే జోధలోకివాసం పెట్టుకున్నారు. దీన్ని జోధలోకివాసం బి (బులేరావు) అనీ, పాతదాన్ని జోధలోకివాసం

ఓ (ఓల్డ్) అనీ జనం పిలవసాగారు. జోధలోకి వాసం బిలో లెబా అధ్యక్షుడు, బులేరావు కార్యదర్శి, ఓల్గా మహిళా ప్రతినిధిగా ఏకగ్రీవంగా ఎన్నికయారు. మెల్లమెల్లగామిగతా సభ్యుల్ని కూడా తన సంఘంవైపు ఏదో పద్ధతిలో ఆకర్షించి, కాంగోరెడ్డిని వంటరివాణ్ణి చేయాలని తీర్మానించుకున్నట్లు నాకు తెలిసింది. ఆ తరువాత యజమాని మద్దతుతో, కాంగోరెడ్డిని లోగిలినుండి వెళ్లగొట్టటం కష్టంకాదని బులేరావు ప్లాను.

అలా జోషువాగారు 'విభజించు-పాలించు' సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టి, కొంతవరకు విజయాన్ని సాధించగలిగాడు. ఇప్పుడు కాకపోయినా, తరువాతయినా ఏదో ఒక యూనియన్ నన్ను కూడా కలుపుకుంటుందని ఆయన ఆశించాడు. ఇంకా ఆయన మనసులో ఏం ఊహలున్నాయోకానీ, అవి సాకారం కాకుండానే ఆయన వెళ్లిపోవాల్సి వచ్చింది.

మిద్దె దొరసానీ, క్రిస్టోఫర్ స్టేట్స్‌కు వెళ్తున్న సందర్భంలో నేనూ, భాను, జోషువాగారు, మైకేల్, హరబాబు, కన్య విమానాశ్రయానికి వచ్చి వీడ్కోలు పలికాం.

వెళ్లేటప్పుడు చెప్పింది మిద్దెదొరసాని, "పోనీబాబూ! మీరున్నారన్న ధైర్యంతోనే నేను అమెరికా వెళ్తున్నాను. నాన్న సంగతి, ఆయన ఆరోగ్యం సంగతి ఇంక మీరే చూసుకోవాలి.

అన్నయ్యల దగ్గరికి వెళ్లమంటే ఆయన నా మాట వినటం లేదు. ఎప్పటికప్పుడు ఆయన క్షేమ సమాచారాలు నాకు ఉత్తరం రాస్తూండండి. మీమీద పెద్ద భారం పెట్టాను. క్షమించాలి'' అని.

"అంత భయపడాల్సిన పనిలేదు. మేమందరం లేమా? ఉత్తరాలు రాస్తూంటాను'' అని భరోసా ఇచ్చానామెకు.

మిద్దెదొరసాని వెళ్ళిపోయింతర్వాత జోషువాగారు మానసికంగా చాలా కృంగిపోయాడు. వంటరితనం అనుభవించసాగాడు. అన్ని పనులు చేసిపెట్టే కూతురు గుర్తుకురాసాగిందాయనకు. నేను వీలయినప్పుడల్లా వెళ్ళి ఆయన్ను పలకరిస్తూనే వున్నాను. అయినా ఆయనలో మునుపటి ఉత్సాహంలేదు. మిద్దెదొరసాని వెళ్ళిన పదిహేనురోజులకు రాత్రి పడుకున్న జోషువాగారు మళ్ళీ పొద్దున లేవలేదు. మంచం పక్క టీపాయి మీద సిగార్, బ్రాందీ బాటిల్, గ్లాసులో సగంవరకూ వున్న బ్రాందీ అలానే వున్నాయి. మైకేల్ అంచనాప్రకారం రాత్రి మళ్ళీ ఆయనకు మాసివ్ హార్ట్‌అటాక్ వచ్చివుండాలి. మొహం మాత్రం ప్రశాంతంగా వుంది. వెళ్ళిపోయాడు గొప్ప మనసున్న మనిషి.

ఆయనపట్ల వున్న కోపాన్ని మర్చిపోయారు కివాసులు. కష్టసమయంలో అంతా ఏకమయారు. మైకేల్‌కు స్వాంతన కల్గించారు. కొడుకులకు ఫోన్లుచేసి చెప్పారు. ప్రభుదాసు, గ్రేసమ్మ, ఊళ్ళో వున్న జోషువాగారి తదితర బంధుమిత్రులు వచ్చారు. ఫ్రెడ్, పాల్‌లు కుటుంబాలతో మర్నాటికిగాని రాలేకపోయారు. వాళ్ళొచ్చిన రోజే అంత్యక్రియలు జరిగాయి. మా 'జోధలో కివాసు'లందరూ ఫ్యూనరల్‌కు అటెండయారు. గుప్పెడు మట్టి గోతిలో వేస్తుంటే నాకు కళ్ళ నీళ్ళు తిరిగాయి. 'ఫూల్! ఎందుకయ్యా ఏడుస్తావు. ఎవరు మాత్రం ఇక్కడ శాశ్వతం? అక్కడ ఆపైన ఇల్లు కట్టి ఆ భగవంతుడికి అద్దెకివ్వాలి. మహారాజకీయాలవాడు వాడు. ఐ గోటు టర్న్ ద టేబిల్స్ అగెనెస్ట్ హిం' అని జోకేస్తున్నట్టుగా ఆయన రూపం నా మదిలో మెదిలింది.

తండ్రి చనిపోయిన సమాచారం తెలియబరుస్తూ ఫ్రెడ్ జోషువా మిద్దెదొరసానికి ఉత్తరం రాశాడు. ఆమె తొందరపడి రావాల్సిన అవసరం లేదనీ, చివరిచూపులకు కూడా ఆస్కారం లేదు కనుక, రానుపోను ఖర్చు శ్రమ తప్ప ప్రయోజనం లేదనీ రాశాడు. తండ్రి అంత్యక్రియల అనంతరం ఆస్తి పంపకా




లు, తండ్రిపేరవున్న బాంక్‌అకౌంట్లు మార్చు కోడం వగైరా పనులకోసం ఫ్రెడ్, పాల్‌లు ఆగిపోయారు.

జోషువాగారు పోయింతర్వాత ఉన్న ఒక్క ఆత్మబంధువూ పోయాక, నాకిహ 'జోధలో'లో వుండమనస్కరించలేదు. ఇళ్ళు అద్దెకిప్పించే ఏజెంటును పట్టుకుని, ఎనిమిదొందల రూపాయల అద్దెకు ఓ చిన్న ఇల్లు కుదుర్చుకోగలిగాను. ఫ్రెడ్, పాల్‌లకు చెప్పి మర్నాడు ఇల్లు ఖాళీ చేద్దామనుకుంటూనే వున్నాను. అంతలో పొద్దున్నే పాల్ బులేరావుని వెంటబెట్టుకుని మా ఇంటికి వచ్చారు. రావటం, ఏమాత్రం మర్యాదలేకుండా, "పోనీగారూ మీరు వెంటనే ఇల్లు ఖాళీ చేసెయ్యండి మేం లోగ్గిలి అమ్మేద్దామనుకుంటున్నాం" అన్నాడతను.

"మీరు వేరే కారణాలు చెప్పక్కర్లేదులెండి. నేనూ ఖాళీచేద్దామనుకుంటూనే వున్నాను'' అన్నాను.

"ఈయన ఇట్టా అంటూనే కాలం గడిపేశారు, మీ నాన్నగారున్నంతకాలం. మీరు గట్టిపట్టు పట్టకపోతే లాభం లేదు'' అన్నాడు బులేరావు.

"ఇదుగో బులేరావు! నీకు ఇందులో ఏం సంబంధంలేదు. నువ్వు కల్పించుకోవాల్సిన అవసరం లేదు''

"ఎందుకవసరం లేదు? నేను 'జోధలోకివాసం' కార్యదర్శిని.''

"'కివాసం' కార్యదర్శి సభ్యుల యోగక్షేమాలను విచారించాలి కాని, ఇలా యజమానులతో పొత్తు కలపరాదు''

"నువ్వు మా 'కివాసం' సభ్యుడివి కాదు. ఈయన సంగతులు మీకు తెలవదండీ పాల్‌గారూ! ఆయన మాటల భ్రమలో పడి మీనాన్నగారు ఏమనలేక ఊర్కొనేవారు. చివరి రోజుల్లో ఇల్లు ఖాళీ చెయ్యమని కూడా తాఖీదిచ్చారు. ఉహూ ఈయన కదిల్తేనా? మొత్తం 'జోధలోకివాసు'లు కలవకుండా చిచ్చుపెట్టింది ఈ మహానుభావుడే. మీరిక ఉపేక్షించి లాభంలేదు. మెత్తగా మాట్లాడితే ఈయన కదల్డు. సామాన్లు బయట పారేయించండి'' అన్నారు సలహా ఇస్తూ బులేరావు.

నాకు కోపం నసాళానికంటింది, "రాస్కెల్! గెటవుటాఫ్ మై హవుస్ ఫస్ట్..." అనరిచాను.

"చూశారా! తమని తమ ఇంట్లో నుండే గెంటేస్తున్నాడు'' అని వ్యాఖ్యానించాడు బులేరావు.

"మిస్టర్ పోనీ! నువ్వు రెండ్రోజుల్లో ఇల్లు ఖాళీచేస్తే మంచింది. నా సంగతి నీకు తెలీదు. సామాన్లు బయటపారేయించటం, నీబోటి బడిపంతులుగార్ని వెళ్ళగొట్టటం నాకో పెద్ద పనిగాదు. దిసీజ్ ద లాస్ట్ వార్నింగ్ ఫర్యూ'' అని నా మాట విన్పించుకోకుండా వెళ్ళిపోయారు పాల్ జోషువా బులేరావుతో.

నేను జోషువా కొడుకులనుండి అంతకంటే మిన్నగా ఏమీ ఆశించలేదు కనుక, పాల్ అల్టిమేటంకు నేను భయపడలేదు కానీ, మా ఆవిడ కోపానికి అవధుల్లేకుండా పోయింది. మర్నాడు పొద్దున సామాను తీసుకువెళ్ళటానికి లారీ మాట్లాడుకునేందుకు నేను ఆరోజు సాయంత్రం బయటకు వెళ్ళిన సమయంలో, ఎవరో తలుపు దబదబా బాదుతూంటే మా ఆవిడ తలుపు తీసిందట. మిరియంజోషువా కాళి, కన్య, బేగంలను వెంటబెట్టుకు వచ్చింది. మా ఆవిడ ఆహ్వానించకుండానే వెళ్ళి కుర్చీలో కూర్చుని, "ఇదుగో... నీ పేరేంటో... మీరు ఇల్లు ఖాళీచేసేయండి వెంటనే'' అందట.

మా ఆవిడ బ్లడ్ ప్రెజర్ పెరిగిపోయింది. "నువ్వెవరు చెప్పేందుకు?" అంది భాను.

"అదేందమ్మా! జోషువాగారి పెద్దకోడలు ఆమె'' అంది కాళి.

"అయితే..."

"ఆవిడ ప్రస్తుతం ఇంటి యజమానురాలు''

"ఈ ఇంటికి యజమానులెవరో తేల్చుకు రండి ముందు. అప్పుడు మేం ఖాళీ చేసే సంగతి చెప్తాం"

"అంటే నీ ఉద్దేశమేంటి?" అని నిలదీసింది మిరియం జోషువా.

"నా ఉద్దేశం స్పష్టమే. పొద్దున మీమరది ఆ బులేరావుతో వచ్చి ఇల్లు ఖాళీచేయమని చెప్పారు. ఇప్పుడు నువ్వీ మూకని వేసుకొచ్చావు. మీ ఇద్దరిలో అసలు యజమానులెవరో తేల్చుకోండి ముందు''

"మనల్ని మూకంటోంది, చూడు కాళక్కా'' అంది రాణి.

"కైసీ ఝగడాయీ ఔరత్ హై తుం?" అంది బేగం.

"ఇదుగో అమ్మాయి! నువ్విట్టా మాట్లాడటం ఏం బాగాలేదు'' అంది కాళి.

"నోర్మూయ్యండి. నా ఇంట్లోకి నా అనుమతిలేకుండా వచ్చి, ఇష్టమొచ్చినట్టు మాట్లాడటానికి మీకెంత ధైర్యం! మేం ఇల్లు ఖాళీ చేసే విషయం మీకనవసరం. మీరేం ఇంటి యజమానులు కారు నేనింకేమీ అనకుండా మీరందరూ తోకముడిస్తే మంచిది'' అంది భాను.

"నేనీ ఇంటి యజమానురాల్ని. ఈ ఇల్లు నాది. నా ఇంట్లోకి రావటానికి నేనెవరి పర్మిషనూ తీసుకోవాల్సిన అవసరంలేదు. మీరిల్లు ఖాళీచేయాల్సిందే'' అంది మిరియం జోషువా.

"అవసరమొస్తే చేస్తాం గానీ మిరియాలూ! ఇందాకే చెప్పాను, ఇంటి యజమానులెవరో తేల్చుకురమ్మని. మరో విషయం. ఈ ఇంటికి అద్దె కడుతున్నాను. అద్దె కట్టి ఇంట్లో వున్నంతకాలం ఇది నా ఇల్లు కానీ, నీ ఇల్లు కాదు. ఇంకెప్పుడైనా నా అనుమతిలేకుండా ఇంట్లోకి అడుగుపెట్టావంటే కాళ్ళిరగ్గొడతాను'' అంది భాను, తలుపు మూలనున్న చీపురుకట్ట చేతిలోకి తీసుకుంటూ.

"అరె చలో భాయీ! యే ఔరత్ ఝాడూ సే భీ మార్‌దేగీ..." అంది బేగం.

"నీచేత ఇల్లెలా ఖాళీచేయించాలో నాకు తెల్సు. చూస్తూవుండు'' అని కోపంగా వెళ్ళిపోయిందట మిరియంజోషువా, తన సహచరులతో

నేనొచ్చినతర్వాత ఇదంతా వివరించి, "రానీ దాన్ని మళ్ళీ. చెప్పు తీసుకుకొడ్తాను'' అంది భాను కోపంగా.

"మనమెలాగో రేపెళ్ళి పోయేవాళ్ళం. వాళ్ళతో మనకేంటి?" అన్నాను నేను.

"అదే మాట పొద్దున ఆ భ్రాష్టుడు వచ్చి చెప్పాడు. అంత హడావుడేం వచ్చింది మళ్ళీ సాయంత్రం ఈ దయ్యం పడిరావటానికి?" అంది భాను.

"ఆవిడ ఆలోచన కూడా నిజమే. ఎందుకో వాళ్ళు నన్ను ఖాళీచేయించటానికి తొందరపడ్తున్నారు. ఇందులో పెద్దగా 'జోధలో కివాసు'ల జోక్యం వుందనుకోను. వాళ్ళు రమ్మంటేనే వెంట వచ్చివుండాలి.

రాత్రి ఎనిమిదిగంటలకు ఎవరో తలుపుతడ్తే వెళ్ళి తలుపు తీశాను. సామాన్లు సర్దుకోవాల్సిన అవసరం వుండటంవల్ల నేనారోజు శలవులో వున్నాను. వచ్చింది ఫ్రెడ్ జోషువా.

"మే ఐ కమిన్' అని మర్యాదగా అడిగాడాయన.

"రండి... రండి..." అని నేనూ ఆయన్ని మర్యాదగానే ఆహ్వానించాను.

"క్షమించాలి. పొద్దున మా తమ్ముడూ, ఇందాక నా భార్యా వచ్చి మిమ్మల్ని ఇల్లు ఖాళీచెయ్యమన్నారట. కొంత వాగ్వాదం నడిచిందనీ నాకు తెల్సింది. వాళ్ళు మిమ్మల్నేమన్నా అమర్యాదగా మాట్లాడితే క్షమించాలి మీరు'' **అన్నాడాయన.**

"అమర్యాదేముందిలెండి దీంట్లో. మీరు యజమానులు, మేం అద్దెకుండే వాళ్ళం. మీరు అనటం, మేం పడటం సాధారణవిష





యమేగా'' అన్నాను నేనూ కొంచెం నిష్ఠూరంగానే.

"మీరు మనసు కష్టపెట్టుకున్నట్టున్నారు. మా నాన్నపోయి, ఇక్కడి వ్యవహారాలెలా వున్నాయో చూసుకోవటంలో మాకూ కొంత ఇబ్బందిగానే వుంది. ఇల్లు అమ్మేద్దామనుకుంటున్నాము. ఇల్లు ఇంకొకరి ఆక్యుపేషన్‌లో వుంటే కొనేవాళ్లెవరూ ముందుకురారు. అది మీకు తెల్సిన విషయమే. అందుకని అద్దెకున్న వాళ్లని ఒక్కొక్కర్నీ ఖాళీచేయమని చెప్తున్నాను. మీకు ఇబ్బందే అవుతుంది, వున్న పళాన లెమ్మంటే. కానీ ఏం చేస్తాం, మీరు కూడా మా పరిస్థితిని అర్థం చేసుకోవాలి'' అన్నారాయన.

"మీ ఇబ్బందులేమిటో నాకు తెలీకపోలేదు. మీకే ఆ ఆలోచన కల్గిందో, లేక కివాసుల మాటలు విని ఖాళీ చేయించదల్చుకున్నారో కానీ, ఇంత హడావుడి ఎందుకు పడ్తున్నారో నాకర్థం కావటంలేదు. ఇల్లు అమ్మటమనేది ఓ సాకు అని మాత్రం నాకు తెల్సు. అలా అని మీరేం భయపడకండి. జోషువాగారికి నాపై అభిమానం. మిమ్మల్ని ఇబ్బందిపెడ్తే ఆయన ఆత్మ క్షోభిస్తుంది. నేను రేపొద్దున ఇల్లు ఖాళీ చేస్తున్నాను. ఆ మాట చెప్పే అవకాశం మీ తమ్ముడుకానీ, మీ భార్యకానీ కల్గించలేదు. మీరెవర్నీ వెంటబెట్టుకురాలేదు. అక్కడికి సంతోషం" అన్నాను.

"థాంక్యూ... థాంక్యూ వెరీమచ్ ఇన్‌డీడ్..." అని మరింకేం మాట్లాడకుండా వెళ్లిపోయాడాయన.

మర్నాడు పొద్దున ఏడు గంటలకల్లా లారీ వచ్చింది. సామాన్లన్నీ లోడు చేయించాను. జోధలోకివాసులంతా తమ భాగాలనుండి ఆశ్చర్యంగా, నమ్మకం కుదరనట్టు చూస్తున్నారు. పిల్లలంతా మా ఇంటికొచ్చారు.

"అదేం అంకుల్! ఇల్లు ఖాళీ చేస్తున్నారు?" అనడిగాడు అక్షనాధ్.

"యజమానులు ఇంటినమ్మేస్తున్నారయ్యా. అందుకే ఖాళీ చేస్తున్నాను'' అని చెప్పానతనికి.

"అదబద్ధం. ఏం మైకేల్ ఇల్లమ్మేస్తున్నారా?" అనడిగింది రోషన్.

"ఇల్లమ్మటం లేదుకానీ, పోనీబాబిక్కడ వుండటం మా వాళ్లకీ, కివాసులకీ కూడా ఇష్టంలేదు''

"మీ వాళ్లకేమొచ్చింది'' అడిగింది రోజీ.

"ఏమో... తాత వీలునామా చూసుకున్నప్పటినుండీ చెవులు కొరుక్కుంటున్నారు మా వాళ్లు. అందుకే ఖాళీ చేయించాలనే నిర్ణయానికొచ్చారు. బహుశా తాత దాంట్లో అలా రాశాడేమో'' అన్నాడు మైకేల్.

"ఆయనేం అలా రాయడు. మీ వాళ్లకే ఏదో పుట్టింది'' అంది రోషన్.

"మీకివాసులకీ పుట్టింది అంకుల్‌ని ఇల్లు ఖాళీ చేయించాలని'' అన్నాడు మైకేల్.

ఇంతలో ఓల్గా, కాళి, నాయకి వచ్చారు. మేం వెళ్లిపోతున్న చివరిక్షణంలో, భర్తల సంఘ బహిష్కార ఆంక్షను ధిక్కరించి వచ్చారువాళ్లు. స్వప్రయోజనాలకై మనిషి పడేపాట్లు ఎలావున్నా, మనుషుల్లో మానవత్వమింకా మృగ్యం కాలేదన్న సత్యం నాకప్పుడు గోచరించింది.

"మనసు కష్టపెట్టుకు వెళ్లకే భానూ! ఏదో మేమూ అన్నాం... రెండు నువ్వూ అన్నావు. అవన్నీ మనసులో పెట్టుకోకే' అంది ఓల్గా భాను చేతులు పట్టుకుంటూ.

"గురువారం సాయీ భజనకైనా వస్తూండాలి భానూ'' అంది నాయకి.

"నిన్నటిదాకా వాళ్ల మాటలు, వీళ్ల మాటలూ విని, మీరెళ్లిపోతే బావుండుననే వున్నదమ్మాయి! ఇప్పుడు మీరెళ్లిపోతుంటే నాకు దిగులుగా వుంది'' అంది కాళి.

"అయ్యో! మీరందరూ అంత మనసు కష్టపెట్టుకోకండి. నేనప్పుడప్పుడూ వస్తూంటానుగా మిమ్మల్ని చూట్టానికి'' అంది భాను.

వాళ్లరాకతో ఆమె మనసులో వాళ్లపట్ల వున్న కాఠిన్యం కరిగిపోయింది.

విరించిని, రాజీని వదలల్లేక వదిలారు జోధలో పిల్లలు. పైనుంచే మేం వెళ్లిపోవటం చూస్తున్న ఫ్రెడ్ జోషువాకు వస్తామని వీడ్కోలు పల్కి మేం లోగిలి వదలి వెళ్లిపోయాం.

అలా జోషువాగారుపోయిన వారం రోజుల్లో నేను జోధలోనుండి బయటకొచ్చేశాను కానీ జోధలోను, జోధలో మనుషులను, జోషువాగార్ని ఎప్పటికీ మర్చిపోలేను.

★ ★ ★

1989 చివర్లో కాబోలు నేను జోధలో విడిచి వచ్చేశాను. ఆ తరువాత సుమారు ఐదేళ్లు గడిచాయి. ఓసారి మా బంధువులు వస్తున్నారంటే వాళ్లను రిసీవు చేసుకోటానికి పొద్దున్నే సికిందరాబాదు రైల్వే స్టేషనుకెళ్లాను. బండి రావటానికింకా టైముంది. సిగారు తెచ్చుకోకపోవటంవల్ల, సిగరెట్లయినా కొనుక్కుందామని స్టేషను బయట బడ్డీ కొట్టుకు వెళ్లాను. ఆ కొట్టు ఓనరు రమ్మూనే.

"ఎప్పుడు పెట్టావోయ్ ఈ బడ్డీకొట్టు'' అనడిగాను అతన్ని.

"జోషువాగారు పోయినాకే సార్! ఆయన రెండు దినాలకు పోతాడనగా నన్ను పిల్చి, 'ఒరే రమ్మూ! ఇహ నేనెక్కువ కాలం బతకనురా, నువ్వెప్పటినుండో అడుగుతున్నావు పాన్, బీడా కొట్టుపెట్టుకుంటాను, సాయం చెయ్యమని. ఈ ఐదువేలూ వుంచుకో. అప్పుగా ఇవ్వటంలేదు. నేను పోయిన మర్నాటి నుండి నువ్వు పనిలోకి రావాల్సిన అవసరంలేదు. ఆ కొట్టుపెట్టుకు బతుకు' అని డబ్బిచ్చాడయ్యా. ఏందో మాట్లాడుతున్నాడులే, అప్పుడే పోతాడా అనుకుంటి. గొప్పోడు పోయేడు. ఆ అయ్య పేరు చెప్పుకుని నేనిట్టా బతుకుతుండా సారూ! బిజినెస్సూ బాగుంది, ఏ కష్టంలేదు. సుకంగుండా'' అన్నాడతను.

అది నిజమే. సిగరెట్లూ, పాన్ సామగ్రే కాకుండా, చిన్న సైజు జనరల్ స్టోర్స్‌లా గుంది అతని షాపు. న్యూసుపేపర్లు, పత్రికలు కూడా పెట్టాడతను. జోషువాగారు గుర్తుకొచ్చి నా మనసు ఆర్ద్రమైంది. చాలామందికి డబ్బు సంపాయించటమే తెల్సుకానీ, సద్వినియోగం చెయ్యటంతెలీదు. ఆయనకు రాడికల్ భావాలేం లేవుగానీ, డబ్బు ఉపయోగించకపోతే తుప్పుపట్టిపోతుందన్న సంగతి మాత్రం తెల్సు.

'జోధలో విషయాలు కూడా మీకు చెప్పాలి. బులేరావు, కాంగోరెడ్డి, సిపిఐశర్మ, జైన్లు ఒకట్టై అద్దెలు వసూలు చేసి, యజమానులకు పంపే బాధ్యత స్వీకరించారట. అందువల్ల రాజకీయ ప్రయోజనాలు వెనుకబడి సొంత లాభం కోసం పాతమిత్రులు లెబా, రాచిప్పచెట్టీ, హరబాబు, కూగాశాస్త్రీ, అండమ్మలను ఒకరి తర్వాత మరొకర్ని, రకరకాల వంకలతో బయటకు పంపేసి, జోషువాగారి భాగం, నేనున్న భాగంతో కలిపి ఏడు భాగాలకూ పగిడీ స్వీకరించి అద్దెలకిచ్చారట. దాంట్లో చాలా తక్కువ భాగం యజమానులకు పంపి, మిగిలినదాన్ని చతుష్టయం ఎంతో సఖ్యంగా పంచుకున్నారట. అండమ్మ ఇప్పుడు కూతురుతో వుంటున్నది. అల్లుడి తండ్రినుండి విడివడి వేరే కాపురం పెట్టటంతో అతనికది సాధ్యమైందట. పరేషాన్‌రావును కూడా లోగిలినుండి లేపే ప్రయత్నం చేశారుకానీ, జోషువాగారి పెద్ద కొడుకు ఫ్రెడ్‌తో తనే సీదాగా మాట్లాడుకుని అతనికి డైరెక్ట్‌గా అద్దె పంపిస్తుండడంతో వాళ్లు అతన్నేమీ చెయ్యలేకపోయారు. మైకేల్ కూడా అక్కడ వుండటంలేదట. 1992లో కాబోలు, రాచిప్పచెట్టి కల్సి నాకీ విషయాలన్నీ చెప్పాడు.

ఆంధ్రప్రదేశ్ రాజకీయ రంగలోనూ మార్పులొచ్చాయి. కాంగ్రెసుపార్టీ మళ్లీ గద్దె ఎక్కింది. అయినా బులేరావు, కాంగోరెడ్డిల స్నేహానికేమీ భంగంవాటిల్లలేదు. ఔపచారికంగా కీచులాడుకోవాలి కనుక, ఎప్పుడన్నా





పోట్లాడుకుంటున్నారేమో కానీ, సఖ్యంగానే వుంటున్నారని నాకందిన వార్త. ఆర్థిక సంబంధాలే మానవుల ప్రవర్తనను మౌలికంగా నిర్ణయిస్తాయన్న సత్యం నాకు మరోసారి స్పష్టమైంది.

ప్రపంచ చరిత్రలోనూ మార్పులొచ్చాయి. పెరస్త్రోయికా, గ్లాస్తోనాట్ నినాదాలు వినిపించాయి. బెర్లిన్ గోడ పగిలిపోయింది. సోవియట్ రష్యా విఘటితమైపోయింది. ఇంకెన్నో మార్పులొచ్చాయి. వీటికెవరూ సరైన వ్యాఖ్యానాలివ్వటంలేదు. ఎల్.టి.టి.ఇ. రాజీవ్‌గాంధీని అమానుషంగా హత్య చేసింది. కేంద్రంలోనూ కాంగ్రెసు పాలన ప్రారంభమైంది. బాబ్రీ మసీదు కూలిపోయింది. యుపి గవర్నమెంటు బర్తరఫ్ అయింది. బి.ఎస్.పి పార్టీ అవతరించింది. ప్రపంచ చరిత్రలో కోల్డ్‌వార్ యుగంపోయి, అమెరికాకు ఏకైక అగ్రాసనాధిపత్యం లభించింది. భారతదేశం కూడా ఎకనామిక్ రిఫామ్స్ చేపట్టింది.

ఆమధ్య ఖరం దగ్గరనుండి మా కాలేజీ అడ్రసుకు ఉత్తరం వచ్చింది. దాంతో పాటు నాకివ్వాల్సిన నాల్గొందల రూపాయలకు డ్రాఫ్టు పంపారు. అతనిలా రాశాడు. జోధలోలో వున్నప్పుడు నా జీవితం దుర్భరంగా వుండేది. నా చుట్టూ అప్పులు పెరిగిపోయాయి. వడ్డీ కిందే నెలకు రెండు, మూడు వేలు కట్టాల్సి వచ్చేది. ఓసారి జోషువాగారు పిల్చి నన్ను చడామడా తిట్టాడు. మొత్తం ఎంత బాకీ పడ్డానో లిస్టు రాయమన్నాడు. రాశాను అప్పు మొత్తం రెండున్నర లక్షలకు తేలింది. 'జీతంలో, ప్రావిడెంటు ఫండులో నాకున్న అప్పులుకాక, ఇందులో ఎంతమందికి పత్రాలు రాసి అప్పులు తెచ్చుకున్నావు' అని అడిగాడాయన. కొద్ది మొత్తాలకు మాత్రమే పత్రాలు రాశాను. ఎన్ని సంవత్సరాల నుండి ఎవరెవరికి ఎంత వడ్డీకట్టానో చెప్పాను. నిజానికి వాళ్లిచ్చిన బాకీలకంటే, నేను కట్టిన వడ్డీలే ఎక్కువ. ఒకోసారి వడ్డీలు కట్టటానికి మరో అప్పు చేయాల్సి వచ్చేది. జోషువాగారు సలహా ఇచ్చారు. ఆయన సలహా తుచ అమలు జరిపాను. చాలా గుట్టుగా ఆఫీసర్లను కల్సుకుని, నా పరిస్థితి చెప్పుకుని శ్రీకాకుళం బదిలీ చేయించుకున్నాను. బాకీదార్లెవరకీ నా బదిలీ సంగతి తెలీదు. అప్పులు ఎగ్గొట్టి పారిపోయాను. నన్ను పంపెయ్యటానికి జోషువాగారు పెద్ద నాటకమాడాడు. ఆయన సాయం చెయ్యకపోతే నేనేమయ్యేవాడినో నాకే తెలియదు. ఇప్పుడు చాలా భాగం అప్పులు తీర్చేశాను. వడ్డీ రాకపోయినా అసలొచ్చినందుకు చాలా మంది సంతోషించారు. వడ్డీలు కట్టకపోవటంవల్ల కొత్త అప్పులు చెయ్యాల్సిన అవసరం కలగలేదు. జోషువాగారు మరణించినట్లు తెలిసింది. పైకి ఎంతో దుర్మార్గుడిలా కన్పించే ఆ మనిషిలోని మానవతా దృష్టిని గురించేం రాయను! ఆయనే నన్ను బతికించాడు. జోధలో నుండి వెళ్లబోయే ముందు, జోషువాగారూ! బకాయి బడ్డ మీ అద్దె ఓ ఆర్నెల్లలో పంపిస్తాను అంటే 'ఒరే ఫూల్! నాకేం బకాయి పడలేదుగాని, మిగతావాళ్ల అప్పులు తీర్చు. నాకు బాకీ పడ్డాను అనుకోవద్దు' అని నన్ను తరిమేశాడు. ఆయనకు మాత్రమే నేనేవిధంగానూ ఋణం తీర్చలేను'' అని.

జోషువాగారి జ్ఞాపకార్థం నేనిప్పుడు సిగరెట్లు మానేసి సిగార్లు తాగుతున్నాను. మొన్నామధ్య ఓ ఆదివారం, నేను తీరిగ్గా సిగారు తాగుతూ, పేపరు చూస్తున్న తరుణంలో మైకేల్, రోషన్, అక్షనాథ్, రోజీ లొచ్చారు మా ఇంటికి.

వాళ్ళనాహ్వానించాను నేను సాదరంగా. ఆరెండు జంటల్నీ చూసి మా ఆవిడ ముఖం చాటంతయింది.

"సారీ అంకుల్! మా పెళ్ళికి మిమ్మల్ని ఆహ్వానించలేకపోయాము. రెండేళ్ళ క్రితమే మా రిజిష్టరు మారేజీలయ్యాయి'' అన్నాడు అక్షనాథ్.

"అంటే ఒకే రోజా!?"

"అవునంకుల్! మేం చిన్నప్పటినుండి స్నేహితులం. అక్షనాథ్ అన్నాడు. 'మనం పెళ్ళి చేసుకుంటే ఒకే రోజు చేసుకోవాలిరా' అని. అందుకే నేనూ మేరేజ్ పోస్ట్‌పోన్ చేశాను'' అన్నాడు మైకేల్.

"ఆ చేస్తారు, ఎందుకు చెయ్యరూ. రోషన్‌కి జైనంకుల్ పట్టుబట్టి నిఖా చేసినట్లయితే, మానాన్న నాకు ఇంకోడి చేత మూడుముళ్ళు వేయించినట్లయితే, అయేది మీ పనీ, మీదోస్తు పనీ'' అంది రోజీ.

"అది జరిగే పని కాదులే. ఇంకెవరికయినా అయితే కట్నమివ్వవద్దూ. చూస్తూచూస్తూ మంచి అవకాశాన్ని పోగొట్టుకుంటాడా మీనాయన! డబ్బుకీ, ఆయన ప్రాణానికీ లంకె' అన్నాడు అక్షనాథ్.

"అవును పాపం, మీనాన్న డబ్బు పారబోస్తున్నాడు! మా నాన్నే పిసినారివారు'' అంది రోజీ.

"రెండేళ్ళయి పెళ్ళయి ఇప్పుడటయ్యా రావటం?" అనడిగింది భానూ మైకేల్, అక్షనాథుల్ని.

"నాకు సరైన ఉద్యోగం దొరకలేదు. ప్రైవేటు కంపెనీలో పనిచేసేవాడిని. ఇప్పుడింకో కంపెనీలో చేరాను. పెద్ద ఫర్మే అది. రోజీ బి.ఇడి పూర్తిచేసి స్కూల్లో టీచరుగా పనిచేస్తోంది. ఇంకా ఆమెకి పూర్తి జీతం రావటంలేదు. మొత్తానికేదోవిధంగా సెటిలయినట్లే ఆంటీ! అందుకే చివరికి రాగలిగాం" అన్నాడు అక్షనాథ్.

"నువ్వింకా సెంట్ థెరిసాలోనే వున్నావా?" అనడిగాను మైకేల్‌ని.

"లేదంకుల్! ఇప్పుడు గాంధీ ఆస్పత్రిలో పనిచేస్తున్నాను. ఎం. ఎస్. కూడా చేస్తున్నాను.

రోషన్ ఓ ప్రైవేటు కంపెనీలో స్టెనోగా పనిచేస్తోంది. అంతా బాగానే వుంది అంకుల్! అక్షనాథ్ పూర్తిగా సెటిలవలేదనే బాధ వుండేది, ఇప్పుడదీ తీరింది. మాది చిక్కడపల్లిలో పక్కపక్క భాగాలే. మీరు మా ఇంటికి రావాలి''

"స్వంత ఇల్లు వదిలేసి అక్కడ అద్దెకుండటమెందుకయ్యా?" అనడిగింది భాను.

"లాభంలేదాంటీ! అక్కడివాళ్ళతో నెగ్గుకురావటం కష్టం. పైగా మా మామ మేం మతం మార్చుకోకుండా పెళ్ళిచేసుకున్నామని కారాలూ, మిరియాలూ నూరుతున్నాడు'' అన్నాడు మైకేల్.

"మరి మీ పెళ్ళికి అనుమతించారా మీవాళ్ళు రోజీ!"

"కట్నం అడక్కపోతే పెద్దగా అభ్యంతర పెట్టే వాళ్ళు కాదువాళ్ళు. కానీ వాళ్ళ నాన్న, అమ్మ కట్నం లేందే పెళ్ళి చేసుకోమని కొమ్మెక్కి కూర్చున్నారు. దాంతో మీ సంబంధమే మాకక్కర లేదన్నారు మా వాళ్ళు. అందువల్లే ఈ దొంగ పెళ్ళి చేసుకోవాల్సివచ్చింది'' అంది రోజీ పమిటితో కళ్ళు తుడ్చుకుంటూ.

"అలా కంట తడిపెట్టొద్దు రోజీ! మీది ఎలా దొంగపెళ్ళయింది? చక్కగా, పబ్లిక్‌గా రిజిష్టరు మారేజి చేసుకున్నారు. చక్కగా నిన్ను పువ్వుల్లో పెట్టుకుని చూసుకునే భర్త దొరికాడు. నువ్వేం విచారించొద్దు'' అంది భాను రోజీని దగ్గరకు తీసుకుని అనునయిస్తూ.

"అలా చీవాట్లు పెట్టండీ ఆంటీ! పెళ్ళికి వాళ్ళవాళ్ళు రాలేదని ఒకటే గునుపు'' అన్నాడు అక్షనాథ్.

"అలా అన్పించటం సహజమే కదాంటీ! మా అమ్మీ, రాలిద్ లేకపోతే నాకూ అలానే అన్పించింది'' అంది రోషన్.

"మరి పెళ్ళయింతర్వాత వెళ్ళి, వాళ్ళను కల్సి, ఆశీర్వాదం తీసుకోలా?" అనడిగింది భాను.

అక్షనాథ్ జవాబిచ్చాడు. "కలిశాం, ఆంటీ!








కలవకేం. మైకేల్, రోషన్లు కూడా మాతో వచ్చారు. మా వాళ్ళు 'వర్ణాంతర వివాహం చేసుకుని, వర్ణ సంకరం చేశాన'ని నన్ను తిట్టి పోశారు. 'లేచిపోయి పెళ్ళి చేసుకుని ఇంటి పరువు నాశనం చేసింద'ని రోజీని తిట్టారు ఆమె తల్లిదండ్రులు. 'ఫిర్ ముహ్ దిఖాయేతో గోలీసే ఉడాదూంగా' అని ఆశీర్వదించాడు జైనంకుల్ మైకేల్, రోషన్లను'' అని.

"మరి మీ అమ్మానాన్నలకు తెలియజెయ్యలేదటయ్యా మైకేల్?" అనడిగాను నేను.

"వాళ్ళకు పెళ్ళికి ముందే ఉత్తరం రాశాను. మా నాన్నేం జవాబు రాయలేదుకానీ, మా అమ్మ 'మతం చెడగొట్టాన'ని తిడ్తూ వుత్తరం రాసింది''

"మరి రెండేళ్ళయినా మీ వాళ్ళలాగేవున్నారా?" అనడిగాను.

రోజీ జవాబిచ్చింది, "లేదంకుల్! ఫ్రెడ్ అంకుల్ మైకేల్ని, రోషన్ని రమ్మని ఆహ్వానిస్తే క్రితం సారి వెళ్ళి వచ్చారు బొంబాయి. వాళ్ళ నాన్న ఏమీ జరగనట్టుగానే వున్నాడు కానీ, వాళ్ళ అమ్మే అంటీ ముట్టనట్టుగా వుందట. రోషన్ వాళ్ళమ్మ వస్తూపోతూనే వుంది. ఎటొచ్చి జైనంకులే పరువు ప్రతిష్ఠా పోయాయని రావటంలేదు. మా అమ్మా, నాన్నా కూడా వచ్చారు మా ఇంటికి. మమ్మల్ని 'జోధ'లోకి రమ్మనీ ఆహ్వానించారు. మేమే వెళ్లలేదు.

"ఆయనే కలుస్తాడు. మీమీద ప్రేమలేకా, పైపై బింకం కానీ'' అని మైకేల్‌తో "మీ అత్త ఎలావుందయ్యా ఉత్తరాలు వస్తున్నయ్యా'' అనడిగాను.

"ఆ పని మీదేవచ్చాను అంకుల్! వాళ్ళు కులాసానే. మీ అడ్రసు అత్తకు తెలీదంట. మీకు ఉత్తరం రాసి, దాన్ని నన్ను డెలివరి చేయమని ఆదేశించింది. మొన్నే వచ్చింది ఆ వుత్తరం బెంగుళూరునుండి'' అన్నాడు. మైకేల్ ఓ పెద్ద కవర్ తీసి ఇస్తూ.

"వాళ్ళు అమెరికానుండి ఎప్పుడొచ్చారు?"

"నెలరోజులు పైనే అయింది. ఇప్పుడు క్రిస్టోఫర్ ఏదో ప్రైవేటు కంపెనీలో మానేజింగ్ డైరెక్టరుగా వున్నాడు. అత్తకిద్దరు పిల్లలు కూడా. కొడుకు పేరు మీపేరే- "పాణిని''

"నాపేరు కాదయ్యా అది! క్రీస్తు పూర్వం బతికిన మహావ్యాకరణ కర్త పేరది''

నేను కవరు చించి మిద్దెదొరసాని రాసిన ఉత్తరం చదివాను. వాళ్ళ విషయాలన్నీ రాస్తూ ఆమె ఇలా రాసింది "మా నాన్న పోయి వారం తిరక్కుండానే మా అన్నలు, వదినలు 'జోధలోకివాసుల' సహకారంతో మిమ్మల్ని లోగిలినుండి తరిమేశారని నాకు చాలాచాలా ఆలస్యంగా తెల్సింది. మిమ్మల్ని 'జోధలో'నుండి పంపేసినందుకు ఆయన ఆత్మ ఎంతగా క్షోభపడుతుందో నాకు తెల్సు. ఆయన వీలునామా కాపీ పంపుతున్నాను. చదవండి. మీకంతా అర్థమవుతుంది. బెంగుళూరుకు మేం వచ్చాక, మిమ్మల్ని చూట్టానికి మా పెద్దన్నకూడా వచ్చారు. అప్పుడు వీలునామాలో ఉన్న విషయాలను చర్చించటం జరిగింది. నేను చెప్పిన తర్వాత వాళ్ళు చేసిన పొరపాటు గ్రహించారు. తొందరపాటుకు పశ్చాత్తాపపడ్డారు. మీ ఇంటిమీద, మీరెళ్ళిన తర్వాత మొదటి రెండేళ్ళు నాలుగొందల చొప్పునా, ఆ తరువాత ఇప్పటివరకూ ఐదొందలచొప్పునా అద్దె ముట్టింది. ఆ మొత్తం రు. 20,600/- లకూ మీ పేర డ్రాఫ్టు ఇందులో జతపరుస్తున్నాను. ఇది మీరు స్వీకరించవల్సింది. ఇది మీరు తిప్పి పంపిస్తే నాన్న ఆత్మ క్షోభిస్తుంది. నేను బాధపడ్తాను. ఆయన కోర్కెను గౌరవించటం మీ బాధ్యత. ఇక ప్రతినెలా అద్దె డబ్బు మీకు వచ్చేలా ఏర్పాటు చేస్తాను. అన్ని విషయాలు మీ సమ్ముఖంలో హైదరాబాదు వచ్చినప్పుడు మాట్లాడతాను''

వీలునామా తెరిచాను. అది ఇంగ్లీషులో వుంది. దాన్ని జోషువాగారు రిజిష్టరు కూడా చేయించారు. వీలునామా చాలా పటిష్టంగా రాశాడాయన.

వీలునామా ప్రకారం, ఆస్తి అమ్ముకునే హక్కు కొడుకులకు, కూతురికి లేదు. ఆదాయాన్ని మాత్రమే అనుభవించే హక్కుంది వారికి. కుడివైపు తిరగబడిన 'ఎల్' షేపులో వున్న 'జోధలో' భాగం పెద్దకొడుక్కు, ఎడమవైపు 'ఎల్' షేపులో వున్న భాగం చిన్నకొడుక్కు, మధ్యభాగం (నేనూ, లెబా వున్నది, పైన మిద్దె, వెనక సాయీమందిరంతోసహా) కూతురికి చెందేటట్టు రాశాడాయన. నా గురించి వీలునామాలో ఇలా వుంది.

"మా 'జోధలో' మధ్యభాగంలో నేను నా కుమార్తె విన్నీకి చెందేట్టు రాసిన భాగంలో ఎడంవైపున 'పాణిని' ఎలియాస్ 'పోనీబాబు' అద్దెకు వుంటున్నారు (నేను వీలునామా రాసే ఈ తేదీకి). అతనిపట్ల నాకు ఎంతో ప్రేమ, గౌరవం, వాత్సల్యం, అతను స్వయానా నాకొడుకు కాకపోయినా, దేవుడిచ్చిన బిడ్డగా నా మూడో కొడుకుగా భావిస్తున్నాను. ఆ సంబంధాన్ని పురస్కరించుకుని నా తదనంతరం అతడు ప్రస్తుతం వుండే భాగానికి, అతడు దాంట్లో వుండినంతకాలం అద్దె చెల్లించాల్సిన అవసరంలేదు. నా కుమార్తెవిన్నీ కూడా అతడిని తన సోదరుడిగా భావిస్తుంది కనుక, ఆమె అతడినుండి అద్దె ఎలాంటి రూపంలోను తీసుకోరాదు, అతణ్ణి ఆ భాగంనుండి ఖాళీ చేయించరాదు. ఇది అతడు బతికివున్నంతవరకు, అంటే నా మనుమలచేతిలోకి, విన్నీ పిల్లలచేతిలోకి ఆస్తి వచ్చినా అమలు జరుగవల్సిందే. ఒకవేళ విపరీత పరిస్థితుల్లో అతడు ఆ భాగం ఖాళీ చేయవల్సి వచ్చినా, అతనంత అతనే ఖాళీచేసినా, ఆ భాగాన్ని అద్దెకిచ్చి, వచ్చిన అద్దె డబ్బును, అతను ఎక్కడవుంటే అక్కడకు పంపవల్సిందే. ఇది కూడా అతడు బతికివున్నంతవరకు జరగాల్సిందే. అతడు ఒకసారి తన భాగం ఖాళీచేసి వెళ్తే మళ్ళీ 'జోధలో'లో తన భాగానికి రావాలనుకుంటే, ఆ భాగం ఖాళీచేయించి ఇవ్వాల్సిన బాధ్యత కూడా అమ్మాయి విన్నీది. అతడు తనభాగంలో వున్నా, బయటవున్నా, ఆ భాగానికయ్యే రిపేరు ఖర్చులన్నీ మా అమ్మాయి విన్నీ తన కొచ్చే ఆదాయంలో భరించాలి కానీ, అతడి




నుండి ఆ ఖర్చులపై పైస కూడా తీసుకొనరాదు.

పోనీబాబు అభిమానస్థుడు. ఎన్నోసార్లు నేను వీలునామాలో రాసిన విషయం అతనికి చెప్పాలనుకున్నాను. అయితే అతడు అంగీకరించడని చెప్పలేదు. నా తదనంతరమైనా నేను పైన చేసిన ఏర్పాటుకు అతన్ని అంగీకరింపచేయాల్సిన బాధ్యత నా కూతురు విన్నీది. అతడు ఈ నా ప్రేమ కానుక తిరస్కరిస్తే నా ఆత్మకు శాంతి వుండదు. నేనతన్ని కొడుగ్గా, అంతకంటే మిన్నగా భావించాను. నా కోర్కెను మన్నించాల్సిన బాధ్యత అతడిది. నేను పోయిన తర్వాత, ఈ వీలునామా పోనీబాబు చూడటం తటస్థిస్తే, నా ఈ చిన్నికోర్కెను తిరస్కరించవద్దని అతడిని మరీమరీ ప్రార్థిస్తున్నాను..."

అది చదివింతర్వాత నా హృదయం ద్రవించింది. ఆయన ప్రేమకు అవధుల్లేవా అన్పించింది. 'జోధలో'లో వున్నప్పుడే నన్నెంతో ప్రేమగా చూశాడు. పోయేటప్పుడూ నన్ను మర్చిపోలేదాయన. గొప్ప మనిషి! డబ్బుకూ మనిషి ప్రాణానికీ లంకె అయిన ఈ ప్రపంచంలో ఇలాంటి మనుషులు అరుదు. కాని ఈ డబ్బు నేనెలా స్వీకరించగలను? ప్రతినెలా ఆమె పంపే అద్దె డబ్బునెలా వినియోగించాలి? అన్న ద్వైదీభావంలో పడిపోయాను.

నేనలా ఆలోచనల్లో వుండగా మైకేల్ అడిగాడు "మా అత్త ఏం రాసింది అంకుల్!" అని.

"జోషువాగారి ధ్యానంలో నుండి బయటపడి, ఆమె రాసిన ఉత్తరం, వీలునామా, డ్రాఫ్ట్ అన్ని సంగతులూ ఒక్కొక్కటే చెప్పాను.

వాళ్ళంతా అప్రతిభులై విన్నారు. భాను ఏం మాట్లాడలేకపోయింది. నాకో ఆలోచన వచ్చింది. భానూను చెక్‌బుక్ పట్టుకురమ్మన్నాను. మైకేల్ పేర రు. 10,300/-లకు ఒక చెక్కూ, అక్షనాథ్ పేర రు. 10,300/- లకు ఒక చెక్కు రాసి వాళ్ళకిస్తూ అన్నాను

"మీరు కొత్తకాపురాలు పెట్టారు, అదీ పెద్దవాళ్ళని ఎదిరించి. పెళ్ళికి మీకు ఎవరూ ఏమీ ఇచ్చివుండరు. రెండేళ్ళయి ఇంకా కొత్త కాపురాలేమిటి అనకండి. మెల్లమెల్లగానే అన్ని వస్తువులు సమకూడుతయ్యి. జోషువా గారు ఒక్క మైకేల్‌కే తాతకాదు, మీకందరికీ తాత. ఇది నేనిస్తున్న డబ్బుకాదు. మీతాత నా చేతులమీదుగా మీ పెళ్ళి సందర్భంలో మీకిస్తున్నాడు. మీరు ఈ చెక్కులను స్వీకరించండి. ఇంకో మాట చెప్పొద్దు..."

"అదేంటంకుల్! తాత మీకిచ్చింది, మాకు తిరిగి ఇస్తున్నారు?" అన్నాడు మైకేల్.

"జోషువాగారిది పెద్ద హృదయమయ్యా! నాకీ డబ్బు ఆయన ఇచ్చింది ఇలాంటి పనులు చేయమనే. నేను 'జోధలో'లో వుంటే వేరు. ఇప్పుడు నేను చెయ్యాల్సిన పని ఇదే. మీరిప్పుడు కాదనకండి. పైన ఆయన, కింద నేనూ సంతోషిస్తాం" అన్నాను.

చివరకు ఇద్దరూ మొహమాటపడ్తూ చెక్కులు పుచ్చుకున్నారు.

ఆరోజు నల్గురూ మా ఇంట్లోనే భోజనం చేశారు. చాలారోజుల తర్వాత వాళ్ళని చూసి మా పిల్లలు విరించి, రాజీ కూడా ఎంతో సంతోషపడ్డారు.

ప్రతినెలా మిద్దెదొరసాని పంపే అద్దె డబ్బు ఐదొందలూ ఎలా వినియోగించాలా అని ఆలోచిస్తున్నాను. నా స్వంతానికి వాడుకోవటం నాకిష్టంలేదు. మీరో చక్కటి సలహా చెప్పండి. గుర్తుంచుకోండి. మర్చిపోయారా; లేక బద్ధకించారా జోషువాగారు కలలో కన్పించి మిమ్మల్ని చెడామడా తిట్టేస్తారు. 'స్టుపిడ్, ఫూల్, ఇడియట్, చవటమొహంవా! ఈమాత్రం బుర్రలేదా' అని, ఆనక మీఇష్టం.



సతీ! సఖీ! సావిత్రీ!
నీ స్మృతికిది అంకితం

-కాకాని చక్రపాణి

# చతురకతలు

## క్లిక్

'పంచాయితీ' అంటే ఐదుగురు సభ్యులతో వున్న మండలి. దానికి హెడ్డు అంటే 'శిరము ఉర్దూలో 'సర్'గా మారి సర్పంచ్ అయింది. అటువంటి వంద పంచాయతీలకు ప్రాతినిధ్యం వహించిన ఎమ్మెల్యేగారు జబ్బుపడి కాలం చేశారు. కొత్త ఎమ్మెల్యే ఎన్నికకోసం నోటిఫికేషన్ జారీ అయింది. అంతకుముందు ఓడిపోయిన అభ్యర్థి శచీపతి పోటీ చేద్దామని మళ్ళీ నామినేషన్ వేశాడు. ఇంతక్రితం శచీపతిని ప్రజలు తిరస్కరించడానికి కారణం అతడు నాస్తికుడు కావడమే. మూఢ విశ్వాసాలు వేళ్లూనిన గ్రామాల్లో దేవుడూ- గీవుడూ జాన్తానై అంటే ఎవడు వోటు వేస్తాడు? పచ్చకామెర్లు వస్తే కంట్లో ఏవో పసర్లు వేసి కళ్ళు పాడుచేసుకుంటారు. చప్పి వస్తే మంత్రం వేయించుకుంటారు. నాటువైద్యం చేయించుకోకండి, ఆరోగ్యానికి హానికరం అంటే వినేవాళ్లెవరు? అవన్నీ చెప్తాడు శచీపతి.

అందుకే చిత్తుగా ఓడిపోయాడు.

ఒక మేజర్ పంచాయతీలో రామాలయం ఉంది కాని, శివాలయం లేదు. శివాలయం లేకపోవడంవల్ల ప్రజలు అకాల మరణాలకు గురి అవుతున్నారని, శివాలయ నిర్మాణానికి ఎవరు ఇరవైవేలు విరాళం ఇస్తే వారికే వోటు వేస్తామని అధిక సంఖ్యాకులు పట్టుబట్టారు. నాస్తికుడైన శచీపతి ఇరుకులో పడ్డాడు. కిందటి ఎన్నికల్లో ఆ మేజర్ పంచాయతీ ఓటర్లే తనని దెబ్బతీశారు! ఏమిటి దారి?

"ఫరవాలేదు... ఒప్పేసుకో. దేవుడిమీద నమ్మకానికి రాజకీయాలకి సంబంధంలేదు. ఆ రెండింటినీ వేరువేరు కళ్ళతో చూడాలి'' అని సలహా చెప్పారు శచీపతి శ్రేయోభిలాషులు.

శచీపతి శివాలయ నిర్మాణానికి ఇరవైవేలూ ఇవ్వడానికి ఒప్పేసుకున్నాడు. శచీపతిని నాస్తికత్వంనుండి ఆస్తికత్వంలోకి మార్చగలిగినందుకు ఆ గ్రామప్రజలు విజయగ



ర్వంతో వున్నారు.

శివాలయ నిర్మాణానికి ఓ కమిటీ ఏర్పాటైంది. దానికోశాధికారికి ఇరవై వేలూ చెక్కు రూపేణా అందించాడు శచీపతి. కెమేరాలు 'క్లిక్' మన్నాయి. ప్రజలు హర్షవర్షాన్ని కురిపించారు.

శచీపతి ఎమ్మేల్యే అయిపోయి మంత్రిగా కూడా ప్రమాణస్వీకారం చేశాడు.

పది రోజులు పోయేక- "ఫండ్స్ నాట్ ప్రొవైడెడ్. రిఫర్ టు డ్రాయర్' అంటూ చెక్కు బుద్ధిగా తిరిగి వచ్చింది. సి.ఆర్.పి.సి.420 క్రింద మంత్రివర్యుని మీద కేసు పెట్టడానికి ఎన్ని గుండెలుండాలి?

-బులుసు శ్రీ ప్రకాష్

---

## కనపడుటలేదు

"ఇలా చేస్తే దారికొస్తారంటావా?" అడిగాను అప్పారావును.

"నా ప్లాను బుల్లెట్‌లా పనిచేస్తుంది'' అన్నాడు అప్పారావు.




"అయితే ఎప్పుడు వెళ్లమంటావు?"

"ఈ రాత్రికే రైలెక్కు! ఓ ఉత్తరం రాసి మీ అమ్మా నాన్నల గదిలో నీళ్లచెంబుకింద పెట్టి మరీ వెళ్లు!"

"నిర్లక్ష్యంగా తీసి అవతల పారేస్తే?"

"చూడూ! ఏ తల్లిదండ్రులూ ఉన్న ఒక్కగానొక్క కొడుకును దూరం చేసుకోరు! అందులోనూ తల్లి మనసు వెన్నలాంటిది! నిన్ను చూడకుండా ఆమె ఉండలేదు! ఒక్కరోజంతా ఈ ఊళ్లో వెతికించి రెండోరోజు నీ ఫొటో పేపర్లో వేసి కన్నీటి రాతలతో బతిమిలాడతారు!" అన్నాడు అప్పారావు.

అతను చెప్పినదాంట్లో అబద్ధంలేదు! రోజూ పేపర్లో ఎన్ని చూడటంలేదు 'కనపడుటలేదు' వార్తలూ, ఫొటోలూ.

వీళ్లకిలా చేస్తేనే తిక్క కుదిరి దారికొస్తారు! కన్న తలిదండ్రులు కదాని ఛాయిస్ ఇస్తే ఒక్కటి ఉపయోగించుకోరేం! నేను చదవను మొర్రో అంటే వినరు! చదవాల్సిందే అంటూ ఉపదేశాలు! ఓ లక్షరూపాయలిస్తే సినిమాల్లోనైనా చేరతాను, లేదా దుబాయికెళతాను. లేదా బిజినెస్ చేస్తానంటే ఒక్కదానికీ తలాడించరు! చదువూ.. చదువూ అంటారు. మరి చదువుకున్నవాళ్లంతా ఏం ఉద్ధరిస్తున్నారనీ!

ఆ రాత్రి అప్పారావు చెప్పినట్టు ఇంటి

నుంచి వెళ్లిపోతున్నా, నన్ను వెతికించకండి, పాదాభివందనాలు అంటూ కన్నీరుబికేలా ఓ ఉత్తరం రాసిపెట్టి, ఓ వెయ్యిరూపాయలు అమ్మ పెట్టెలోంచి తీసుకుని రైలెక్కేశాను! వారం గడిచింది! నెల గడిచింది! తెచ్చుకున్న డబ్బు అయిపోయింది! తిండికి లేదు!

చచ్చీచెడీ ఓ దేవస్థానం చేరుకున్నాను! ఓ పూట తిండి దొరుకుతోందక్కడ! దానితోనే ప్రాణాలుగ్గబట్టుకుంటున్నాను. అప్పారావుగాడి మాటలు విని నష్టపోయాననిపించింది! వాడు చెబితేమాత్రం నాకు బుద్ధుండొద్దూ! రోజూ పేపరు క్రమం తప్పకుండా చూస్తున్నాను. ఇంటికి రమ్మని బతిమిలాడుతూ, నేను చెప్పినట్టు వింటామనీ, అమ్మ మంచం పట్టిందనీ... ఇలా పేపర్లో వేస్తారని చూస్తున్నాను.

దాదాపు నెలన్నర తర్వాత నా ఫొటో పేపర్లో వేశారు. దారికొచ్చారనుకుంటూ చదవసాగాను!

'కనపడుటలేదు'

'ఈ ఫొటోలో ఉన్న అబ్బాయికి మతిస్థిమితం లేదు! అస్తమానం దుబాయి, సినిమాలు, బిజినెస్ అంటూ వాగుతుంటాడు! ఆచూకి తెలిసినవారు ఇతన్ని పిచ్చాసుపత్రిలో చేర్పించి ఈ దిగువ ఇచ్చిన అడ్రసుకు తెలియపరచినచో తృప్తికరమైన పారితోషికం ముట్టచెప్పబడును!' అంటూ మా ఇంటి అడ్రసు రాసుంది!

-ఎ.జయలక్ష్మిరాజు

## సిటీబ్రతుకు

నా స్నేహితుడు విశ్వం సెక్రెటేరియేట్‌లో క్లర్క్. నాకు ఓ ప్రయివేట్ కంపెనీలో ఉద్యోగం. ఇద్దరం బ్రహ్మచారులమే కాబట్టి ఒకే రూమ్‌లో ఉంటున్నాము.

ఆరోజు ఉదయం పోస్ట్‌మేన్ వాడి చేతిలో ఉంచిన ఆ ఉత్తరం చదువుతుంటే వాడి ముఖం వెలిగిపోసాగింది.

"ఏమిట్రా! ఏముందా ఉత్తరంలో? అంత ఆనందపడిపోతున్నావ్?" అడిగాను.

"నాకు పెళ్ళిచూపులంట... నేను అమ్మాయిని చూడాలంట..."

"ఎప్పుడు?"

"ఆదివారంకల్లా అక్కడ ఉండేలా రమ్మన్నారు'' చాలా సంబరపడిపోతూ చెప్పాడు.

"కంగ్రాచ్యులేషన్స్'' అన్నాను నేను.

"శనివారం సాయంత్రం మనిద్దరం అమలాపురం బయలుదేరుతున్నాం" అన్నాడు వాడు.

"నేనా?" అన్నాను ఆశ్చర్యంగా.

"నాతోటి నువ్వూ వస్తున్నావు... చాలారోజులనుండి మా ఊరు చూడాలనుకుంటున్నావుగా..."

నేను 'ఇప్పుడు వీలుకాదన్నా' వాడు ఒప్పుకోలేదు. విశ్వం వెంట నేనూ అమలాపురం బయలుదేరక తప్పలేదు.

ఆదివారం ఉదయమే అమలాపురంలో దిగాం ఇద్దరం.

ఆ సాయంత్రం విశ్వం, అమ్మానాన్న, మరో ఇద్దరు పెద్దలతో కలిసి అమ్మాయి ఇంటికి బయలుదేరాడు. నేనూ అనుసరించక తప్పలేదు.

అమ్మాయి నాన్నగారు మమ్మల్ని సాదరంగా ఆహ్వానించారు. ఫలహారాలయ్యాయి. తర్వాత అమ్మాయిని తీసుకొచ్చి మావాడి ముందుంచారు. అమ్మాయి మా వాడికి ఎంతో నచ్చిందని వాడి చూపులే చెపుతున్నాయి.

పెళ్లిచూపుల తతంగం ముగిశాక అమ్మాయి తండ్రి, మా విశ్వం తండ్రితో






పిచ్చాపాటీ మాట్లాడసాగాడు.

"మీ సంబంధం మాకెంతో నచ్చిందండీ... మీ అబ్బాయి ఉద్యోగం చేస్తున్నాడని విని ఈ సంబంధం కుదరాలని వెయ్యిదేవుళ్లకు మొక్కుకున్నాము''

"అవునండీ! మావాడు సెక్రెటేరియేట్‌లో క్లర్క్‌గా పనిచేస్తున్నాడు''

"సెక్రెటేరియట్‌లోనా?" అమ్మాయి తండ్రి ముఖంలో రంగులు మారాయి. ఆయన తల తిప్పి పెళ్ళిళ్లపేరయ్య వంక చూశాడు. "అబ్బాయి ఉద్యోగం హైదరాబాద్‌లోనని నాకు ఎందుకు చెప్పలేదు''

పెళ్ళిళ్ళ పేరయ్య గుటకలు మింగుతూ "నాకూ ఈ విషయం ఇప్పటివరకూ తెలియదండీ. ఉద్యోగం అంటే... ఇక్కడే అనుకున్నాను'' చెప్పాడు.

అమ్మాయి తండ్రి కుర్చీలోనుండి లేచాడు. "క్షమించండి. మీ అబ్బాయి ఉద్యోగం హైదరాబాద్‌లోనని తెలియదు. తెలియకే మిమ్మల్ని పెళ్ళిచూపులకు ఆహ్వానించాం. ఈ పెళ్ళి మాకిష్టంలేదు''

"అదేమిటండీ! హైదరాబాదులో ఉద్యోగం అంటే మాటలా?" అన్నాడు విశ్వం తండ్రి.

"కాదండీ చాలా గొప్ప'' అమ్మాయి తండ్రి వ్యంగ్యంగా పలికాడు.

"హైదరాబాదులాంటి సిటీలో మీ అమ్మాయిని, మా అబ్బాయి పువ్వుల్లో పెట్టి చూసుకోగలడు. మరి మీరు..."

విశ్వం తండ్రి మాటలు మధ్యలోనే కట్ చేశారాయన. "నిజమే! మీ అబ్బాయి మా అమ్మాయిని పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. ఎందుకంటే హైదరాబాద్‌లో పూలు బాగానే దొరుకుతాయి. కాకపోతే దొరకనివి నీళ్ళే. మేమూ హైదరాబాదులో ఆరునెలలు ఉండి వచ్చామండీ. అక్కడ బిందెడు నీళ్లకోసం అలమటించాలి. రెండురోజుల కొకసారి వచ్చే నీళ్లు దాచిపెట్టుకుని, భద్రంగా వాడుకోవాలి. తృప్తిగా స్నానం కూడా చేయలేని, ఆ మహానగరంలోకి నా కూతుర్ని పంపించనుగాక పంపించను''

తిరిగి వచ్చేస్తున్నప్పుడు అనుకున్నాను. 'ఎందుకయినా మంచిది, పెళ్ళి కావాలనుకుంటే హైదరాబాద్‌నుండి మకాం ఎత్తేయడం మంచిదని...'

-జె.వి. బాబు

# ఏరిన ముత్యాలు

★ స్త్రీల సానుభూతి, సహకారం లభించని ఏ ఉద్యమమైనా సఫలీకృతం కావడం అసంభవం

-శరత్

★ అణుశక్తికన్న మానవశక్తి మిన్న

-శ్రీశ్రీ

★ వివాహం ఒక పుస్తకంలాంటిది. దానిలో మొదటి అధ్యాయం పద్యరూపంలోను, మిగిలిన అధ్యాయాలు గద్యరూపంలో ఉంటాయి

-బి.నికోలస్

★ వినయం ముందుకు పోవడానికి తోడ్పడుతుంది, అహంభావం వెనక్కి తోస్తుంది

-మావో

★ నిలకడలేనివారు సూత్రాలను చొక్కాలకంటె తేలిగ్గా మార్చుకొంటారు

-ఎడ్వర్డ్ యంగ్

★ దుర్మార్గులు దగ్గరయితే సన్మార్గులంతా ఏకంకావాలి

-ఎడ్మండ్ బర్గ్

★ తండ్రి కావడానికి పెద్ద తెలివితేటలు అవసరంలేదు. కాని తండ్రిగా ఉండటానికి ఎంతో వివేకం కావాలి

-చింక్‌చౌ.

★ మన భవిష్యత్తు మన పుట్టుకమీదగాని, గతజన్మమీదగాని ఆధారపడిలేదు. అది కేవలం మన స్వశక్తిపై ఆధారపడిఉంది

-అంబేద్కర్

★ రోజూ చూస్తున్న నీ పొరుగువాడినే ప్రేమించలేని నీవు రోజూ కనిపించని ఆ దేవుడ్ని ఎలా ప్రేమించగలవు?

-ఏసుక్రీస్తు

★ శ్రమ శరీరాన్ని పరిపుష్టం చేసినట్లే కష్టాలు బుద్ధిని పరిపుష్టం చేస్తాయి

-సెనేకా

★ మంచి ఏదో తెలిసి, ఆచరించలేకపోవడం పిరికితనానికి పరాకాష్ఠ

-కన్‌ఫ్యూషియస్

★ మార్క్సిజం చదవనివాడు రాజకీయ బధిరుడు

-జవహరలాల్ నెహ్రూ

---

సేకరణ: పి. గీతారాం,

# 'సంభవామి గృహేగృహే'పై సమీక్షలు



జూన్ చతురలో ప్రచురితమైన, నవలల పోటీలో తృతీయ బహుమతి రూ. 7,500-/ పొందిన వక్కంతం సూర్యనారాయణరావు రచన 'సంభవామి గృహే గృహే'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## 'ప్రాక్టికల్ పోరాటం'

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

**త**రతరాలుగా స్త్రీజాతికి జరుగుతూ వస్తోన్న అన్యాయాలనీ, స్త్రీ, పురుషులమధ్య అసమానతల్నీ, స్త్రీల జీవితాల్ని అల్లకల్లోలం చేస్తున్న నేటి సామాజిక స్థితినీ ఎదుర్కోవడానికి 'సంభవామి గృహేగృహే'లో సహజ చేసే ప్రాక్టికల్ పోరాటం పాఠకుల్లో నూతనోత్తేజాన్ని నింపి, ఉద్యమ స్ఫూర్తిని కలిగించే ఆలోచనని రేకెత్తించింది. ఇంటా బయటా తన అభివృద్ధికీ, తన స్వేచ్ఛకీ, తన ఆత్మగౌరవానికీ భంగం కలిగించే విషమ పరిస్థితుల్ని ఎంతో గుండె ధైర్యంతో సమర్థవంతంగా ఎదుర్కొన్న సహజ నేటి స్త్రీలోకానికి ఆదర్శనీయం.

తన రచననుండి మొట్టమొదట స్ఫూర్తిని తనే పొంది, కళా, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో స్త్రీ వ్యక్తిత్వాన్ని కించపరుస్తూ ప్రబలిన విపరీత ధోరణుల్ని అరికట్టడంలో స్వచ్ఛందంగా ప్రయత్నిస్తూ, కృషిచేస్తూ విజయం సాధిస్తోన్న ఒక స్త్రీ పుత్రికామేష్టి యజ్ఞంలో సఫలీకృతురాలయ్యే సంఘటల్ని రచయిత ఒక కొత్త కోణంలో చూపారు. కథలో, కథనంలో, పదునైన సంభాషణలతోనూ, అద్భుతమైన శైలితోనూ పాఠకుల హృదయాలను తాకి, మెదడుని మేల్కొలిపి రచయిత అటు సాహితీ రంగంలోనూ, ఇటు పాఠకుల్లోనూ ఉన్నత స్థానాన్ని అధిరోహించారు.

"ఉపన్యాసం ఇచ్చి ఉద్బోధించడంతో రచయిత లేక రచయిత్రి బాధ్యత తీరిపోదు. లోకానికి చెప్పాల్సిందేదో చెప్పేసి పెన్ క్రింద పెట్టి కళ్ళు మూసుకోవడం కేవలం థియరీ, చెప్పాల్సింది నోటితో, రాతతో చెప్పకుండా చేతల్లో చూపించేది ప్రాక్టికల్' సహజ చెప్పే ఈ మాటల్లో ఎంతో నిజముంది. రచయిత భావిస్తున్నట్లు తనలో నిద్రాణంగా వున్న శక్తిని జోలపాడుతూ ఇంకా నిద్రపుచ్చే స్త్రీలేకాదు, రచయితలూ, రచయిత్రులూ|కూడా వున్నారు. అలాంటి రచయి(త)త్రులకు సామాజిక

స్పృహతోకూడిన బాధ్యతని ఈ నవల గుర్తు చేసింది.

"మన జాతి ఎన్నో విషయాలమీద, ఎన్నో రకాలుగా తన అసమ్మతిని తెలియచేస్తూ వుంది. అలాంటి ప్రయత్నాలు చెట్టుబోదెనీ, వేళ్లనీ వదిలేసి కొమ్మలు నరకడం లాంటివి'' అని చెప్పే సహజ శాస్త్రీయమైన ఆచరణ విధానాన్ని చేపట్టలేకపోయింది. అందుకే సహజ చేసే పోరాటం చెట్టుకొమ్మల్ని నరకడానికే పరిమితమయిపోయింది. రచయిత ప్రస్తుత వ్యవస్థాగత లోపాన్ని ఎత్తిచూపి, సామాజిక రుగ్మతల్ని నిర్మూలించగల ఆర్థిక, రాజకీయ పోరాటాలకు 'సంభవామి గృహేగృహే' ని అన్వయిస్తే నవల మరింత శక్తివంతమై వుండేది.

-మాచర్ల సత్యనారాయణ
ఎం.సింగుపురం

## 'ఒక దివ్య ప్రబోధం'

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**చ**తుర నవలల పోటీలో తృతీయ బహుమతి నందుకొన్న శ్రీవక్కంతం సూర్యనారాయణరావుగారి నవల 'సంభవామిగృహేగృహే' నన్ను ఎంతో ఆకట్టుకొంది. నేటి సమాజంలో మహిళలకు జరుగుతున్న అన్యాయాలు, అకృత్యాలు అన్నీ ఇన్నీ కావు. సభ్యసమాజం తలవంచుకొనేలాంటి వరకట్నపు చావులు, మానభంగాలు, దురాచారాలు మొ. వాటితో స్త్రీ దురన్యాయానికి, దోపిడీకి గురవుతూనే ఉంది.

పత్రికలలో, సినిమాలలో, చివరికి ప్రజలకి ప్రాతినిధ్యం వహించే శాసనసభలలో మహిళలకి అగౌరవమే కలుగుతోంది. మహిళల స్థాయిని దిగజార్చుతోనే ఉన్నారు. ఏనుగు పడిపోతే ఏనుగే లేపాలి. అన్యాయానికి అగౌరవానికి గురవుతున్న మహిళలలోనే చైతన్యం రావాలి. తాము ఏ విషయంలోనూ పురుషులకి తీసిపోమని మహిళలు సాధికారికంగా ఋజువు చేసికొనేలాగ ఉద్యమించాలని రచయిత ఆకాంక్ష. ఒక్కొక్క స్త్రీ, ఒక్కొక్క సహజగా రూపొందాలని రచయిత భావించారు. సమాజంలోని యదార్థ విషయాలనే నవలలోని సంఘటనలుగా రచయిత నిర్భయంగా మలచి నిజాయితీగా వాటిపై చర్చించి, పరిష్కారం చూపారు. సహజ పాత్ర స్త్రీలోకానికే తలమానికం. ఆమెలోని ధైర్యం, ఆభిజాత్యం, తెలివితేటలు, సంస్కరణాభిలాష మహిళలకి ఆదర్శమవ్వాలి. సహజకిలాగ అర్థం చేసికొని, ప్రోత్సహించే తల్లిదండ్రులు నేటి మహిళలకి చాలా అవసరం. అప్పుడే వారి లక్ష్యసాధన సుగమమవుతుంది.

అయితే నవలలో కొన్ని ముఖ్యమైన లోపాలున్నాయి. ఉత్తమ్ పాత్ర నవలలో ఉత్తమంగా లేదు. సహజను అర్థం చేసికొన్న ఉత్తమ్, లక్ష్యసాధనలో అడుగడుగునా ఆమెకి సహకరించిన ఉత్తమ్ పెళ్లి తరువాత ఆమెకి న్యాయం చేయలేదు. ఎబార్షన్‌కి సహజను బలవంత పెట్టడం, తల్లికోసం ఆమెను సమాజ కార్యక్రమాలకి దూరమవమనడం పేలవంగా ఉంది. ఆ పాత్ర స్థాయిని ఈ సంఘటనలు దిగజారుస్తున్నాయి.

రచయిత మనసులో స్త్రీలకి జరుగుతున్న అన్యాయాలు ఎన్నో ఉండటం వలన అన్నింటినీ పాఠకుల ముందుంచారు. అంతేకాదు పాఠకులలో ఆలోచనని రగిల్చారు. అసభ్య పత్రికలతో, అశ్లీల చిత్రాలతో, విసిగి వేసారి పోతున్న ప్రజానీకానికి మేలైన ఒక త్రోవను చూపించారు. మహిళలు చైతన్యాన్ని పొంది, ఈ దురాగతాలను రూపుమాపకపోతే మన సంస్కృతి పెడదారి పడుతుందని హెచ్చరించారు. నవల మహిళల్లో తప్పక ఒక చైతన్యాన్ని, ధైర్యాన్ని కలిగిస్తుందనడంలో ఎటువంటి సందేహం లేదు.

-టి.కల్యాణి
పెదబొండపల్లి




## 'వైవిధ్య పూరిత పాత్ర చిత్రణ'

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**వ**క్కంతం సూర్యనారాయణరావుగారి నవల 'సంభవామి గృహేగృహే' ఎంతో ఉత్కంఠతో చదివించేలా చేసింది. ప్రారంభంలో విష్ణువు, లక్ష్మీదేవి మరియు భూదేవిలు భూలోకంలో ప్రవేశించడం, వారికెదురైన సన్నివేశాలు రచయిత వెరైటీగా చిత్రించారు. నవలలో సహజ పాత్ర చిత్రణ ప్రత్యేకతను సంతరించుకుంది.

కట్నం కోరాడని మదన్‌ను తిరస్కరించిన తీరు, పీతాంబరంలాంటి లంచగొండి పోలీసాఫీసర్‌కు బుద్ధి వచ్చేలా చేయడం, అశ్లీల సాహిత్యం చేసే హారతిలాంటి రచయిత్రిని మార్చడం, అశ్లీల సన్నివేశాలలో నటించకుండా హీరోయిన్ కాంతిశ్రీని, అశ్లీల పాటలు పాడకుండా గాయని శివరంజనిలను సహజ మార్చిన తీరు ప్రశంసనీయంగా ఉంది. అయితే డా. కామేశం సెక్స్ విషయాలపై సమాధానాలు ఇవ్వడం, ఆ పాత్ర హారతి పాత్రకు రవ్వంత మార్పుతో ప్రవేశపెట్టడం నచ్చలేదు. ఎందుకంటే కథ మళ్లీ రిపీట్ అయిన భావన కలిగింది.

"మగాడు డబ్బిచ్చి ఆడదాన్ని, ఆడదాని శరీరాన్ని కొనుక్కుంటాడు, అది వ్యభిచారం. ఆడపిల్ల డబ్బిచ్చి, కట్నం ఇచ్చి మగవాణ్ణి భర్తగా కొనుక్కోవడంకూడా వ్యభిచారమే''

"ఆడపిల్లకు కన్యత్వం ఎంత ముఖ్యమో కట్నం కూడా అంతే ముఖ్యం"

"కట్నం అనే దురాచారాన్ని సమర్థించేవాళ్లు ఎవరైనా సరే వాళ్ల నీడలో నేను ఉండను''

ఇత్యాది వాక్యాలు రచయిత కలంనుండి వెలువడిన ఆణిముత్యాలు.

చివరగా వస్తే సహజ ఉత్తమ్‌కుమార్ జీవితంలో ప్రవేశించటం కథ కొత్తమలుపులు తిరగడం, గర్భవతి అయినా లెక్కచేయక పుత్రకామేష్టి యాగాన్ని తన ఉద్యమం అనే ఆయుధంతో అరికట్టడం బాగుంది. ఒక మంచి నవల చదివానన్న తృప్తి మిగిలింది.

-యు.విజయశేఖరరెడ్డి
హైద్రాబాద్

## 'సాహితీకళకు సార్థకత'

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

పెళ్లిళ్ల మార్కెట్‌లో కోరినంత వరకట్నాలు పోసి
తమకు భర్తల్ని కొనుక్కోలేక
వివాహానికి నోచుకోని వృద్ధ కన్యలు
వరకట్నాలు చెల్లించేటందుకు సరిపడ ఆస్తు లేక
పెళ్లికాదేమోననే భయంతో
ఆత్మహత్యలు చేసుకుంటున్న చెల్లెళ్లు
పెళ్లయిన తర్వాత కూడా
యింకాయింకా కట్నం తెమ్మంటూ వేధించే
భర్తలచేతిలో సజీవదహనం చేయబడుతున్న భార్యలు
ఏ స్త్రీ చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం- స్త్రీ జాతి చరిత్ర సమస్తం
పురుషపీడన పరాయణత్వం...
సమాజంలో ప్రథమ దళితగా, క్యాపిటలిస్ట్ వ్యవస్థలో బానిసలకు
కూడా బానిసగా నిత్యం ఎన్నో అవమానాలతో దయనీయంగా
బతుకీడుస్తున్న స్త్రీ చైతన్యంకోసం
ఒక కల్చరల్ క్రూసేడర్ పూరించిన శంఖారావం
శ్రీ వక్కంతం సూర్యనారాయణరావుగారి
సంభవామి గృహేగృహే!!
జూన్ 1995 చతుర నవలగా

సామాజిక ప్రయోజనానికి, కళకు సార్థకత చేకూర్చింది.

మహతి సపరివార పత్రిక ప్రతుల దగ్ధం విషయంలో సహజ ఆలోచన ధోరణి యేమిటో మనకు స్పష్టంగా తెలుస్తుంది. మూలాన్ని వదిలేసి కొమ్మల్ని నరకటంవలన వుపయోగం లేదని తద్వారా ఆ పత్రిక సర్క్యులేషన్ పెంచినవారమవుతామనే సహజ వాదన, ఈనాటి కుహనా స్త్రీ మేధావులు తప్పనిసరిగా గ్రహించాలి. ఎడిటర్ రవిచంద్ర విషయంలో రచయిత్రులను మేల్కొల్పటంద్వారా, కాత్యాయని కేసు విషయంలో యస్.ఐ. పీతాంబరం తన ధర్మం తను నిర్వర్తించే విధంగా అతడి భార్యని, కూతుర్ని ఎడ్యుకేట్ చేయటం ద్వారా, సెక్స్ కాలుష్య రచయిత కామేశం విషయంలో సీత సాయం తీసుకోవటంద్వారా... ఈ కల్చరల్ క్రూసేడర్ పోరాట విధానమేమిటో తెలుస్తుంది.

ఆఖర్న పుత్రకామేష్టి విచ్ఛిన్నం చేయటంద్వారా, పుత్రకామేష్టి యజ్ఞప్రాంగణంలో పుత్రికను కనటం ద్వారా... సహజ పురుషాధిక్య ప్రపంచానికి మరొక సవాల్ విసురుతుంది.

ఇంకా ఈ నవల విశేషం యేమిటంటే రాసింది ఒక పురుషుడు. ఈ విషయం వ్యాపార రచనలు చేసే స్త్రీ రచయిత్రులంతా ముఖ్యంగా గుర్తించాలి. సమస్యని గుర్తించటం, సొల్యూషన్‌ని సక్రమమైన ఆలోచనా ధోరణితో విశ్లేషించటం వక్కంతం సూర్యనారాయణరావుగారి ప్రతిభకు నిదర్శనం. అతడి బలమైన వాదనకి స్త్రీజాతి తమ మద్దతుని, కృతజ్ఞతలని తెలుపటం సమంజసం.

సిద్ధాంతాలను రాయటం, మాట్లాడటం కాక ఆచరించటం ముఖ్యమని, అందుకు ఎన్ని ఆటంకాలు, నష్టాలు ఎదురైనా జంకక తనజాతి ఔన్నత్యంకోసం తుదివరకూ పోరాడాలనే సహజ ప్రతి గృహంలోనూ సంభవించాలి.

-సరళ
మంగళగిరి

## 'సూపర్‌హిట్'

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'సంభవామి గృహేగృహే' నవల ఆద్యంతం అత్యంత ఆసక్తికరంగా నడిచింది. సంఘటనల్ని మలచడంలోను, వాటిని చదివించే విధంగా రాయడంలోను రచయిత తన ప్రతిభను ప్రదర్శించి సఫలీకృతుడయ్యాడు. ఇందులోని సంఘటనలు నిజజీవితంలోనివే. కాని పరిష్కారాలు మాత్రం అభూతకల్పనలు. నవల కల్పిత రచనేకాని వాస్తవిక కల్పన వుండాలి. ముఖ్యంగా వ్యధార్ధ, జీవిత యదార్ధ దృశ్యాలను ప్రదర్శించేటప్పుడు రచయిత వాస్తవికతను తప్పనిసరిగా ప్రతిబింబించాలి. హారతిని, పీతాంబరాన్ని, కామేశాన్ని ఎడ్యుకేట్ చేయడం కోసం ఎన్నుకున్న మార్గం సరైంది కాదని రచయితే ఒక చోట చెప్పారు. వ్యక్తిలో ఒక క్షణంలో వచ్చిన మార్పు శాశ్వతంగా నిలవదు. పైగా ఎవరో వచ్చి ఉపన్యాసమిస్తే ఆ ఉపన్యాసానికి ఇంట్లోవాళ్లు కూడా సపోర్టు చేస్తే వాళ్లు మారతారనడం పూర్తిగా సినిమాటిక్కే. నవలలోని చివరి సంఘటన పుత్రకామేష్టిని ఎదుర్కోవడం నిజంగా సినిమాల్లో చూపించే క్లైమాక్సే. రచయిత ఈ నవలలో ప్రతిపాదించే ప్రతి సంఘటన సినిమాను దృష్టిలో వుంచుకొని రాసారేమో అనిపిస్తుంది. ఈ నవలను సినిమా తీస్తే ఒక 'ప్రతిఘటన' లాగానో ఒక 'కర్తవ్యం' లాగానో సూపర్‌హిట్ అవుతుంది.

-బి.మాధవరావు
కానూరు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

